# అభిమానులు



| | |
|---|---|
| శ్రీ రాజా వెంకటమురళి మనోహరరావుగారు | మంచిరాల |
| ,, కొత్త పుల్లయ్యలింగం అండ్ బ్రదర్సువారు | ,, |
| ,, పెండ్యాల చిన్నయ్యగారు | ,, |
| ,, జవ్వాది లక్ష్మయ్యనాయుడుగారు | పెనుగొండ |
| ,, నూలి లక్ష్మినారాయణజమీందార్ వారు | ,, |
| ,, నాగుబండి చినకృష్ణయ్యగారు | వరంగల్ |
| ,, తడవర్తి పున్నయ్య అండ్ బ్రదర్సువారు | రాజమండ్రి |
| ,, జూపూడి వెంకటేశ్వరరావుగారు | ,, |
| ,, కారుమూరి సర్వేశలింగంగారు | ,, |
| ,, శీమకుర్తి సుబ్బారావుగారు | ,, |
| ,, వెత్సా వెంకటరత్నంగారు | ,, |
| ,, అన్నం వెంకటరాజుగారు | ,, |
| ,, ఆలమూరి సీతారామస్వామిగారు | ,, |
| ,, పచ్చిగోళ్ళ వెంకటభోగేశ్వరరావుగారు | ,, |
| ,, దూడ వీరాస్వామిరెడ్డిగారు | ,, |
| ,, జి. వరదరావుగారు | ,, |
| ,, జిల్లా సుబ్బారావుగారు | ,, |
| ,, కోరుకొండ బుచ్చిరాజుగారు | ,, |
| ,, నూలు నాగేశ్వరరావుగారు | ,, |
| ,, యడవల్లి రామారావుగారు | ,, |
| ,, కోరంగి వీర్రాజుగారు | ,, |
| ,, గోకవరపు వెంకటసోమరాజుగారు | ,, |
| ,, బాలనాగు రామమోహనరావు అండ్ బ్రదర్సువారు | ,, |
| ,, మిరియాల వెంకటరత్నం అండ్ బ్రదర్సువారు | ,, |
| ,, వుడత్తు నారాయణమూర్తిగారు | ,, |

| | |
|---|---|
| శ్రీ బలభద్ర వెంకట్రాజుగారు | రాజమండ్రి |
| ,, తవిడిశెట్టి సాంబయ్యగారు | కంభంమెట్టు |
| ,, గుడిమెట్ల లింగయ్య అండ్ వందనం మల్లయ్యగార్లు | ,, |
| ,, శిగం నర్సింహంగారు | ,, |
| ,, సుగ్గుల లక్ష్మయ్యలింగం గుప్తగారు | ,, |
| ,, సుగ్గుల తిరుమలరావుగారు | ,, |
| ,, గెల్లా కేశవరావుగారు | ,, |
| ,, రాయపూడి రాములుగారు | ,, |
| ,, కుంచెపర్తి లక్ష్మినారాయణగారు | ,, |
| ,, పసుమర్తి వెంకటలక్ష్మయ్యగారు | ,, |
| ,, పసుమర్తి వీరభద్రస్వామిగారు | విజయనగరం |
| ,, నారాయణ వెంకటచలమూజీగారు | ,, |
| ,, వెత్సా శ్రీరామమూర్తిగారు | ,, |
| ,, వుసిరికల సోమసత్యనారాయణగారు | ,, |
| ,, కొండా శంకరయ్యగారు | సికింద్రాబాద్ |
| ,, బెల్దు జగదీశ్వరయ్యగారు | ,, |
| ,, అల్లాడి వీరయ్యగారు | ,, |
| ,, తేలుగుంట్ల బాలకృష్ణయ్య అండ్ బ్రదర్సువారు | ,, |
| ,, తేలుగుంట్ల నాగయ్యగారు | ,, |
| ,, దండు పెంటయ్యగారు | ,, |
| ,, దండు ఆగయ్యగారు | ,, |
| ,, వి. వి. రామన్‌గారు | ,, |
| ,, ఉప్పల రాజవీరయ్య, శంకరయ్య అండ్ కంపెనీవారు | ,, |
| ,, కైలాసం శరభయ్యగారు | ,, |
| ,, దుండిగల్ల జగదీశ్వరయ్యగారు | ,, |
| ,, ములుగు రాజయ్యగారు | ,, |

| | |
|---|---|
| శ్రీ యిందూరి ఈశ్వరయ్యగారు | సికింద్రాబాద్ |
| ,, పైండా వెంకటనారాయణగారు | కాకినాడ |
| ,, పైడా సుబ్బరామయ్యశ్రేష్ఠిగారు | నెల్లూరు |
| ,, బచ్చు శ్రీరామ గోపాలకృష్ణమూర్తిగారు | వడ్డిగూడెం |
| ,, కర్రి అప్పారెడ్డిగారు | గొల్లలమామిడాడ |
| ,, గోనుగుంట్ల అంకారావుగారు | వినుకొండ |
| ,, రాజా పెద్దసుబ్బారాయుడుశ్రేష్ఠిగారు | నంద్యాల |
| ,, ఉప్పల సత్యనారాయణమూర్తిగారు | అనకాపల్లి |
| ,, ఉప్పల శ్రీరామమూర్తి గారు | ,, |
| ,, అన్నవరపు సుబ్బారావుగుప్తగారు | విజయవాడ |
| ,, ఆలపాటి కుటుంబరావుగారు | ,, |
| ,, కాకరపర్తి భావన్నారాయణగారు | ,, |
| ,, డాక్టర్. ఉరటి సూర్యనారాయణగారు | ,, |
| ,, చుండూరి శ్రీరాములుగారు | ఏలూరు |
| ,, మోతే నారాయణరావుగారు | ,, |
| ,, శీర్ల బ్రిహ్మయ్య గారు | ,, |
| ,, యాదా నరసయ్యగారి జగన్నాథంగారు | పెదపల్లి |
| ,, పసుపర్తి రాఘవులుగారు | ,, |
| ,, జవ్వాది సత్యనారాయణగారు | ,, |
| ,, గుర్రం రామన్నగారు | ,, |
| ,, యాదా వైకుంఠంగారు | వరంగల్ |
| ,, చీదర రాజశేఖరంగారు. | ,, |
| ,, భూపతి కృష్ణమూర్తిగారు | ,, |
| ,, మొరుకుల పాపయ్యగారి కృష్ణయ్యగారు | ,, |
| ,, మదూరి శంకరలింగంగారు | ,, |
| ,, తోట సోమయ్యగారి శివలింగంగారు | ,, |
| ,, దేవిడీ జమీందారిణి గారు | దేవిడి |

| | |
|---|---|
| ,, బచ్చు వెంకటేశ్వర్లుగారు | విజయవాడ |
| ,, పచ్చిపులుసు వెంకటసుబ్బారావుగారు | ,, |
| ,, తడవర్తి నాగపోతరావుగారు | బందరు |
| ,, దారా విశ్వేశ్వరరావురాఉ | ,, |
| ,, వుప్పుటూరి వున్నారావుగారు | గుంటూరు |
| ,, తుమ్మలపల్లి సత్యన్నారాయణమూర్తిగారు | పిప్పర |
| ,, పులవర్తి వెంకటసుబ్బారావుగారు | ఆకివీడు |
| ,, యిన్నమూరి చెంచయ్యగారు | రాజమండ్రి |
| ,, పెమ్మాడ రామారావుగారు | ,, |
| ,, అద్దేపల్లి అప్పలరాజుగారు | ,, |
| ,, బచ్చు సత్యానందంగారు | ,, |
| ,, కురిచేటి జనార్దనంగారు | భద్రాచలం |
| ,, దూబగుంట శ్రీరామమూర్తిగారు | కొత్తగూడెం |
| , పరశురాం లక్ష్మీజీగారు | ,, |
| [illegible]న్ గారు | రాజమండ్రి |
| | ,, |

వాణీ గ్రంథమండలి
రాజమహేంద్రవరము

వెల 1-8-0

ప్రచురణ ౩

# త్యాగి

గ్రంథకర్త:

భాట్టం సూర్యప్రకాశశర్మగారు



వాణీ గ్రంథమండలి
రాజమహేంద్రవరము

వెల 1-8-0

# విజ్ఞప్తి

ఆంధ్రమహాశయులారా!

వాణీ గ్రంథమండలి యను పేరుతో నొక గ్రంథమాలను యేర్పాటుచేసికొని ప్రథమ ప్రచురణగా 'కాలచక్రము' ను వెలువరిచితిమి.

ద్వితీయ ప్రచురణగా 'త్యాగి' యను నవలనువెలువరిచితిమి.

మాగ్రంథమండలియం దాదరాభిమానముల నొసంగవలయునని, గ్రంథకర్తలను, భాషాభిమానులను, గ్రంథాలయాధిపతులను, మ్యునిసిపల్, జిల్లాబోర్డు అధ్యక్షులను మాకు చేయూత నొసంగవలయునని కోరుచున్నాము.

రాజమహేంద్రవరం
10—12—49

ఇట్లు,
వ్యవస్థాపకుడు.

# త్యాగి

## మొదటి ప్రకరణము.

అది వైశాఖమాసము. ఎండతీవ్రముగా నేయున్నది. మధ్యాహ్నము రెండుగంటల సమయం. ఘూమశకటము ధుమధుమలాడుచు ధూమపంక్తుల దిక్కులనెల్ల గప్పివైచుచు, దిక్కులుపిక్కటిల్ల నడుమ నడుమ యరచుచు ఆయాసంబన నేమోయెఱుంగక మోయుచున్న భారంబునను సరకుగొనక వేవేగ గమ్యస్థలంబరయుచు బోవుచున్నది. అది మూడవతరగతిపెట్టె. అందు సామాన్యులు సామాన్యముగా పయనము సేయుచుందురు. జనసమ్మర్దముగా నుండును. కొందరు దీర్ఘకాయులు తమపాలిటి యమలోకమో యన నాయిరుకు స్థలంబుల నిరుకుకొన పెనగులాడుచుండిరి. పదుల పడిగాపుల గుర్తింపని పారుబోతులు కొందరు అంతటిక్లిష్టపరిస్థితులలోగూడ పైనసామానుల బెట్టుకొనెడు బల్లలపై బరుండి పరాకులేని సుఖనిద్రనుబోవుచుండిరి. పైనపెట్టుకొన స్థలంబులేమింజేసి పాపమా ప్రయాణికులు త్రోవలయందే తమసామగ్రుల పెట్టుకొని వానిని గాపాడుటకై తాము నిలువంబడి పార్శ్వంబులనున్నవారలకు పరాకుజెప్పుకొనుచు గమ్యస్థానంబునకై కలవరించుచు పడిగాపులపడుచుండిరి. అట్టియెడ నొకమూలగా సామానులుపెట్టుకొనెడు బల్లపై నొకవ్యక్తి గాఢనిద్రాపరవశుడై యున్నాడు. మాసిపోయినదుస్తులను సంస్కారములేని శిరోజములను పెరిగిన గడ్డమునుబట్టిచూడ యాతడొక ముష్టివాడేమోనని భ్రమగొల్పుచుండును. వికారాకృతిగల్గి చూపరుల కను

హ్యాంబుగొల్పుచు నావ్యక్తి మైమరచి నిద్రించుచున్నాడు. అట్టియెడ టికెట్ కలెక్టరు ఆనందరావుఆపెట్టెలోప్రవేశిస్తాడు. అందరిటిక్కట్లూ పరీక్షచేస్తూ పైనపండుకొనియున్న పెద్దమనుష్యులనుచేతితోతట్టి లేపుతూ వారివారిటిక్కట్లను పరీక్షచేస్తూ క్రమంగా వెనుక చెప్పినవ్యక్తి పండుకొనియున్న మూలకు అతికష్టముతోజేరి వానిని చేతితోతట్టి లేపును.

“ఏయ్! మిస్టర్! టికెట్, టికెట్!!” ఆవ్యక్తి కదలడు గాఢ నిద్రలోవుంటాడు.

“ఏయ్, మిస్టర్! టికెట్ ప్లీజ్!” గట్టిగా వానిని చేతితో తట్టి లేపుతాడు. ఆవ్యక్తి ఉలికిపడిలేస్తాడు. నిదురమత్తులో వుంటాడు. టికెట్ కలెక్టరు మళ్లీ అడుగుతాడు.

“టికెట్! టికెట్!”

“ఆ.........” ఆవ్యక్తి కంగారుపడి టికెట్ కలెక్టరును చూచి తెల్లబోతాడు.

“టికెట్, ఏదీ...?...”

ఆవ్యక్తి జేబులుతడుముకుంటూ మెల్లగా దీనముఖముతో అంటాడు “లే...దు...” దాంతో టికెట్ కలెక్టరు స్థాయిగానిలబడి అడుగుతాడు.

“ఏం...?...?ఎందుకు లేదూ...కొనలేదా...మహా ఉన్నవాడిలా జేబులుతడిమావే!...దిగు దిగు...క్రిందకు దిగు...అధికారస్వరంతో గ్రుడ్లుపెద్దవిచేసి అంటాడు.

ఆవ్యక్తి బల్లనుండిక్రిందకు దిగుతాడు.

“కొనలేదు సార్!...” మందస్వరంతో దీనముఖంతో అంటాడు. దాంతో టికెట్ కలెక్టరు హేళనపూర్వకంగా—

"కొనలేదు సార్!...ఏం?...ఎందుకుకొనలేదూ...ఇదేమైనా మీతాతగారి స్వంతమనుకున్నావా" గట్టిగా కంఠం బొంగురుపోయే లా తనఅధికారంఅంతా దాంతో అందరకు తెలియాలని అరుస్తాడు. పెట్టెలోనున్నవారంతా ఈచిత్రం ఏంజరుగుతుందా అన్నట్లుచూస్తూ ఉంటారు వినోదంగా. వీరివంక, ఇంకాటిక్కెట్లులేని స్పెషల్ తరగతి పెద్దమనుష్యులు టికెట్ కలెక్టరు బాధపడలేక వానిదృష్టిలో పడడ మిష్టపడక ప్రక్కలకు నెమ్మదిగా తొలగిపోయి స్టేషను ఎప్పుడు వచ్చునా అని నిరీక్షిస్తూవుంటారు.

"చిత్తం! లేదండి,... అల్లాఅయితే తమరెందుకిల్లా అడుగు తారూ..."ఇంచుక వక్రంగాను తీవ్రంగాను అంటాడు ఆవ్యక్తి, దాంతో ఆనందరావుకు కోపం హెచ్చుతుంది. వడలు తాటియాకు మంటవలెమండి...హేళన నభినయిస్తూ...కనుబొమ లెగుర వేస్తూ—

"అబ్బో!...చాలా పొగరుగానేవుందే వ్యవహారం...ఏవూ రెడుతున్నారుబాబూ...తమరు"

"ఇక్కడికేలెండి...ప్రక్కస్టేషన్లోదిగిపోతాను...' అంటాడు హీనస్వరంతో టికెట్ కలెక్టరుకు కోపంవచ్చినట్లు గ్రహించి,

"అయితే ఏవూరునుంచి...ఈప్రయాణం..." క్రోధంతో గట్టిగా అడుగుతాడు.

"గుంటూరుకు ఇవతలగా ఎక్కాను..."

"అయితే టిక్కెట్టెందుకు కొనలేదూ..."

"కొనడానికి వీలులేక పోయిందండీ..." మందస్వరంతో అంటాడు.

"ఏం...?...ఎందుచేతనండోయ్...!" అంటాడు హేళన పూర్వకంగా ఒకసారిపెట్టెలోనివారందరికేసి సగర్వంగా చూస్తూ—

హ్యాంబుగొల్పుచు నావ్యక్తి సైమరచి నిద్రించుచున్నాడు. అట్టియెడ టికెట్ కలెక్టరు ఆనందరావుఆపెట్టెలోప్రవేశిస్తాడు. అందరిటిక్కెట్లూ పరీక్షచేస్తూ పైనపండుకొనియున్న పెద్దమనుష్యులనుచేతితోతట్టి లేపుతూ వారివారిటిక్కెట్లను పరీక్షచేస్తూ క్రమంగా వెనుక చెప్పినవ్యక్తి పండుకొనియున్న మూలకు అతికష్టముతోజేరి వానిని చేతితోతట్టి లేపును.

"ఏయ్! మిస్టర్! టికెట్, టికెట్!!" ఆవ్యక్తి కదలడు గాఢ నిద్రలోవుంటాడు.

"ఏయ్, మిస్టర్! టికెట్ ప్లీజ్!" గట్టిగా వానిని చేతితో తట్టి లేపుతాడు. ఆవ్యక్తి ఉలికిపడిలేస్తాడు. నిదురమత్తులోవుంటాడు. టికెట్ కలెక్టరు మళ్లీ అడుగుతాడు.

"టికెట్! టికెట్!"

"ఆ........" ఆవ్యక్తి కంగారుపడి టికెట్ కలెక్టరును చూచి తెల్లబోతాడు.

"టికెట్, ఏదీ...?..."

ఆవ్యక్తి జేబులుతడుముకుంటూ మెల్లగా దీనముఖముతో అంటాడు "లే...దు..." దాంతో టికెట్ కలెక్టరు స్థాయిగానిలబడి అడుగుతాడు.

"ఏం...?...?ఎందుకులేదూ...కొనలేదా...మహా ఉన్నవాడిలా జేబులుతడిమూచే!...దిగు దిగు...క్రిందకు దిగు...అధికారస్వరంతో గ్రుడ్లుపెద్దవిచేసి అంటాడు.

ఆవ్యక్తి బల్లనుండిక్రిందకు దిగుతాడు.

"కొనలేదు సార్!..." మందస్వరంతో దీనముఖంతో అంటాడు. దాంతో టికెట్ కలెక్టరు హేళనపూర్వకంగా—

"కొనలేదు సార్!...ఏం?...ఎందుకుకొనలేదూ...ఇదేమైనా మీతాతగారి స్వంతమనుకున్నావా" గట్టిగా కంఠం బొంగురుపోయేలా తనఅధికారంఅంతా దాంతో అందరకు తెలియాలని అరుస్తాడు. పెట్టెలోనున్నవారంతా ఈచిత్రం ఏంజరుగుతుందా అన్నట్లుచూస్తూ ఉంటారు వినోదంగా పిరివంక, ఇంకాటిక్కెట్లులేని స్పెషల్ తరగతి పెద్దమనుష్యులు టికెట్ కలెక్టరు బాధపడలేక వానిదృష్టిలో పడడ మిష్టపడక ప్రక్కలకు నెమ్మదిగా తొలగిపోయి స్టేషను ఎప్పుడు వచ్చునా అని నిరీక్షిస్తూవుంటారు.

"చిత్తం! లేదండి,... అల్లాఅయితే తమరెందుకిల్లా అడుగుతారూ..."ఇంచుక వక్రంగాను తీవ్రంగాను అంటాడు ఆవ్యక్తి. దాంతో ఆనందరావుకు కోపం హెచ్చుతుంది. వడలు తాటియాకు మంటవలెమండి...హేళన నభినయిస్తూ...కనుబొమ లెగుర వేస్తూ—

"అబ్బో!...చాలా పొగరుగానేవుందే వ్యవహారం...ఎవ్వరెడుతున్నారుబాబూ...తమరు"

"ఇక్కడికేలెండి... ప్రక్కస్టేషన్లోదిగిపోతాను...' అంటాడు హీనస్వరంతో టికెట్ కలెక్టరుకు కోపంవచ్చినట్లు గ్రహించి,

"అయితే ఎవ్వారునుంచి...ఈప్రయాణం..." క్రోధంతో గట్టిగా అడుగుతాడు.

"గుంటూరుకు ఇవతలగా ఎక్కాను..."

"అయితే టిక్కెట్టెందుకు కొనలేదూ..."

"కొనడానికి వీలులేక పోయిందండీ..." మందస్వరంతో అంటాడు.

"ఏం...?...ఎందుచేతనండోయ్...!" అంటాడు హేళన పూర్వకంగా ఒకసారిపెట్టెలోనివారందరికేసి సగర్వంగా చూస్తూ—

"........."మౌనం దాల్చి పాపమా వ్యక్తి ఏమి చెప్పా దునా అని ఆలోచిస్తూ బుర్ర క్రిందకు దించుకు నిలబడతాడు.

"ఇల్లాగ ఈ బైరాగి టికెట్టుతోనే మాకన్నుకప్పి పోదా మనా బాబూ...నీఉద్దేశ్యం...?"

"అబ్బే! నావుద్దేశ్యం...అది..." అంతలోకి మాటకడ్డు వచ్చి—

"సరేలే నీవుద్దేశమేమైతే నాకేంకాని..., డబ్బుతియ్యి...ఏ వూరెడతావో Pass, రాసిస్తాను..." జేబులోని Pass book తీసితిరుగ వేస్తావుంటాడు.

"డబ్బా...!...అయ్యా! ప్రక్కస్టేషన్లోనే దిగిపోతానండి... అంటాడు బ్రతిమాలుతూ దీనంగా.

"దిగి...ప్రక్కపెట్టెలోఎక్కుతావు...అంతేగా...?" పరీక్ష గా వాని కేసిచూస్తూ ప్రశ్నిస్తాడు. ఇంతలోకి అప్రక్కనేయున్న ఒక ఆసామీ...కాస్తపల్లెటూరు నివాసితలపాగా సర్దుకుని కుడిచేతిలోని కఱ్ఱ యెగమచేతిలోనికి మార్చి కాలుస్తూన్న పొగచుట్టతీసి చేత్తో పట్టుకుని ఏదోవాని నుద్ధరించేవాడిలా అంటాడు.

"మేట్టారు....సాలామంచోరు.... డబ్బులిచ్చెయ్యకూడదం టయ్యా!...తప్పునేసి పైగా ఆరితోవాదన... దేనికీ...?" ఆఆసామీ కేసి ఒకమారు బుర్రయెత్తిచూచి కొంచం నెమ్మదిగా ఆనందరావు దిక్కే అంటాడు.

"ప్రక్కస్టేషన్లోనే దిగిపోతానుసార్!...డబ్బులు..." ఇంక మాట్లాడలేకపోతాడు.

"అల్లాంటివేవీ పనికిరావు...త్వరగా తియ్యాలి డబ్బు..." తొందరగ విసుగుదలతో అధికార స్వరంతో అంటాడు.

"........."ఆవ్యక్తి ఏమి చెప్పడానికి పాలుపోక జేబులోని కొద్దిపాటిసొమ్మును యిచ్చి వేయడమా...ఇచ్చి వేస్తే ముందు దారి యేది...అని యోచిస్తూవుంటాడు. టికెట్ కలెక్టరింకక్కడ నిలబడ లేకపోతాడు విసువుపుడుతుంది.

"ఓహో! ఇదెక్కడో గద్దరకంలా ఉందే,...బాగుంది నాలు గుతగిలిస్తే కాని కుదిరేలా లేదీరోగం... సరేకూర్చో ప్రక్కస్టేషన్ వస్తోంది...పోలీసులకు వప్పగిస్తా..."స్థిరచిత్తంతో తీసినPoss book మరల జేబులో పెట్టుకుంటూ అంటాడు టికెట్ కలెక్టరు.

దాంతో ఆవ్యక్తి ఉలికిపడి భయంతోను కంగారుగాను ఆనందరావును పలువిధముల బ్రతిమాలుతాడు.

"పోలీసులా!...అయ్యా!...డబ్బిచ్చేస్తానండీ... Pass వ్రాసి వ్వండీ..." చేతులువణుకుతూవుంటాయి జేబులోని డబ్బు యీవ లకు తీస్తూవుంటాడు.

"ఏం? ఇందాకా లేనిది ఇప్పుడెల్లావచ్చిందీడబ్బు?...సరే... ఏవూరెడుతావు_?" అంటాడు మిగిలిన సంగతులన్నీ తనకెందుకని. పైగా స్టేషను దగ్గరకు వచ్చేసిబండి. తానాస్టేషన్లో దిగిపోవాలి.

ఆవ్యక్తి పాపం భయపడుతూ ఏంచెప్పనాఅని యోచిస్తూ ఏంచెప్పటకు తోచక అల్లాగే నిలబడిపోతాడు. దాంతో టికెట్ కలెక్టరు ఆనందరావుకు ఆవ్యక్తిమీద అనుమానం కల్గుతుంది. వానిని ఆపాదమస్తకం పరీక్షగాచూస్తాడు. ఇంతలోకి బండి స్టేషన్ చేరుతుంది. అది విజయవాడ స్టేషను. ప్లాట్ఫారంనిండా క్రిక్కిరిసి పోయి నిలబడి వుంటారు ప్రయాణికులు. ఇంకా బండిపూర్తిగా ఆగ కుండానే బండిలో ప్రవేశిద్దామనే ఆత్రుతతో యిటుఅటు పరుగు లెత్తుతూంటారు. కూలివాళ్ళసందడి హెచ్చుగా వుంటుంది. చుట్టలు

బీడీలు అమ్మే కుర్రాళ్ల అరవులతోను, తినుబండారముల నమ్మే వర్తకుల కేకలతోను కోలాహలంగా వుంటుంది స్టేషను. లోనున్న వాళ్ళు బైటకుపోవుటకు, తమకు లోపలస్థలమెక్కడ దొరకదో అన్న ఆత్రుతతో బైటవారు పెట్టెలలోనికి బోవుటకు ద్వారమువద్ద బలాబలములు చూసుకుంటూ వుంటారు. ప్రమాదసూచకంబగు ఎరుపురంగు, టోపీలను ధరించిన ప్రమాదవ్యక్తులగు పోలీసువారు సందడిగా యిటునటు తిరుగాడుచుందురు. అచ్చట బండి చాలసేపటి వరకు నిలచియుండుటచే కాఫీఫలహారములకై బోవువారు, స్త్రీల పెట్టెలయందున్న తమ యాడువారు క్షేమముగా నుండిరో లేదో యనియు, వారికేమయిన పదార్థములు కావలయునోయనియు ఆ దొరకిన యవకాశంబును విడనాడక బర్వులిడెడు పలువురుజనంబులతో నాప్రదేశమంతయు మిక్కిలి సందడిగా వుండును. ఇంకెట్లయినా స్టేషనువచ్చిన దగుటచే టికెట్ కలెక్టరు ఆనందరావు ఆ వ్యక్తితో "సరే, ఆసంగతి అక్కడే తేలుతుంది...దిగునాయనా దిగు..." అంటూ ఆవ్యక్తిచేయి పట్టుకుని క్రిందకు దిగుతాడు. ఆవ్యక్తిపాపం మిగుల భయపడుతూ వుంటాడు. వానికొక పాతిక వత్సరముల వయసుండును. కాని పాపం ఎందుచేతనోగాని మిగుల చిక్కిపోయి నీరసంగానున్న ట్లగపడుచున్నాడు. వానిముఖలక్షణాలనుబట్టిచూస్తే ఎందుచేతనోగాని ఆతడు దేనికో భయపడుచున్నట్లున్నాడు. కాని వానినేత్రంబులందొక్క అపూర్వజ్యోతిమాత్రము కానవచ్చుచున్నది. ఆవ్యక్తి విధిలేక టికెట్ కలెక్టరు ననుసరిస్తాడు. ఇద్దరూ ప్లాట్ ఫారంమీద నడుస్తూవుంటారు. టికెట్ కలెక్టరు ఆ వ్యక్తిచేయివిడిచి వాని ప్రక్కనే నడుస్తూ వుంటాడు. ఒకరైల్వే పోలీసు వీరికి ఎదురుగావస్తూ వుంటాడు. వానినిచూచిఆవ్యక్తికంగారు పడి ఆనందరావుదిక్కు...

"అయ్యా! క్షమించండి...నాదో చిన్నమనవి..." దీనంగా అంటాడు.

ఆనందరావు వులికిపడి పరీక్షగా వానికేసి చూస్తూ

"ఆ!...మనవా!...ఏమిటది?"

"ఏమీ లేదండీ...నాయందు కొంచెం దయచూపించండి సార్! తర్వాత చెప్తాను."

"ఏమిటీ...తర్వాత చెప్తావా? ... ఏమిటది?" వేగంగా ప్రశ్నిస్తాడు.

"మీరు నన్నిప్పుడు పోలీసులకు Handover చేస్తారా...?" భయపడుతూ ప్రశ్నిస్తాడు.

"మరేంచేస్తాననుకున్నావ్..." గ్రుడ్లు పెద్దవిచేసి అధికార స్వరంతో స్థిరభావంతో అంటాడు.

"అల్లా చేయవద్దనే నేనుకోరేది...కొంచం దయచూపండి... దీనముఖంతో బ్రతిమాలుతాడు.

"ట్రైన్ లో చాలా బింకంగా మాట్లాడేవే..." కొంటెగా ప్రశ్నిస్తాడు.

"అది బింకంకాదు...మీ చేతికి చిక్కి బింకంచూపగలనా—"

"అయితే ఏమంటావు?..."

"ఏముందండి...మీరు కొంచం అవకాశంయిస్తే..."

ఇంతలోకి రైల్వే పోలీసు వీరివద్దనుండి పోతూ టికెట్ కలెక్టరును బాగుగా ఎరిగియుండుటచే వానికి సలాంపెట్టి పోతాడు. ఆనందరావు ఈవ్యక్తిని గురించి యోచిస్తాడు. వానిమాటలతీరు, వానివాలకముచూసి అతడేదో గూఢమయిన విషయం చెప్పనేమో అని, అతడేదో కష్టదశలోవుండి ఉండునని ఊహిస్తాడు.

"అయితే, అసలుసంగతేమిటి?...ఎక్కడనుండివస్తున్నావు?"

"నెమ్మదిమీద అన్నీ సవిస్తరంగా చెప్పగలను..." అతి నీరసంగా చెప్పగలను..." అతినీరసంగా మాటలాడలేక మాట లాడలేక తడబడుతూ అంటాడు. వానిస్థితిచూచేసరికి ఆనందరావుకు జాలికలుగుతుంది. అతనికిపాపం కొద్దిరోజులనుండి సరియగు ఆహా రముకూడ లభించలేదేమోయని శంకించాడు.

"పాపం, చాలా నీరసంగావున్నావు ... ఎన్నాళ్ళయింది భోజనంచేసి?" ఆనందరావుకు ఆనూతనవ్యక్తిపైని చెప్పలేనిన్నూతన మధురభావమేర్పడినది.

"రెండు రోజులయిందండి నేను భోజనముచేసి..."

"అయ్యయ్యో! పాపం...రెండు రోజులనుంచీ ఎల్లావున్నావో ఆకలితో..."

అల్లాగే మాట్లాడుకుంటూ యిద్దరూ ఫ్రెష్ మెంటురూమ్‌కు వెడతారు. లోపల ఒక ప్రత్యేకస్థలంలో ఆనందరావొక కుర్చీమీద కూర్చుంటాడు. ఆవ్యక్తి హోటలుహాలులోవున్నవారిని నలుమూలలా పరిశీలిస్తూ ఆనందరావు ప్రక్కన నిలబడి కూర్చోడానికి సందేహిస్తూ వుంటాడు. బట్లరొకడు వస్తాడు ఆనందరావువద్దకు. సందేహిస్తూ నిల్చున్న ఆవ్యక్తిని ఆదరణగాచూస్తూ బట్లరుకు ఏవేవో తెమ్మని ఆర్డరిచ్చి ఆవ్యక్తిని కూర్చోమంటాడు.

"కూర్చో, ఫరవాలేదు...సావకాశంగా టిఫెన్ చేస్తూ చెప్పు నీసంగతేమిటో..."

కృతజ్ఞతాపూర్వకంగా దీనమయిన ముఖంతో టికెట్ కలెక్ట రును చూస్తూ ఆప్రక్కగానున్న కుర్చీలో కూర్చుంటాడు. ఈలోగా బట్లరు ఫలహారములను తెచ్చి బల్లమీద అమరుస్తూ అస

హ్యముగానున్న ఆవ్యక్తిని చూసి అక్కడ కూర్చున్నందులకు ఎంతో అట్టహాసం చేయబోతాడు. వెంటనే ఆనందరావు ఆవ్యక్తి తన సంబంధీకుడేనని బట్లరుకు తెలియచెప్పిన మీదట బట్లరు సంగతి యేమో తెలియక వెఱ్ఱిగా వానికేసి చూస్తూ వెళ్ళిపోతాడు తనపని మీద. తర్వాత టికెట్ కలెక్టరు ఆవ్యక్తితో సంభాషిస్తూ ఫలహారం తింటూంటాడు.

"ముందు అదితిను ... తర్వాత మాటలాడుకోవచ్చు ... పాపం అకలితోవున్నావు..."

"తమరు చాలా దయగలవారండీ..." అంటాడు ఒక వేడి నిట్టూర్పువిడుస్తాడు. ఏదో తనకు సాయముచేయుటకై ఈటికెట్ కలెక్టరును భగవంతుడే చూపినాడని భావించాడా నూతనుడు. ఆనందరావుపైకి ఒక విధమగు భక్తిగౌరవాలు ఏర్పడ్డాయి వానికి.

"ఆ...!దానికేంలే...ముందదితిను..." ఆవ్యక్తి టిఫెన్ తింటూంటాడు. ఆనందరావుకూడ తింటూంటాడు. పాపమెంత ఆకలితోవున్నాడో యేమో కడుపునిండా పూర్తిగా తిన్నాడు. అతడు వలదనేవరకు పెట్టించాడు టికెట్ కలెక్టరు...

"అయితేనీపేరు..." దాంతో ఆవ్యక్తి తటాలునఆగి క్షణ కాలం యోచించి,

"ఆ!...నాపేరు ప్రభాకరరావండి...నాప్రయాణం..."

చెప్పడానికి సందేహిస్తూవుంటాడు. అది గ్రహించి ఆనంద రావు కొంచం సౌమ్యంగా ప్రశ్నిస్తాడు.

"ఏం?...అలా సందేహిస్తున్నావ్... చెప్పు ఎక్కడనుండో"

ఆవ్యక్తి ఏమీ మాటపల్కకుండా టికెట్ కలెక్టరు ముఖం లోకి పరీక్షగా చూస్తూ యోచిస్తూవుంటాడు చెప్పడమా, మాన

డమూ అని, దాంతో అతడేదో గూఢవిషయమును గుప్తపరచు చున్నాడని ఆనందరావుకు అనుమానముకల్గినది ఎల్లాగయినా ఆ విషయమేమిటో సవిస్తరంగా తెలుసుకోవాలనే కుతూహలం పట్టు దల హెచ్చాయి, అందుచే కోపంపూర్తిగా మరచిపోయి శాంత భావంతో నెమ్మదిగా ఆవ్యక్తితో సంభాషణలోనికి దిగినాడు.

"ఏం...? అలాసం దేహిస్తూ చూస్తున్నావ్...మరేంభయం లేదు చెప్పు..."

ఆవ్యక్తి ముఖలక్షణాలనుమార్చి స్థిరచిత్తుడై నెమ్మదిగా యిటునటుజూచి చెప్తాడు.

"నేను...మద్రానునుండి...వసున్నాను..."

"మెడాసునుండా..."

ఆవ్యక్తి అవునన్నట్లు బుర్ర ఊపుతాడు. జాగ్రత్తగా ఆనంద రావు ముఖలక్షణాలు పరీక్షచేస్తూవుంటాడు. ఒకాధనుయిన ధైర్యం కల్గుతుంది. ఆనందరావువల్ల తనకేట్టిహాని కలుగకపోదని ఒకవిధముగు సమాధానము మనసునకలుగుతుంది.

"ఊ...హూం...అయితే ఎక్కడకు వెడుతూన్నట్లు ?"

"అదే తెలియదు...ఒకమార్గమని లేదు..." స్థిరచిత్తంతో ధైర్యంగా అంటాడు. ఆనందరావు ఆసమాధానమునకు ఆశ్చర్య పడతాడు. అల్లాంటిసమాధానం అందులోనూ అల్లాంటిస్థితిలో అట్టి వేషంలో అంత నిబ్బరంగా పల్కడంచూస్తే ఆనందరావుకు ఆశ్చర్యం కల్గుటలో అపూర్వమేమీ అగుపించదు.

"ఆ !...చాలాఆశ్చర్యంగా నేవుందే...ఏమిటీవింత...!"

"ఇందులో అంతటి వింతవిషయం ఏమీలేదండీ...నాకూ గమ్యస్థానం తెలియకనే..."

ఆనందరావు విపరీతమయిన ఆవింతచరిత్ర వింటూంటే వెర్రి. యెత్తినవాడిలాఅయిపోయాడు. కొంచంస్థాయిపడి ముక్తసరిగా అడుగుతాడు.

"అంటే, నీవుద్దేశ్యం...?"

"తమరునాకొక Promise ఇస్తే..." అంటాడు ఆశా పూరితనేత్రాలతో ఆనందరావుకేసిచూస్తూ. క్రమంగా ఇదేదో పెద్దగందరగోళములా వున్నదనుకొన్నాడు ఆనంద్.

"Promise ! దేనికి..."

"నావిషయము కొంచం గూఢంగా వుంచవలయునని..."

"గూఢమా !..." పరీక్షగా వానికేసిచూస్తాడు ఆనంద్. ఇదే భయంకర వ్యాపారమో. వీనిచరిత్రఏమిటో. గూఢముగా ఉంచాలంటాడు, గూఢవిషయములెప్పుడు సామాన్యమయినవి అయి వుండవే. ఆనందరావుకిప్పుడేమి చేయడానికి పాలుపోవడంలేదు. సరే అని వాగ్దత్తం చేయడమూ, మానడమూ. ఆనందరావు ఆడితప్పని వాడు. చేస్తే ఏమిపరిమూద విషయాలు చెప్పునో. ఈతడేదయినా పరారిఅయివచ్చిన నేరస్తుడేమో ఏమిచేయుటకుతోచక క్షణకాలం కళవళపడినాడు. కాని ఆనూతనవ్యక్తియొక్క రహస్యచరిత్ర తెలుసుకోనవలయుననెడి అభిలాష ఆనందరావు మనస్సున బలముగా నాటుకొనినది. అందుచే ముందురాబోవువానిని నిర్లక్ష్యముచేయ సాహసించాడు. ఇంతలోకి ఎవరో కొందరువ్యక్తులాప్రక్క బల్ల మీదకువచ్చి కూర్చుండుటచే ఆవ్యక్తి సందేహిస్తూ మాటలధోరణి తగ్గిస్తాడు.

"బైటకుపోదాంరండి..." ఆనందరావు సందేహంతో తొలుత నిర్లక్ష్యముచేసి మరల ఎందుకయినా మంచిదని యోచించి,

"సరే...పదపోదాం..."

ఇద్దరకూ అయినసొమ్ము ఆనందరావు చెల్లిస్తాడు. ముందు ఆనందరావు వెనుక ఆవ్యక్తి అనగా ప్రభాకరరావు ఇవతలకువస్తారు. యిద్దరూవరండాలో నడుస్తూవుంటారు. ఇంతలోకి పోర్టరు వెంకన్న ఆనందరావుకెదురువచ్చి నమస్కారంచేస్తాడు.

"ఆనందబాబూ !..." దాంతో తనతోకూడావున్న టికెట్ కలెక్టరుపేరు ఆనంద్ అనుకున్నాడు ప్రభాకరరావు. ఆనందరావు ఆగి...

"ఏం ?... వెంకన్నా !... ఏమిటిసంగతి ?"

"అయ్యగారు మిమ్మల్ని పిలవమన్నారు బాబూ !..."

"ఎవరు... స్టేషన్ మాష్టరుగారా...?"

"అవునండి... అర్జంటుగా పిలవమన్నారు..."

"సరే, వస్తున్నానులే... వెళ్ళు..."

అని ప్రభాకరరావుతో కలిసి స్టేషన్ మాష్టరుగారిదగ్గరకు బయల్దేరుతాడు. స్టేషన్ మాష్టరు లోపలగదిలో ఏదో వ్రాసుకుంటూ వుంటాడు. పోర్టరు వెంకన్న అక్కడే ఆప్రక్కగా వరండాలో నిలబడి వుంటాడు. ఆనందరావు ప్రభాకరరావు నచ్చటనిల్పి ఆప్రక్కనున్న బల్లమీద కూర్చోమంటాడు. వెంకన్నను ఆప్రక్కకు తనతోకూడా తీసుకువెళ్ళి

"వెంకన్నా !... నువ్వు ఆయనదగ్గరుండు... నేనిప్పుడే వస్తాను..."

"అల్లాగేబాబూ !... అయితే...."

"ఆ... ఆయన మనవారేలే... వూరికిక్రొత్త... అక్కడుండు వస్తాను..."

"చిత్తం !..."

వెంకన్నకు ఇదంతా అగమ్యగోచరంగావుంది. ముష్టివాడిలా అసహ్యంగావున్న ఆమనిషి మనవాడేఅంటాడు. పైగా

ఆయనఅనిఅంటాడు...ఏమిటో ఈగొడవ పాప మావెర్రివెంకన్నకు బోధపడలేదు. అల్లాగే ఏదోఆలోచిస్తూ ప్రభాకర్‌కు కొంచం దూరంగా నిలబడిచూస్తూఉంటాడు.

ఇంక ప్రభాకరరావు బల్లమీదకూర్చుని ఆలోచనా తరంగాలలో తేలిపోతూవుంటాడు. తన ముందుగతి ఏమికానున్నదో! ఏమిటిచేయడమో ఆనందరావును పూర్తిగానమ్ముకొనడమేనా? ఒక అపరిచితవ్యక్తితో కొలది కాలంక్రితం పరిచయము కాగానే వానిని పూర్తిగానమ్మి తనజీవితరహస్యములు వానితో చెప్పడమెట్లు? ఆనంద్ ఎటువంటివాడో, గోముఖవ్యాఘ్రమువంటివాడేమో. అట్లేఅయిన తన్నుగురించి సుమారు రెండువూకలు ఎందుకుఖర్చుచేయును? తన్నంతగా ఎందుకుఆదరించును...ఛీ! ఛీ!! ఆనంద్ అట్టినీచుడయియుండడు. ఏమో! ఏమనిచెప్పగలము...? మానవునిమనస్సు లోతెరుంగ నెవరిశక్యము? అట్లని యిప్పుడిట నుండి తప్పించుకునిమాత్ర మెక్కడికిబోవుదది? సాధుస్వభావుడయిన వీనినినమ్మక యిష్టనుసారముగబోయి ఏయురులలోనయిన చిక్కుకొనవలయునేమో, యని పరిపరివిధముల బోయినవి వాని యోచనలు. ఆనందరావచ్చట ప్రభాకర్‌ను కూర్చుండబెట్టి లోపలకు స్టేషన్‌మాస్టరుదగ్గరకు వెడతాడు. ఆనందరావునుచూచి స్టేషన్ మాస్టరు మందహాసంచేస్తూ

"హల్లో! ఆనంద్...రండి కూర్చోండి..."

"హల్లో! గుడీవినింగ్! నారాయణబాబూ!...ఏమిటి విశేషాలు...నన్నుపిల్చారుట?"

"అంతావిశేషమే.......కూర్చోండి.......మొత్తంమీద సాధించాం..."

"ఆ?...గ్రాంటయిందీ..."

అంటూ అచ్చటికుర్చీలో చిఱుమందహాసం చేస్తూ కూర్చుంటాడు ఆనందరావు. నారాయణబాబు నవ్వుతూ, వ్రాస్తూన్న కలం ప్రక్కన బెట్టి,

"ఇంకా అదొకమాటా...ఎవడికోసం చేస్తాడండీ..."

"ఏదో మొత్తంమీద గట్టి పట్టు పట్టి సాధించారు...లేక పోతే..."

"ఆ...! లేకపోతే వదిలేస్తామటండీ...అల్లా అయితే యింక మన గొప్పేముందీ..."

"ఏమో...ఇంతవరకు నాకానమ్మకం లేదండీ..."

"లేక పోతే ఊరుకుంటామటండీ...సందు దొరికి నప్పుడే పట్టుకోవాలి కంఠం ముడిదగ్గర..."

"ఏదో ఇదంత మీదయు...సాధించారు మొత్తానికి..."

"భగవంతుని దయ అనండి...ఇందులో నన్నంతగా పొగడ వలసిన దేమి లేదు...మొత్తం మీద మీరదృష్టవంతులు, పట్టు పట్టి నందుకు రెండు నెలలు శెలవు పుచ్చుకున్నారు..."

"ఇంత త్వరలో గ్రాంటు చేస్తారనుకోలేదు సుమండీ..."

"అయితే ప్రయాణ మెప్పుడూ..."

"ఇంకా ఆలస్య మెందుకూ...ఏడు గంటల ప్యాసింజరులో ఇవాళే వెళ్లిపోతాను..."

"అబ్బా! ఎంత తొందర...ఎంతచురుకు...ఏమైనా ఇల్లు పేరు చెపితే అంతేలెండీ"

అంటూ శెలవు కాగితము రైలుపాసు ఆనందరావు చేతికిస్తాడు నారాయణబాబు నవ్వుతూ, ఆనందరావు అవి అందుకుని చిఱునవ్వు ముఖంతో చూసుకుని లేస్తాడు ఆసనంమీదనుండి,

"Thanks !...వస్తానండీ..."

"శుభం! వెళ్ళిరండి...అ! అన్నట్లు మీనాయనగారి నడిగినానని చెప్పండి. ఇంటికి చేరగానే ఒక ఉత్తరం వ్రాస్తారా? "

"అల్లాగే...తప్పకుండా...మరిశెలవు..."

"శెలవు! ...వెళ్ళిరండి..."

## 2

ఆనందరావు రైలుపాసు, శెలవుకాగితం భద్రంగా తన జేబులో పెట్టుకొని చిరునవ్వుతో ఈవలకు వచ్చి అచ్చట పరధ్యానంగా ఆలోచనలలో మునిగిపోయిన ప్రభాకరరావును కలుసుకుంటాడు. ఆనంద్ రాకతో ప్రభాకర్ త్రుళ్ళిపడి మరల స్థాయి పడతాడు. పోర్టరు వెంకన్నను పిలిచి ప్రభాకర్‌తో కలసి తనగదికి బయల్దేరుతాడు. ఆనంద్ తాను స్టేషన్‌కు దగ్గరగా ఒక యింటి యందొక గది అద్దెకు తీసుకుని వుంటున్నాడు.

"Come on! ప్రభాకర్ రూమ్‌కు వెడదాంరా..."

ప్రభాకరరావు మారుమాటలేకుండగా ఆనందరావు ననుసరించాడు. వెంకన్నకూడా గదికివెళ్లాడు. అక్కడగదిలో సామాన్లు సర్ది ఒకట్రంకుపెట్టె, ఒకపరుపు ఇవతలపెట్టి గదికితాళంవేసాడు. చేతిగడియారంచూచుకుని "అబ్బా! అరుదాటిందే... వెంకన్నా! ఈసామాను స్టేషనుకు పట్టుకునడు...శెలవుమీద ఇంటికెడుతున్నాను..."

"చిత్తం! బాబూ, మళ్లాఎన్నాళ్ళకిబాబూ!...

"రెండునెలలు శెలవురా!...తర్వాగానడు ప్యాసింజరులో వెడతాను"

వెంకన్న సామాన్లుపట్టుకుని ముందునడుస్తూవుంటాడు. వాడికి కొంచెంవెనకగా ఆనంద్‌ప్రభాకర్‌లు నెమ్మదిగా మాటలాడుతూ నడుస్తూవుంటారు.

"అయితే, ప్రభాకర్ ! నాతో నస్తావా ?..."

ప్రభాకరరావు క్షణకాలంఆగి మరలనమస్తూ ఆనంద్ ముఖకేసిచూస్తూ సంశయంతో,

"మీతోనా !...ఎక్కడకు ?"

"ఏం ..రావడానికేమయినా అభ్యంతరముందా...?

"ఎంతమాట...?"

ఇంతలోకి స్టేషన్ చేరుతారు అంటాను. పదినిమిషాలలో ప్యాసింజరు నిప్పులుకక్కుకుంటూవచ్చి పగవారిపై మీసందువ్విన యోధుడులానిలబడింది. ఆనందరావు ఉత్తర్వుప్రకారం రెండవ తరగతిపెట్టెలో ఇతరులెవ్వరూ లేకుండ ఖాళీగావున్నదానిలో సామాన్లుభద్రంగాపెట్టివచ్చాడు వెంకన్న.

"ఇందవెంకన్నా ! యీరూపాయితీసుకో..."

"శలవుబాబూ !..." అని ఆనందరావిచ్చినరూపాయికళ్ళకద్దుకుని ఆనందరావుకు దండముపెట్టివెళ్ళిపోతాడు. ఆనందరావు ప్రభాకరరావు నాపెట్టెదగ్గరకు తీసుకువెళ్లి అందులోస్థలంచూపించి,

"మిష్టర్ ! నువిక్కడకూర్చో నేనిప్పుడేవస్తాను..."

"అల్లాగే..."

ఆనందరావు ప్రభాకరరావు నారెండవతరగతిపెట్టెలో కూర్చోపెట్టి తాను ప్లాట్‌ఫారంమీదనిలబడియున్న స్టేషన్‌మాస్టరును కలుసుకోడానికివెళ్లాడు. ఇక్కడ ప్రభాకరరావు అన్నింటికి దేముని పై భారంవేసి స్థిరచిత్తంతో కూర్చునివున్నాడు. మరోపావు గంటసేపటికి యుద్ధరంగమందు మహావీరులుచేయు సింహనాదం లాగున ఆపొగబండి కెవ్వునఅరచి బయలుదేరింది. ఆనందరావు త్వరితముగావచ్చి పెట్టిజేరినాడు. ఏడుగంటలుదాటిందిటైము. బండీ జోరుగాసాగిపోతోంది. ఆపెట్టిలో ఆనంద్ ప్రభాకర్‌లుతప్ప యింకెవ్వ

పూలేదు. ఇతరులువినకుండా విషయమంతా విపులంగావినిపింప వీలయినందులకు ప్రభాకరరావు వినుటకవకాశము దొరకినందులకు ఆనందరావు సంతసించారు. ఇద్దరూ కొంచుకన్నా కుదుటపడినాక మరలసంభాషణలోనికి దిగినారు.

"అయితే ప్రభాకర్ ! నువ్విప్పుడెక్కడకు వస్తున్నావో తెలుసునా...?"

"ఎక్కడకు...?" కొంచెం కంగారుపడి ప్రశ్నించును.

"అల్లా కంగారుపడతావేం...మాయింటికే...?

"మీ యింటికా...!"

"అవును...అయితే యింతకూ నీసంగతేమిటో చెప్పావు కావు..."

"నాసంగతా...హూం...!...వింటావా...?"

"ఏం? అల్లాఅడుగుతున్నావు ?"

"నాసంగతివింటే నన్నుపూర్తిగా అసహ్యించుకుంటారు... నన్ను చాలానీచునిగా భావిస్తారు"

"నీచమా...! దేనికి...?"

"నా చరిత్రవింటే..."

"నాకేమీబోధపడడంలేదు...అసలు సంగతేమిటోచెప్పు...?

ఆనంద్‌కు తొందరహెచ్చుతుంది. ఎందుకింత శంకిస్తున్నాడా అని యోచిస్తూవుంటాడు.

"అయితేవినండి సన్తరంగా... కాని..."

"మరేంభయంలేదు చెప్పు...ఏమిటో అది..." పరీక్షగా చూస్తూఅడుగుతాడు.

"అయ్యా ! నేనొక...ఖూ...నీ...నేరస్తుడను.."

ప్రమాణమునననుసరించి నడచుకుంటాను అని చెప్పాను. దానిసంగతి తొందరపట్టి వినదలచాను. అందుచే ముఖ్యలక్షణాలు చూర్చి వెంటనే,

"అబ్బో! మరేం భయపడకు... కాని మానవజన్మ యెత్తి అట్లాటి రాక్షసకృత్యం ఎట్లా చెయ్యగలిగావు... ఎందుకు చేశావూ...?"

ఆనందరావుపైని ప్రభాకర్కు పూర్తివిశ్వాసముకల్గినది. కొంచమయిన మనసుచేయుచుండ జరిగినవిషయమంతా ఆనందరావుకు చెప్ప నిశ్చయించుకున్నాడు

"అయితే సవిస్తరంగా నాచరిత్ర చెప్తాను...వినండి..."

"చెప్పు..."

అనందరావు మిక్కిలి శ్రద్ధగా వింటూంటాడు ప్రభాకరరావు నిశ్చింతంగా చెప్ప ప్రారంభిస్తాడు.

"మిమ్ములను నేను పూర్తిగా నమ్మేను. నారహస్యంఅంతా వెల్లడిచేస్తున్నాను. పైనమీదయ..."

"మరేంభయంలేదు...ఒకసారి మాటయిచ్చి ద్రోహంచేసే వాణ్ణికానని నమ్ము."

"నేను యీసంవత్సరమే B. A. ప్యాసయ్యేను..."

"ఆ!...B. A...."

"అవును...నా అసలు పేరు శంకరావు. ఎందుకయినా మంచిదని పేరు మార్చాను. మిమ్ములను పూర్తిగా నమ్మటచే మీవద్ద నిజస్థితి వెల్లడిచేశాను. నేను మద్రాసులో మాబావగారింటిలోవుండి ఈసంవత్సరమే B. A.పూర్తిచేశాను. మాబావగారు మద్రాసులో ఒక న్యాయవాది. పేరు రాఘవరావుగారు. మాబావగారు మాఅప్పగారు నేను మేముముగ్గురమే ఉండేవారమింట్లో మాబావగారికి సంతతిలేదు. చనిపోయిన వెంకటేశన్ కు మాబావకు గాఢమయిన స్నేహముండేది. ఆవెంకటేశన్ దుర్మార్గుడు. తుంటరి త్రాగుబోతు,

వేశ్యాలోలుడు. కాని బాగుగా డబ్బున్నవాడు. మా బావ సహజంగా చాలా మంచివాడే కాని దుష్టుడగు ఆ వెంకటేశన్ స్నేహముబట్టినాక మా బావలో కూడ విపరీతమయిన మార్పులు ఏర్పడినాయి. త్రాగుడు అలవాటయింది. దాని వెనువెంటనే ఆశ్రయించుకొని వుండే జారత్వముకూడ అబ్బినది. మొదట రహస్యముగా వర్తించినప్పటికి రాను రాను శృతిమించి, చివరకు వారమునకొక పర్యాయము కూడ యింటికి వచ్చుట అరుదయింది. త్రాగుబోతు స్త్రీలోలుడయిన మా బావను నమ్మి వానివద్దకు ఎవరు కేసులను తెత్తురు? దానితో రాబడి కూడ సన్నగిలినది. మద్యదేవత నారాధించువారికి ఉచ్చనీచములు, ముందు వెనుకలు కానరావుగదా. న్యాయవాది వృత్తి మందగించగానే చేతిలో డబ్బు ఆడుటకూడ మందగించినది. ఎట్టిస్థితియందయినను ఇంటిలోని యిల్లాలు లోకువగనుక మా అప్పరాధను బాధింప సాగినాడు. ఆమె వంటిపైని సుమారు నాలుగు వేల రూపాయిల విలువయిన ఆభరణములుండెడివి. భర్త నిర్బంధించగానే అమాయకురాలు రాధ క్రమ క్రమముగా ఆభరణములలో చాలవరకు వాని హస్తగతము చేసినది. నేనన్న యేకారణముచేతనోగాని కొంచం స్థాయిగానే వ్యవహరించేవాడు. నాకతడు రానురాను కంటపడుటయే కష్టమయినది. ఇంటికే వచ్చెడివాడు కాడు. నాకంటబడినప్పుడెల్ల వాని ప్రవర్తనను గురించి తీవ్రంగా ఖండించుచునేయుండెడివాడను. కాని బోధలా ఉన్మత్తుని చెవికిబట్టునా? ఒకనాడు నేను రాత్రి రెండవయాట సినిమా చూచి సుమారు రాత్రి రెండుగంటల సమయమున కింటికి వస్తిని. ఇంటియందేదో మాటలు తీవ్రముగా వినవచ్చినవి...”

ఇంతలో బండి ఆగినది. స్టేషన్‌లోని జనుల హడావడి చూచి ఆనందరావు వస్తానుండమని చెప్పి క్రిందకుదిగి వెళ్ళి ఏవేవో ఫలహారములను (పండ్లను) కొని పట్టుకుని వస్తాడు. కొంచం సేపటికి బండి కదిలింది.

ఆనందరావుకు సుమారిరువదియేడు వత్సరములప్రాయముంటుంది. సుందరయువకుడు, ఉదారస్వభావము. దీర్ఘాలోచనగలవాడు, బుద్ధికుశలుడు. విజయనగరము వారిస్వగ్రామము. రిటైర్డు సబ్ జడ్జీ యనమండ్రి చంద్రశేఖరరావుగారి కుమారుడు. ఇంటరు మీడియేటు ప్యాసయి ఉద్యోగం పురుషలక్షణం అను ఆర్యోక్తి ననుసరించి హైస్కూలుద్యోగం చేస్తున్నాడు. చంద్రశేఖరరావుగారు సంపన్నగృహస్థు. చాలా సాధుస్వభావముగలవారు. ఆనందరావుకు తల్లిలేదు. సుమారు ఆయిదేండ్లక్రితమే చనిపోయినది. సుమారు పదునెనిమిదేండ్ల సోదరి కమలమాత్రము గలదు. కమలచురుకయిన పిల్ల...

* * * * *

అది మద్రాసులో న్యాయవాది రాఘవరావిల్లు. ఒకసుందరమయిన మేడ. నలుప్రక్కల ఆవరణ, చుట్టూఎత్తయిన ప్రహారిగోడ. ఆవరణలో చక్కని పూలమొక్కలు చూచుటకు ఆనందంగా వుంటాయి. రాత్రి సుమారు రెండుగంటల సమయము. అప్పుడే చంద్రుడు అస్తమిస్తూవుంటాడు. నక్షత్రముల లేతవెలుగులలో ఆ యిల్లుకొంచ మస్పష్టముగా కానవచ్చుచున్నది. ఒకవ్యక్తి గబగబా ఆయింటి ఆవరణగేటును తెరచుకుని లోనికిబోయి వరండాలో తటాలున నిలబడి పోతాడు. లోపలినుండి తీవ్రమయిన వికారపు పలుకులు వినవస్తాయి. ఆప్రక్కగా తెరచియున్న కిటికీగుండా లోని విషయంబులను పరీక్షిస్తూవుంటాడు. లోపల ఇద్దరు వ్యక్తులు దేనిని గురించో అల్లరి పడుతూవుంటారు. అందొకరు స్త్రీ. రెండవవాడు పురుషుడు. ఆపురుషుని మాటలధోరణి, చేయుచున్న చేష్టలుచూస్తే మద్యముత్రాగి వడలు తెలియక ప్రవర్తిస్తూన్నటులున్నది. పాపమా స్త్రీని దేనినో ఈయమని బాధిస్తున్నాడు. ఆమె నిరాకరిస్తోంది,

అతడామెను బలాత్కరించి ఆమెతో పెనగులాడుతున్నాడు. లోనున్న వ్యక్తి గ్రుడ్లుపెద్దవిచేసి ఆస్త్రీని పట్టుకుని "ఏమే! ఇస్తావా... ఇయ్యవా...లంజా!" తూలిపోతూ ఉంటాడు. వాని వాలకం చూస్తుంటే ఈవలనుంచి చూస్తున్న వ్యక్తి కోపం హెచ్చిపోతోంది. పాపం ఏందుచేతనోగాని కంటినెంబడినీరు కారుతోంది.

"ఏమయినాసరే ... ఇవ్వను ... ఇప్పటికే చాలామించి పోయింది..." అని ఆస్త్రీవ్యక్తి భయంతో సమాధానమిస్తూ ఏదో ఒక సీసాను చీరమాటున దాస్తుంది. అదిమరేమీకాదు. మానవుల నాకర్షించి ఆహ్వానించి వారలసేవించి మదోన్మత్తులగావించి, వారి పొగడ్తల నందుకుని క్రమముగా వారిని తుదముట్టనాశనముగావించు విచిత్రస్వరూపిణి, మద్యము. ఆఉన్మత్తుడు క్రోధంతో ఆమెతో కలియబడుతాడు.

"ఇంకా మిం...చుతోం...దే ... పాడు ... ముండా... ఇయ్యి...లేకపోతే...చంపేస్తా..."

అంటూ ఆస్త్రీతో కలియబడతాడు. పాపమామె అలసి వాని పశు బలముముందు ఆమెబలమేపాటి. ఆమె వానితో చాలలేకపోయి నది. ఇదంతా ఈవలనుండి చూస్తూన్నవ్యక్తి ఇంకతాళలేకపోయాడు. ఒక్కదాటులో తలుపు తెరచుకుని వారిమధ్యకు వెళ్ళేడు. వెళ్ళడమే తడవుగా ఆపురుషుని ఆమెనుండి విడిపించి కోపంతో ఒక్కతోపు తోసి వేస్తాడు. అసలే మద్యముతాగి మత్తెక్కియున్న ఆవ్యక్తి క్రిందపడి గాయము తగులుటచే స్పృహతప్పుతాడు. అంతలోకే ఆస్త్రీ ఆతురతగా ఆవ్యక్తిని లేవనెత్తుతూ దీనమయిన ముఖంతో అంటుంది.

"ఎంతపని చేశావుతమ్ముడూ...! రక్తంకూడా వస్తోంది చూడు..."

"కోపం ఆపుకోలేక పోయాను అక్కయ్యా!... నావల్లపొర పాటే జరిగింది..."

అంటాడు ఖిన్నుడయి, ఆమెముఖంవంక చూడలేకపోతాడు. ఆమె కంటివెంబడిని ఏకధారగా కారుతూవుంటుంది కన్నీరు. తల కట్టు పూర్తిగా చెదిరిపోయి వుంటుంది. కట్టిన చీరకూడ పెనుగు లాటలో చిందరవందరగా అయిపోతుంది. ముఖమున కుంకుమసగం చెరిగిపోయి వుంటుంది. దీనమయిన ముఖంతో "ఏం చెయ్యను... తమ్ముడూ...ఇంతలా మారిపోతా రనుకోలేదు..."

"విచారించి ఏంలాభం అక్కా...దానిని తప్పించడం సుళు వయిన పని కాదు..."

అంటూ ఇంకక్కడ వుండలేక మేడమీది తనగదిలోకి పోతాడు. ఈలోగా క్రింద నింకొక విపరీతపరిస్థితి ఏర్పడుతుంది. మేడమీదకు పోతూపోతూ ఆవ్యక్తి ప్రక్కగదిలోయున్న మరియొక వ్యక్తిని గమనించలేదు. ఆప్రక్కగదిలోనున్న వాడు పంతము వేసి నట్లు ఒక్కసారిగా నోటవంచుకుని సీసాతో త్రాగేస్తున్నాడు బ్రాందీ. పదినిమిషాలకల్లా పైన మేడమీద మనుష్యుడు ఏమో ఆలోచిస్తూ ప్రక్కమీద మేనువాలుస్తాడు. గాఢనిద్దురలో వుంటాడు. క్రింది గదిలో వ్యక్తి ఈలోగా తూలుకుంటూ ఈవలకు వస్తాడు. ఎదురుగా ఉన్న ఆస్త్రీని చూస్తాడు వడలుమరుస్తాడు. ఆమెదరికేగి ఆమెచేయి పట్టుకుని దగ్గరగా లాగుకుంటాడు.

"రాధా!...దా...పోదాం.. ఒక్కసారి...రా..."

ఆమె అబల వానిబలముముందు ఆమెశక్తియేపాటిది. కాని సత్యశీలయగుస్త్రీ ఆపత్కాలమందు విజృంభించినచో ఆమెముందు నిలువ ఎట్టివారయినను జంకుదురు. అసాధారణమయిన ఆంతరంగిక శక్తులు పరికోపించి విజృంభించిన వాప్రళయభీభత్సము జరిగినదన్న

మాత్రం వానిపట్టు నొక్కు విదలించి తప్పించుకొని దూరముగా తొలగినిలచినది. అప్రక్కగా స్పృహతప్పిపడియున్న వ్యక్తికప్పుడే తెలివివచ్చుచున్నది. రాధ ఆడుసింగమువోలె హుంకరించుచు అట్టహాసముగా బెదరిస్తూవుంటుంది.

"ఛీ!...దుర్మార్గుడా... ఇంతద్రోహమా ... చెల్లెలివంటి దానను...సిగ్గులేదా...జాగ్రత్త! దగ్గరకువచ్చేవా నీప్రాణాలు నీకు దక్కవు..."

ఈదృశ్యాన్ని అప్పుడే తెలివందుచున్న ఆవ్యక్తి ప్లీడరు రాఘవరావుచూచాడు. మైకం కొంతవదలినది. కోపంపట్టలేకపోయాడు. ఆప్రక్కనేయున్న డ్రాయరులోని బాకుతీసి ఆత్రాగుబోతు గుండెలో ఒక్కపోటు పొడిచాడు. కెవ్వున కేక వేసి ఆపోటుకే మరణించాడావ్యక్తి, న్యాయవాది వెంకటేశన్. ఆరక్తంచూచేసరికి రాఘవరావు భయపడ్డాడు. తన్ను తాను మరచిపోయాడు. ఆప్రక్కగా పడివున్న సారాసీసా యెత్తి గడగడ త్రాగేసి సీసా అక్కడపారేసి వెర్రిచూపులుచూస్తూ పోయి ఆప్రక్కనున్న సోఫాలో కూలబడతాడు. పైనున్న వ్యక్తికి మగతనిద్దురలో వెంకటేశన్ అరవువినిపిస్తుంది. తుళ్ళిపడిలేస్తాడు. నలుమూలలా లైటువేసి చూస్తాడు. అన్ని మామూలుగానేవున్నాయి. గబగబా యీవలకువచ్చి క్రిందకుదిగి వస్తాడు. మెట్లమీదనుంచే ఆశవాన్నిచూస్తాడు. ఆభయంకరరక్త ప్రవాహం, ఆశవంచూచి నిర్విణ్ణుడయిపోతాడు. అప్ప రాధవద్దకు వస్తాడు, కంగారుగా ప్రశ్నిస్తాడు...

"ఏమిటిది...అక్కా! ఎవరుచేశారీపని...?"

"ఏంచెప్పను తమ్ముడూ...మీా..." అంటూ భయంతో తన భర్తవంక చూపిస్తుంది,

"ఆ!...బావే...ఎంతపని జరిగిందీ..."

"ఇప్పుడేం చెయ్యడం..." అనుకుంటూండగా ప్రక్కింటి స్కూలు మాష్టరు వెంకట్రావుగారు వచ్చి తలుపు గట్టిగా తట్టి పిలుస్తారు.

"అయ్యా! రఘువరావుగారూ!...ఏమండోయ్!"

అంతలోనున్న వ్యక్తి మన కథానాయకుడయిన శంకర్రావు కొంచం గుండెధైర్యం చేసుకుని నెమ్మదిగా వెళ్లి తలుపు తెరచి వరండాలోకి నడుస్తూ తలుపు దగ్గరగా వేసి-

"అయ్యా! మీ ఇంట్లో ఏదో కెవ్వుమని కేక వినిపించింది ఏమిటండదీ..."

"అబ్బే! మరేం లేదండీ, మా బావగారికి ఏదో పీడకల వచ్చి నిద్దట్లో అల్లా కేక పెట్టారు. అంతకన్న మరేమీ విశేషం లేదు..."

"ఇదిటండీ ఇంతా చేసి...ఏం ప్రమాదమొచ్చిందో అని పరుగెత్తుకు వచ్చాను..."

"అబ్బే! మరేం లేదండి...అంతే..."

"సరే, వస్తానయితే...పోయి పడుకోండి..."

"మంచిది వెళ్ళండి..."

అని తలుపు వేసుకుని లోన గడియ పెట్టి 'అమ్మయ్యా' అని గట్టిగా నిట్టూరుస్తాడు. శంకర్రావు మిక్కిలి బుద్ధికుశలత గలవాడు. మంచి ధైర్యవంతుడు బలశాలి ధైర్యం తెచ్చుకుని అప్పగారు రాధ దగ్గరకు వెళ్ళి నెమ్మదిగా...

"రాధా! ఇప్పుడు ఆలస్యం చేస్తే ఏమీ లాభం లేదు ..నువ్వు ధైర్యంగా పని చెయ్యాలి..."

"మనం త్వరపడాలి...ఇక్కడనుండి ఈ శవాన్ని పరస్థలం చెయ్యాలి..."

"ఎల్లాగ చెయ్యాలి... నాకేమో చాలా భయంగావుంది తమ్ముడూ..."

"అల్లా భయపడితే లాభంలేదు...నాకు అదుగో బావకు మెళుకువ వస్తోంది..."

అతిడికి మెళుకువవస్తే పరిస్థితి విషమిస్తుంది... వెంటనే మరో గ్లాసుడు పట్టెయ్యి..."

ఎల్లాగ చేయుదునాఅని తమ్ముని కేసి చూస్తుంది రాధ. అసలీ గొడవకంతకు మూలం ఆ బావేందీయే...దానికోసమే తానన్ని దెబ్బలుతిన్నది. ఇప్పుడుమళ్లీ తనే ఎల్లాపడుతుంది. పరిస్థితులనుబట్టివర్తించక తప్పదుకదా! విధిలేక రాధ భర్తనోక గ్లాసుడు సారాయిని బలవంతాన త్రాగపట్టింది, మరల రెండునిమిషములకు రాఘవరావు స్పృహతప్పి పడుకున్నాడు.

"రాధా! చాలాధైర్యంగా ప్రవర్తించాలిసుమా! లేకపోతే పరిమాదం. నేను ఆశవంసంగతి చూస్తాను. నువ్వీయింటిప్రదేశమంతా శుభ్రపరచు, నేనిప్పుడే వస్తాను. ఎవరువచ్చినా తలుపు తెరవకు..."

"ఇప్పుడా శవాన్ని ఏంచేస్తావ్?"

"అదంతా యిప్పుడెందుకు, నేనెక్కడో పారేస్తాను...నీపని త్వరగాకానీ..."

అని తొందరగా ఆమెచేయవలసిన పనులన్నీ ఆమెకు బోధించి ఆశవానికి ఒకనల్లని బట్టనుకప్పి అతిసాహసంతోయెత్తి భుజానపెట్టుకుని తలుపుతెరచుకుని ఈవలకువచ్చి...రహస్యంగా సందుగొందులబడిపోయాడు. అట్లుపోయి చాలాసందులు తిరిగి చివరకు సముద్రతీరము చేరేడు. ఆశవమును సముద్రములో పీకలోతు నీటియందు పారవైచి బెదరుచూపులతో యిటునటు పరిశీలిస్తూ సురల ఆసందుల వెంబడినే త్వరితగతిని ఇంటిముఖం పట్టేడు. అట్లు రెండు మూడు

వీధులుదాటుసరికి రాత్రిగస్తీ తిరుగు పోలీసులకంటపడ్డాడు. వాడిని చూడగానే భయపడి పరుగెత్తసాగేడు. రక్తపుబట్టలతోవుండి పారి పోతూవున్న శంకర్రావును చేతిలాంతరుసహాయమునచూచి అనుమా నించి బిగిలొవూది వానిని వెంబడింతురు. నలుమూలలనుండి పోలీ సులువచ్చి వానిని తరుముదురు. అతడెట్లో వారిబారినుండి తప్పించు కుని ఇలుసేరును. వారును వానినన్వేషించుచువచ్చి ఆవీధిలోకేవచ్చి ఆదారినే వైలుప్రయాణమునకై బోవు నొకనిని శంకర్రావునుగురించి ప్రశ్నింతురు.

'ఏమయ్యా! ఈదారిన ఎవరయినా పారిపోతూంటేచూశావా?'

"ఏమో, ఎవరో ఇప్పుడే ఒకవ్యక్తి కంగారుగా ఆయింట్లో కెడుతూంటే చూశాను..."

అని రాఘవరావిల్లుచూపించగానే పోలీసులు ఆవరణగేటు తెరచి లోన ప్రవేశించి వాకలితలువు తట్టుతూ-

"ఏమండీ!...తలుపు...తలుపు...!!"

ఆపోలీసుల అరవుపు వినేసరికి అప్పుడే లోపలప్రవేశించిన శంకర్రావుకు మిక్కిలిభయము ఆవహించినది... ఏమిచేయుటకు తోచలేదు. రాధకు మరీభయము ఎక్కువయింది. లోపల శంకర్రావు దుస్తులు మార్చుకుంటున్నాడు. చాలా ప్రమాదపరిస్థితులలో చిక్కు కున్నాడు. బైటపోలీసులు అల్లరి హెచ్చుగా వుంది. ఈగొడవకు నలు గురూచేరితే చాలాప్రమాదం ఏంచేయడానికి పాలుపోక సోదరిరా ధకు ధైర్యంచెపుతూ ఆమెను వురిగొలుపుతాడు. పైన పోలీసులు గట్టిగా తలుపుతట్టుతూ-

"ఏమండీ ! తలుపుతియ్యండి !!"

"రాధా ! ఇంకలాభంలేదు...కొంచంధైర్యంగావెళ్ళి తలుపు తెరచి అదేదో... నేనీలోగా యీబట్టలుమార్చి దాచివస్తాను."

"చాలా భయంగా వుంది తమ్ముడూ..."

"అల్లా అంటే ఎల్లా చెప్పు...రాధా !...లేకపోతే మనందరికి ప్రమాదం..."

ఆ మాట వినేసరికి రాధకొక్కసారి వడలు పులకరిస్తుంది. భయంతో దేహం కంపించిపోతుంది. కాస్త ధైర్యం తెచ్చుకొని కంటి వెంబడి కారే నీరు, భయం వలన బుట్టిన చెమట తుడుచుకొని నెమ్మదిగా వీధి తలుపులు తెరుస్తుంది.

"ఏమమ్మా, మీ యింట్లో ఒక దొంగ ప్రవేశించాడిప్పుడే నడవండి...చూడండి...పట్టుకోవాలి..." రాధకంగారు పడుతుంది. ఏం మాట్లాడాలో కూడ బోధపడదు. ఇంచక స్థాయి పడి "ఆ !... దొంగా ! మా యింట్లో...నా !! మా యిం...ట్లో...కెవ్వరూ రాలేదు...మా యింటి తలుపులన్నీ వేసేవున్నాయి...అదెక్కడో..."

"కాదు...మీ యింట్లోనే...ఇప్పుడే చూశాం...వాని వంటి నిండా రక్తం కూడా వుంది...ఏ ఖూనీ చాశాడో..."

ఖూనీ మాట చెప్పేసరికి రాధకు భయము ఆందోళన ఎక్కువయింది. ఏం మాట్లాడాలో కూడా తెలియ లేదు. బెదురు చూపులు చూస్తూ దాంతో పోలీసులకు కూడా అనుమానం కలిగింది.

"ఏమమ్మా, అల్లా చూస్తారేం...మీ యింట్లోనే...త్వరగా యిల్లు సోదా చెయ్యాండి...పదండి..."

"ఆ ! సో...దా...!...ఎవ్వరూ...లేరు...లేరు...మా యింట్లో...వల్ల కాదు..."

"అల్లాగంటే వీల్లేదు..."

ఈ మాటలన్నీ లోపల నుంచి వింటూన్న శంకరావు ఇంక అక్కడ ఉండడం మంచిది కాదని నిశ్చయించుకొన్నాడు. ఉంటే ప్రమాదం తప్పదు. అందుచే అక్కడనుంచి పారిపోవడమే మేలని

నిశ్చయించుకుని వెరటిగోడగెంతి పారిపోతాడు. ఆ చప్పుడుపోలీసులు వింటారు. కంగారుగా విజిల్ వూది అక్కడఒకపోలీసు కాపువుంచి నలుమూలలా నల్వురూ పరుగులెత్తుతారు.

"అదుగో...గోడగెంతాడుపట్టుకోండి..."

పోలీసులు నలుమూలలకు పరుగెత్తినా లేకాని శంకర్రావు జాడ గుర్తించలేకపోతారు. అట్లు శంకర్రావు గోడగెంతి త్వరితగతిని సందుగొందులబడి పారిపోయి తిన్నగా రైలుస్టేషన్ చేరుతాడు. అప్పుడు తెల్లవారఝామున నాలుగుగంటల ప్రొద్దయింది. విజయవాడ పోయే ప్యాసింజరు ఆపదయందు దగుల్కొని ఆశ్రయమునర్థించినదీనుని ఆదరించి సురక్షితముగా గొనిపోవ వేచియున్నదో యన్నట్లు స్టేషన్ ప్లాట్‌ఫారంమీద నిలచి బయల్దేరుటకు సిద్ధముగానున్నది. శంకర్రావు తనతల్లిదండ్రులవద్దకు గుంటూరుపోవనిశ్చయించుకుని వెంటనే టిక్కట్టు కొని బండియెక్కి పోయినాడు. మరుక్షణమందే తన పరుగుపట్టు కొనుడని సవాల్ చేయుచున్నదోయన్నట్లు బుస్సలుకొట్టుచు కెవ్వున యరచి బండిబయల్దేరి శరవేగంబున బోయినది

1, 2, ప్రకరణములు సంపూర్ణము.

---

## మూడవ ప్రకరణము

తెల్లవారినది. ఏడుగంటల సమయమగునప్పటికి మద్రాసులో న్యాయవాది రాఘవరావు యింటిచుట్టూ తండోపతండములుగా జనులు మూగిపోయిరి. రక్షకభటులు పెక్కుమందివచ్చి అచ్చటికి జేరిరి. మరికొంచముసేపటికొక కారులో రక్షకభటాధికారులువచ్చి దిగిరి. రక్షకభటాధికారులు ముగ్గురు రాఘవరావును బిలతురు,

రాత్రియందే రాఘవరావుకు పూర్తిగా మైకముపడిలి తెలివివచ్చుటచే జరిగిన విషయమంతా భార్యవలన తెలుసుకుని దానికి అనుగుణముగానే పన్నుగడపన్నుతాడు. ఏమయినా న్యాయవాదికాబట్టిఅన్యాయమార్గము లెక్కువగా తెలిసివుంటాయికదా! రక్షక భటాధికార్లు రాధచూపించిన బట్టలను అనగా శంకర్రావుని పరీక్షచేస్తారు. అవి అక్కడక్కడ బలవంతాన చిరిగియున్నట్లు అగుపిస్తాయి. పిమ్మట అంతాకలిసి మేడమీది శంకర్రావుగదిలోనికి వెళ్ళెదురు. ఆగదిలో సామాన్లు చిందరవందరగా వుంటాయి. పరుపుమీద ఒకటి రెండు రక్తపుమరక లగుపిస్తాయి. పరుపుతలగడాలు ఇటుఅటుపడివుంటాయి. అవన్నీ పరీక్షచేసి క్రిందకువచ్చి వీధిసావడియందు కూర్చుంటారు అంతా. అందు పోలీసు ఆఫీసరు రాఘవరావునుఅనేకప్రశ్నలు వేసితన డైరీలో వ్రాసుకొనును.

"అయితే మీ బావమరది శంకర్రావు రాత్రి ఇంటిదగ్గరే వున్నాడా...?"

"రెండవఆట సినీమాకు వెడతానని ఇంటివద్దచెప్పి వెళ్లాడు... మళ్లారావడం నాకు తెలియదు"

"మరలవచ్చినదీ లేనిదీ మీరుకనుక్కున్నారా...?"

"నేను తెల్లవారేవరకు నిదురనుండి లేవనేలేదండీ ... ఉదయమే నాభార్యను శంకర్రావు ఇంకా నిదుర లేవలేదా? అని ప్రశ్నించాను. ఆమె 'లేదు' అని జవాబిచ్చినది. అంతట నేను చాలప్రొద్దుపోయినదని వానిని లేపమని నాభార్యతో చెప్పితిని. ఆమెవెళ్ళి మరుక్షణంలో రాగాలుపెడుతూ అతడక్కడలేడని చెపుతూ రక్తంతో తడిసిన యీబట్టలను 'పరుపుమీద దొరికాయని' కంగారుగా చెప్పింది..."

"అప్పుడు మీరేమి చేశారు...?"

"నేనుకూడ వానిని చూడగానే చాలా కంగారుపడి వీధిలో నల్వైరకు చూపి, వానికేమయినా ప్రమాదం సంభవించినదేమో అని వెంటనే మీకు తెలియపరచాను..."

"బాగుంది..." అని అట్లాగే తన డైరీలో వ్రాసుకుని రాధ దిక్కు తిరిగి శాంతంగా ప్రశ్నిస్తాడు.

"ఏమమ్మా! మీరుగూడ మీతమ్ముని రాక ఎరుగరా...?"

"నాకేమీ తెలియదండీ ... ఇదంతా ఏదో మాయగా ఉంది..." అంటుంది కంగారుపడుతూను. అది గ్రహిస్తాడు పోలీసు ఆఫీసరు.

"అల్లా కంగారుపడతారేం ... శాంతంగా చెప్పండి ..." రాధకంటి వెంబడినీరు కారుస్తూ "అబ్బే కంగారు లేదండీ... నేనెరుగనన్నానుగా...",

"అయితే పోలీసులు వచ్చేవరకు మీరు నిద్రపోతూనే వున్నారన్నమాట..."

"అ...వు...లే...అవునండీ..." ఇనస్పెక్టరు ఏదో సంగతి ఆమెను ప్తపరుస్తూ వున్నదని బాగుగా అనుమానిస్తాడు. ఆకంగారులో ఏమితప్పుడుగా చెపుతుందోనని ఆమెకేసి ఆత్రుతగా చూస్తూ వుంటాడు రాఘవరావు. ఇనస్పెక్టరు బుర్రఊపుతూ ... "కంగారుపడకండి...అయితే మీయింట్లో జొరబడ్డమనిషినే గుర్తించలేక పోయారన్నమాట"

"అసలు నేనేమీ ఎరుగనండీ ... ఎవ్వరూ మాయింట్లోకి రాందే..." కొంచం స్థాయిపడదామని ప్రయత్నించి స్థాయిపడలేక పోతుంది. అదిపోలీసు ఆఫీసరు గుర్తించలేక పోలేదు. "అయితే మీరు పోలీసులతో మాటలాడునప్పుడు మీ పెరటియందు జరిగిన చప్పుడు విన్నారా...?"

"ఏదో చప్పుడువిని వెంబడించి కాని...మా పెరట్లో అవలేదు.."

ఆవివరాలన్నీ తన డైరీలో వ్రాసుకుని రాఘవరావుతో...

"అమ్మా! రాఘవరావుగారూ, ఈ విషయంలో చాలా తెలిసికోవలసినదుంది. ఈ బట్టలు స్టేషన్‌కు పట్టుకు వెడతాను... ఆ! అన్నట్లు శంకర్రావు తల్లిదండ్రులున్నారా?...

"ఆ! గుంటూరులో వున్నారండి...అతని పేరు రామశాస్త్రి ఇంటిపేరు ముక్కవిల్లివారు..."

"ఆయనకక్కడేం పనండీ..."

"వేదం చదువుకున్నవాడండీ... పూర్వకాలపు ఛాందసపు బ్రాహ్మణుడు..."

"అయితే శంకర్రావుకు వివాహమయిందా...?"

"లేదు..."

"శంకర్రావు ఇచ్చట ఏం చేస్తూవుంటాడండీ...వయస్సే పాటి ఉంటుంది."

"ఏం లేదండీ...ఈ సంవత్సరమే 'B. A' ప్యాసయ్యాడు... పాతికపైని వుంటాయి..."

"అయితే అతనెల్లాంటివాడో..."

"చాలాబుద్ధిమంతుడు...ఇతరగొడవలక్కర లేదు..."

"సరే, ఈ విషయంలో గట్టిపని చెయ్యవలసి వుంది, అవసరమైనప్పుడు మీరు సాక్ష్యానికి రావాలి..."

"అల్లాగే ఎంతమాట తప్పకవస్తాను. ఏదో ఈ విషయంలో దరియాప్తుచేసి ఆ విషయం, ఏమయినాడో, పాపం ఒక్కడేకొడుకు ఆబ్రాహ్మడికి..."

"సరే వస్తానుసార్!" అని శంకర్రావు వస్తువులు తీసుకుని పోలీసు ఇనస్పెక్టర్లు వెళ్ళిపోయారు. వాళ్లువెళ్ళిపోగానే రాధ, రాఘు

వరావు ఒక్కసారి వేడినిట్టూర్పును వదలి వేగంగా కొట్టుకొనే గుండెల శాంతి పరచుకుంటారు.

"అమ్మయ్యా! రాధ, ఎంతపనిజరిగిందీ—అదృశ్యం చూసే సరికి..."

"చాలు, ఇంక ఆపండి...ఎక్కడా ఈ విషయం ఇంక అన బోకండి.

ఆ విధంగా పోలీసుఆఫీసర్లు స్టేషన్‌కు చేరేసరికి అచ్చట కోలాహలంగావుంది స్టేషను. అక్కడ ఒక బండిఆగివుంది. దానిచుట్టూ గుంపుగా జనులుమూగివున్నారు. పోలీసు వారినిఅదమాయిస్తున్నారు. పోలీసు అఫీసర్లకారుగానే అంతా ఎవరిమట్టుకువారు ప్రక్కలకు తప్పుకున్నారు. కారు ఆగింది. ఒక హెడ్ కానిస్టేబుల్ కారు వద్దకు వచ్చి ఓ సలాంచేస్తాడు, అదేమీ అర్థంకాక ఆతురతగా అడుగు తాడు పోలీసుఆఫీసరు.

"ఏమిటోయ్! ఇది...?"

"ఖూనీకేసుసార్ !...ఇప్పుడేతీసుకువచ్చారుశవాన్ని..."

"ఆ !...ఖూనీకేసా !! ఎవరు ఆడమనిషా, మగవాడా...?"

అంటూ కారుదిగుతారు. అంతాబండిదగ్గరకువెడతారు. పోలీసుఇన్‌స్పెక్టరు లోనికిచూసి, బుర్రవూపి 'లోపలకుతీసుకురండి' అనిచెప్పి లోపలకెళతారు. ఆశవాన్ని లోపలకుతీసుకువెడతారు. అక్కడపరుండబెట్టి ముఖంమీదిబట్టతీస్తారు. ఆశవం ఇకెవరిది సుప్రసిద్ధన్యాయవాది వెంకటేశన్‌ది. అంతాచూసి తెల్లబోతారు. అందరకూచాలాఆశ్చర్యం కలుగుతుంది. ఆఫీసరు హెడ్‌కాన్‌స్టబు ల్‌ను ప్రశ్నిస్తాడు.

"అయితేఎవరుతెచ్చారు ఈశవాన్ని..ఎక్కడదొరికింది..?"

"ఇదుగో ఈభీమన్న స్టేషన్‌కు తెలియపరచాడుసార్! తర్వాత మేము మీావద్దకు నం 147నుపంపించి ఆశవాన్ని ఇక్కడికి తీసుకువచ్చాం. సముద్రతీరాన ఇసుకలోపడివుండగా మేము చూశాం..."

"ఎవరెవరు?..."

"నేనూ, సం 144-వెళ్ళాంసార్!"

అంతట పోలీసుఆఫీసరు భీమన్నకేసితిరిగి గ్రుడ్లుపెద్దవిచేసి "అయితే నువ్వెప్పుడు చూశావు ఈశవాన్ని...?"

"ఇవాళపొద్దునేనండీ... బాగ ప్రొద్దెక్కలేదు. ."

"అంతప్రొద్దునేనువ్వు సముద్రతీరానికి ఎందుకెళ్ళావు ?"

"ఇయ్యాళ ఏకాశికదండీ...అందుకని స్నానంచేద్దారని వెళ్ళాను...?"

"అయితే ప్రతీఏకాదశీ స్నానంచేస్తూంటానన్నమాట సముద్రంలో..."

"అవునండి...ఏదోఆనాడు రామా, కృష్ణా అనుకోడం శానారోజులుబట్టి అలవాటయిపోయిందండి. ."

"మీాఇల్లెక్కడ...?"

"అక్కడదగ్గరేనండి పదిగజాలెడితె ప్రక్కరోడ్డుంది ఆరోడ్డు గుండా నాలుగడుగులేస్తే కుడిసేతిపక్క ఓసందుంది. ఆసందులో ఎడమసేతి నాలుగోయిల్లండి"

"ఉహూ!...అయితే ఆరోడ్డుకెదురుగావున్న రేవులో ఎందుకు పోసుకోలేదు..."

"అక్కడ సేపల్నిపడుతున్నారండి..అందుచే కొంచంఎగువ కొచ్చాను..."

"అయితేనువ్వు చేపలు మాంసంతినవా..? నీకులం ..?"

"మేం కాపులమండి, మా యింట్లో సేద్యమండి.."

"నువ్వేం చేస్తుంటావు...?"

"వ్యవసాయమండి." అంతలోకి ఆ ప్రక్కనే యున్న హెడ్ కానిస్టేబిల్ అందుకొని భీమన్న కేసిచూసి చెప్పసాగుకవేస్తూ.

"ఈ వెంకటేశన్ గారిదగ్గరే యీడు సంవత్సరం క్రితం నౌకరీ చేస్తూండేవాడండి..."

"అవునా...?"

"అవునండి..."

"మరి యిప్పుడు మానేశావే...?"

"ఇష్టంలేక..."

"సరే తర్వాతఆలోచిద్దాం, ఆశవాన్ని పరీక్షకుపంపించాలి... వీడిదగ్గర స్టేట్ మెంటు తీసుకోండి..." అని పోలీసుఆఫీసరు ఆశవాన్ని పరీక్షకుపంపించి తాను వేరేపనిమీద వెడతాడు. ఆనాటిసాయం కాలానికి పత్రికలోపడింది. సుప్రసిద్ధన్యాయవాది వెంకటేశన్ హత్య చేయబడినట్లు, సముద్రతీరాన దొరికినట్లు. శంకర్రావుదుస్తులు రక్తంతోతడిసివున్నవి రాఘవరావింట్లో దొరికినవి. ఆదుస్తులను తొడుగుకున్న వ్యక్తి పోలీసులచేత తరుమబడుట, రాఘవరావింట్లోనే జొరబడుట, కొంచెంసేపటిలో పెరటిగోడ ఎవ్వరోగెంతి పారిపోయిన చప్పుడు వినవచ్చుట. ఇవన్నీ బట్టిచూస్తే హంతకుడు శంకర్రావేమో నని పోలీసులకు గట్టిఅనుమానము తోచినది. సుబ్రహ్మణ్యంఅనగా వెంకటేశన్ కుమారునితో యోచించి పత్రికలలో వేయించారు. వెంకటేశన్ హత్యానేరంచేసినవారిలో ముఖ్యుడు శంకర్రావని అనుమానించబడుటచే వానినిపట్టియిచ్చినవారికి అయిదువేలరూపాయలు బహుమతీఅని ప్రకటించారు. పట్టణమంతా గగ్గోలుగావుంది. ఆప్రకటనచూసి రాఘవరావు, రాధమిక్కిలి భయపడ్డారు. అప్పుడే

పోలీసులు గుండుగా పోలీసువారికి తెలియపరచారు. శంకరశాస్త్రి గుస్తులనిస్తూ వానిని పట్టుకొన్నారు.

ఆవిధంగా ప్యాసింజరులో ప్రమాదం తప్పించుకుని ప్రయాణం చేసిన శంకరశాస్త్రి ఉదయం పొద్దుటి దిగంటలకు నెమ్మదిగా యింటికి చేరాడు. పెరట్లో అరుగుమీద కూర్చుని భగవద్గీత పారాయణ చేస్తూన్న తండ్రి రామశాస్త్రి కుమారుడిని చూచి, పుస్తకం ప్రక్కన బెట్టి కంటిజోడు సవరించుకుంటూ—ఆత్రుతగా.

"ఏం నాయనా! ఏమిటీ ఇప్పుడొచ్చావు...అంతా కులాసాగా వున్నారా?...అక్కా బావా అంతాను...?"

"ఆ! అంతా కులాసాగానే వున్నారు..."

"ఏమేవ్! విన్నే ... ఇదుగో అబ్బాయి వచ్చాడు, ... ఏదీ సామానేదీ...కట్టుబట్టలతో సినా యేమిటీ రావడం...?"

"అబ్బే! కొంచం పనుండి ఇల్లా విజయవాడ వెడుతూ ఓ మాటుచూచి వెడదామని దిగాను..."

ఇంతలో కీసరగంసరగం బట్టలు వుతుకుతూన్నది అల్లాగే దిగ విడచి అల్లాగే ఇవతలకువచ్చి కొడుకునిచూసి ఇంతముఖం చేసుకుంది తల్లి లచ్చమ్మ.

"ఏం, నాయనా! ఇదేరావడమా, అక్కా బావా అంతా కులాసాగావున్నారా...? రా లోపలకు...సామానేదీ...?"

"ఆ!...అల్లాగ విజయవాడ వెడుతూ ఓమాటు దిగిచూసి పోదామని వచ్చాట్ట..." అని బోధచేస్తాడు రామశాస్త్రి భార్యకు. దాంతో లచ్చమ్మ దవుడలు నొక్కుకుంటూ ఆశ్చర్యంగా,

"కట్టుబట్టలతోనే!...ఆఖరుకు ఓకండువాఅయినా తెచ్చుకోరురా అబ్బాయీ!..."

"ఎందుకమ్మా! మళ్ళీ సాయంకాలంబండికి వెళ్ళిపోతానుగా..?"

"ఇవాళే! రెండురోజులుండి వెళ్ళరాదూ..."

"వీల్లేదమ్మా...మళ్ళీవస్తాను."

"సరే, ఆవిషయాలన్నీ తర్వాత మాట్లాడవచ్చు. సిటీలోనేనా యేమిటికబుర్లు...ముందుపదో వంటసంగతిచూడూ..." అన్నాడు రామశాస్త్రి కళ్ళజోడు సవరించుకుని ప్రక్కనున్న భగవద్గీతతీసుకుంటూను. లచ్చమ్మగారు ఎంతో ప్రేమతో శంకర్రావు చెయ్యి పట్టుకుని "నడు నాయనా! నడు...లోపలకు..." అంటూ లోపలకు అడుగువేస్తుంది. శంకర్రావు ఆగి ఆమెచెయ్యి వదలించుకుని క్షణ కాలమేమో యోచించి తటాలున "అమ్మా, యిప్పుడే వస్తానమ్మా శాస్త్ర ఓస్నేహితుణ్ణి కలుసుకుని వచ్చేస్తాను. త్వరగా వంట కానియ్యి..."

"వంట ఆలస్యం ఏమీ లేదూ...ఘడియలో వండేస్తాను ... ఎప్పుడుతిన్నావో యేమిటో త్వరగారా..."

శంకర్రావు అక్కడనుండి బయల్దేరుతాడు. తిన్నగా నాలుగు వీధులు తిరిగివెళ్ళి తన ప్రాణస్నేహితుడు Fancy shop యజమాని కృష్ణారావు కొట్టువద్దకు వెడతాడు. వెళ్ళేటప్పుడు త్వరగా రమ్మని ఇంకోసారి హెచ్చరిస్తాడుతండ్రి.

కృష్ణారావుది పెద్దకొట్టు. అతడు చాలామంచివాడు. ఉదార స్వభావుడు. స్నేహితుడు శంకర్రావును చూడగానే సంతోషంతో లేచి ఆహ్వానిస్తాడు.

"ఏమోయ్! శంకర్, ఎప్పుడువచ్చావు...? రా కూర్చో, ఏమిటివిశేషాలు...?

"ఇప్పుడేవచ్చానోయ్, ఏమున్నాయివిశేషాలు ... అంతా కులాసాగానే వున్నారు. మీయింట్లో అంతా క్షేమమేనా...?

"ఆహా, భగవంతుని దయవల్ల అంతా క్షేమమే. అయితే Results తెలిశాయామీావి...?"

"ఆ! ఫస్టుక్లాసువచ్చింది..."

"బాగుంది, ఇంకే...అయితే టీపార్టీ ఎప్పుడు?"

"తొందరపడితే ఎల్లాగ...సెప్టెంబరుమీాద..."

"అయితే ఏమిటి ఇంకాసంగతులు...?"

ఇల్లా వీరిద్దరు సంభాషించుకుంటూవుండగా శంకర్రావు బాల్యస్నేహితుడు గోపి అక్కడకువచ్చాడు. గోపిఇప్పుడొక మేష్టరు. శంకర్రావును చూసి ఆశ్చర్యంగా...

"ఏమోయ్! శంకర్, ఎప్పుడొచ్చావు...? ఆ!...అన్నట్లు మీాయింటికిందాకా పోలీసులు వచ్చారేమిటి...?"

శంకర్రావు తెల్లబోయి కంగారుపడి, మరల స్థాయిపడి కొంచం శాంతంగా ఆశ్చర్యం అభినయిస్తూ.

"మాయింటికా!...ఎప్పుడుచూాశావు?

"ఇప్పుడే ఆసందుకొసనుంచి ఇంటికిపోతూ చూశాను ... మరేమిటో సంగతి..."

"పోలీసు లెందుకువచ్చారూ ... ఏమిటోఅది ... వెడతా నుండు..." అనిలేస్తాడు. గోపి తనదారిన ఏదో ఆలోచించుకుంటూ వెళ్ళిపోతాడు. కృష్ణారావు కూడా లేస్తాడు. వెళ్ళబోతున్న శంకర్రావు హఠాత్తుగా ఆగి వెనుదిరిగి కంగారుగా కృష్ణారావుచెయ్యి పట్టుకుని లోపలకు తీసుకువెళ్ళి రెండుచేతులూ పట్టుకుని దీనంగా,

"కృష్ణా! నాకొక్క గొప్పఉపకారం చేసిపెట్టాలినువ్వు..."

"ఏమిటది...?" సందేహిస్తూ అడుగుతాడు.

"నేనిప్పుడింటికి వెళ్ళడానికి వీలులేదు..."

కృష్ణారావు ఆశ్చర్యపడుతాడు. శంకర్రావు సంగతి ఏమిటో అర్థంకాక అనుమానంతో,

ఇక్క...''

''దానికంతా కారణముంది. తర్వాత చెప్తాను. నన్నొక్క వారంరోజులపాటు పోలీసులకంటకుండా దాచాలి...''

''నీసంగతి నాకేమీ అర్థంకావడంలేదు...''

''అయితేవీలులేదా...''కొంచెంబెదురుగుండెతో అత్రుతగా అడుగుతాడు. దాంతో తనమిత్రుడు ఏదోఅపాయపరిస్థితులలో చిక్కుకున్నాడని గ్రహించాడు కృష్ణారావు. అట్లాటిస్థితిలో మిత్రునిమాట కాదనలేకపోయాడు. పోలీసులకన్నుగప్పి మిత్రునిరక్షించదలచాడు. అయినప్పటికి తనమిత్రుని నేరమేమిటో తెలుసుకోకుండానే సాయపడుటకు సిద్ధపడ్డాడు తనమిత్రుని ప్రవర్తన బాగుగా యెరిగివుండుట చేతను; విషయమేమిటైనను ఆపదలయందు చర్చలుపెట్టుకొనక శక్తివంచనజేయక సాయపడువాడేకదా మిత్రుడు! అట్టివానికి మిత్రునితోడిదే లోకము అట్టివారుమిత్రుని హితవునకై ప్రాణములగూడ నొడ్డెదరు. వారేకదా ధన్యాత్ములు. అప్పటి తనమిత్రుని నిజస్థితి తెలియకున్నను పూర్ణవిశ్వాసముతో వానికి సాయపడ నిశ్చయించుకున్నాడా ధన్యజీవి కృష్ణారావు. మిత్రునకు ధైర్యము చెప్తూ-

''అంతఅపాయమేవస్తే అడ్డుపడకుండావుంటానా శంకర్! నీకన్న నాకుహితులెవరున్నారు...ఇంతకూ నీసంగతేమిటో నాకేమీ అర్థం కావడంలేదు...''

ఆమిత్రుని పవిత్రవాక్కులు చెవులబడగానే శంకర్రావు మనస్సుకు నిండుధైర్యంతోచింది. ఇంక భయంలేదనుకున్నాడు. ప్రాణహితుడయిన కృష్ణారావుని పూర్తిగా నమ్మినాడు. కొంచం ధైర్యం తెచ్చుకుని-

''అన్నివిషయాలు నీకు సవిస్తరంగా ఆనక చెప్తాను...ఇంక నేనిక్కడ ఈబజారులోవుంటే వీలులేదు...''

"మరేం భయంలేదు .. నేను అన్నీ చూస్తాగా... ఈ క్రొక్క-తోనే నను మా యింటికి తీసుకుపోతాను. ధైర్యంగావుండు..."

"Thanks! నీ ఋణం ఎన్నటికీ తీర్చుకోలేనోయ్ —"

"స్నేహధర్మంలో ఆపాటిసాయం చెయ్యడం గొప్పవిషయం టోయ్ శంకర్!"

అంటూ కృష్ణారావు త్వరితంగా కోటునూ సేస్తాడు. తనతు వ్వాలు శంకర్రావుకి కప్పుకోడానికి ఇస్తాడు. శంకర్రావు ఆతువ్వాలు తలకు చుట్టుకుని నెమ్మదిగా బెదరుచూపులుచూస్తూ కృష్ణారావు ననుసరించి వానియింటికి వెడతాడు.

ఇక్కడ ఇల్లావుండగా అక్కడమద్రాసునుంచివచ్చిన వార్త నందుకుని వెంటనే నలుగురుపోలీసులతో పోలీసుఆఫసరు రామశాస్త్రి యింటికివస్తాడు. పోలీసులనుచూడగానే రామశాస్త్రి కంగారుపడి మళ్లాస్థాయిపడతాడు. చేతిలోని పుస్తకము ఆప్రక్కనపెట్టి కళ్ళ జోడుసవరించుకుంటూ కూర్చున్నవాడు లేస్తాడు. పోలీసుఆఫీసరు అధి కారస్వరంతో ప్రశ్నిస్తాడు.

"ఏమండీ ముక్కవిల్లి రామశాస్త్రిగారు మీరేనా...?"

"ఆ!...అవునుబాబూ!...ఏం?"

"మీఅబ్బాయి ఉన్నాడా...?"

"ఏం...బాబూ! ఎందుకూ...ఏంవచ్చిందివాడికి...?"

ఈసందడిఅంతా ఏమిటోఅని లోపలవంటప్రయత్నం చేస్తూ న్నలచ్చమ్మగారు ఈవలకువచ్చి పోలీసులనుచూసి తెల్లబోయి అల్లాగే ద్వారానికానుకుని నిలబడిపోయి చూస్తోంది. వీరినందరినీ ఆశ్చర్యంగా పోలీసు ఆఫీసరుగట్టిగా గ్రుడ్లుపెద్దవిచేసి అడుగుతాడు.

"అసలిక్కడకు వచ్చాడాలేదా... చెప్పండీ...?"

"ఆ! అరగంట అవుతుందివచ్చాడు...పధిలో వాడు పీఫెలోం చేసుకొస్తా వస్తానని మాతో చెప్పి ఎక్కడకో వెంటనే వెళ్ళిపోయాడు. ఏంజరిగిందేమిటి బాబూ!..."

"మీవాడిపేరు శంకర్రావేగదూ..."

"ఆ! శంకరమేనండి ..అసలు ఏంజరిగిందండీ...?" ఆత్రుతగా అడుగుతాడు.

"మీవాడిని పట్టుకోవలసిందని మద్రాసునుంచి ఆర్డరువచ్చింది.

"ఆ!...మావాడ్నే... ఏం...బాబూ!... ఏంచేశాడూ..."

రామశాస్త్రి నిర్ఘాంతపోతాడు. లచ్చమ్మ ఏడుపుముఖం పెడుతుంది."

"ఏంచేశాడా...ఖూనీ..."

"ఆ!...ఖూ...నీ...మావాడే...!! మా...వా...డే...!! నిజం...గా!!!"

రామశాస్త్రికి గద్గదస్వరమేర్పడుతుంది. పెదలు వణుకుతుంది. మాట తడబడుతుంది. ఒక్కసారి ముఖం వివర్ణతచెందుతుంది. రామశాస్త్రికి ఆఫీసరు క్లుప్తంగా సమాధానమిస్తాడు.

"అవును, మద్రాసులో ఒకప్లీడర్ని చంపేశాడు..."

"అయ్యబాబోయ్! మావాడల్లాటిపన్లుచేయడునాయనాయ్! మావాడేమీ యెరుగడుతండ్రీ...ఇదంతా అబద్ధం ...అబద్ధం ... కిట్టనివాళ్ళెవరో పుట్టించారు దేముడోయ్!...ఇంకేందారినాకు..."

అని పెద్దపెద్ద దీర్ఘాలుతీస్తుంది గుండెలు బాదుకుంటూవుంటుంది లచ్చమ్మ. అక్కడికి చుట్టుప్రక్క అమ్మలక్కలంతా మూగుతారు. గెడ్డలు నొక్కుకునేవారు కొందరు, నిస్తుపోయి చూచేవారుకొందరు, దీనదశయందున్న ఆయిల్లాలిని ఓదార్చేవారుకొందరు. తృణకాలక్రితం ప్రశాంతంగావున్న ఆప్రదేశమిప్పుడు జనసమూ

హంతో కోలాహలంగావుంది. శాస్త్రిగారినోట మాటలేదు. పాపం కంటివెంబడి తారేనీరును అంగవస్త్రంతో తుడుచుకుంటూ లోనుండి వస్తాన్న దుఃఖాన్ని దిగమ్రింగుతూ సంచేయుడానికి తోచక అల్లాగే కూలబడినారు. అక్కడకుజేరిన పెద్దలు ముఖ్యంగా శాస్త్రిగారి నెరిగియున్నవారు ఆకష్టదశలో వారికి తగురీతిని ధైర్యంచెప్పుతు న్నారు. పోలీసు ఆఫీసరు ఏమిటో తన డైరీలో వ్రాసుకుని ఒక పోలీసునుపిలచి ఒకకాయితం ఇచ్చి శాస్త్రిగారియింటివద్దవుంచి "ఏయ్! 321 నువ్విక్కడ 396 తో కలసివుండి, వాళ్ళబ్బాయి కాని వస్తాడేమోచూచి వెంటనే అరెస్టుచేసి నాకు తెలియపరచు"

"అల్లాగేనుసార్"

"జాగ్రత్త!" అనిచెప్పి పోలీసు ఆఫీసరు తన సిబ్బందితో బయల్దేర వెడుతూ శాస్త్రిగారిదిక్కై,

"అధైర్యపడకండి శాస్త్రిగారు...మీవాణ్ని నేనూ బాగా ఎరుగుదును...ఆతెడు నేరంచేసివుండడు...నెమ్మదిగాద అన్నీ తేల తాయి...వస్తానండి..."

అనిచెప్పి లేన్నగా వెళ్ళిపోతాడు. అంతట పాపం శాస్త్రిగారు దిగాలుపడి కూర్చునివుంటారు. అంతసేపూ వచ్చినవారు ఎవరి మట్టుకువారు మెల్లిగా వెళ్ళిపోతారు. దానికిదగ్గరగావచ్చి నిలబడి కళ్ళనీళ్లు తుడుచుకుంటూవుంటుంది అన్నపూర్ణమ్మగారు. రామశాస్త్రి నెత్తిని చేత్తోకొట్టుకుంటూ ఎంతపని చేశావురా నాయనా! వంశానికి మాయనిమచ్చ తెచ్చావు...చిన్నప్పటినుంచీ ఎంతోబుద్ధిగా వున్నా డని నలుగురూ అంటూవుంటే మురిసిపోయాము... ఒక్కకొడుకువి ఏదో వృద్ధిలోకివచ్చి...మమ్మల్ని ఉద్ధరిస్తావని గంపెడాశపెట్టుకుని ఉన్నామేగాని...ఇంతటిదుర్మార్గపడవౌతావనుకోలేదురా ... ఇంత కూ ఖర్మ ఇలావుంది...ఏంచెయ్యం...

"నిజంగా వాడల్లా చేశాడంటారా!...నాకొడుకు అల్లాటిపని చేస్తాడా... చెయ్యడు... చెయ్యడు...ముమ్మాటికీ చెయ్యడు..." అంటుంది పాప మాయమాయకురాలు పుత్రప్రేమ వెల్లడిచేస్తూను. అంతట యిద్దరూ లోనికిపోయి తలుపులుమూసుకుంటారు. పోలీసు లిద్దరూ యమభటులులాగున ద్వారమున కిరుపార్శ్వముల చెరియొక యరుగుపైన కూర్చుండి ఏవోకబుర్లుచెప్పుకుంటూ వుంటారు. ఆరోజు మొత్తంమీద శంకరరావు ఆయింటికి రాకపోవడంమూలాన వారు నిస్పృహచెంది తిన్నగాస్టేషన్‌కు వెడతారు. అధికారికి సంగతిఅంతా విశదపరచడానికి. ఆనాడు సాయంకాలం బండిలో బయల్దేరి రామ శాస్త్రి లచ్చమ్మలు మద్రాసు వెడతారు.

ఆరురోజులు కృష్ణారావింట్లో ఏవిధమయిన భీతి, లోపము లేకుండగా అజ్ఞాతవాసంగడిపినాడు శంకరరావు. తనపరిస్థితి కొద్దిగా కృష్ణారావుకు చెప్పాడు. కృష్ణారావు ఎట్టిపరిస్థితులలోనయినా సరే సాయపడతానని వాగ్దానమిచ్చి తదనుగుణ్యంగా వాసియింట్లో ఆశ్రయ మిచ్చినందుల కెంతయు సంతసించి కృతజ్ఞత చెప్పుకొనినాడు. అట్టి అపాయస్థితిలో అమోఘమయిన అండజూపినందుల కాభగవంతుని వేయివిధముల ధ్యానించాడు. ఆరోజుతానక్కడకువచ్చిన యేడవ రోజు తెల్లవారుఝాము అయి ౪ గంటలదగ్గరఅయిందిసైము. చీకటి తెరలు క్రమంగా తప్పిపోయి వెలుగు మెరుగులు కానవచ్చుచున్నవి. అట్టియెడ కృష్ణారావు తొందరగా శంకరరావును లేపుతాడు. పాపం ఎంతనిద్దరపోవుగ్నాడో యేమో శంకరరావు త్రుళ్లిపడిలేచాడు.

"శంకర్!...శంకర్!...లేవే...కొంపమునిగింది..." శంక రావు కంగారుగా లేచి ఆత్రుతగా—

"ఏం...ఏంజరిగిందేమిటి? ఎవరయినావచ్చారాఏమిటి,..?"

"రావటమేమిటి... ఇప్పుడిచుట్టో కొంత పోలీసులు... ఎట్లాగో కాని నువ్విక్కడున్నట్లు వాళ్ళకు తెలిసింది"

"ఆ!...అయితే ఏం చెయ్యాడం ఇప్పుడు...?"

"కృష్ణారావు స్నేహితునికొంచం శాంతిపరచి,

"మరేంభయంలేదు...అన్నీ ఏర్పాటుచేశాను... ఇక్కడ నువ్వుంటే ప్రమాదం...ప్రక్కింటి 'కామన్న'గారి దొడ్లోకిదిగి వారి పెరటిత్రోవను పుంతలోంచి అడ్డపడిపోయి Station చేరు...లే... ఆలస్యం చెయ్యకు..." శంకర్రావు కృతజ్ఞతా పూర్వకంగా దీన వదనంతో.

"ఇంతకాలం కాపాడేవు...నీఋణం... మళ్ళా కలయిక ఉం టుందో...లేదో..."

"మరేంభయపడకు...సత్యం ఎన్నటికీదాగదు...నువ్వుత్వర పడు తెల్లవారుతోంది. ప్యాసింజరు టైముకావచ్చినది...ఆ! ...అన్న ట్లు ఈయిరవైరూపాయలు దగ్గరవుంచుకో... నేనుకూడ ప్రస్తుత మింక ఎక్కువగాసాయం..." మాటకడ్డువచ్చి వానిరెండుచేతులూ పట్టుకుని—

"ఎంతమాట...ఇంకాఇదితక్కువా...మరినేనుపోతాను..."

కృష్ణారావు ఇరవైరూపాయలు శంకరావుకిస్తాడు. ప్రక్కింటి వారిదొడ్డిలోనుండి పుంతదాకా తానుగూడా వెళ్ళి వానిని భద్రంగా సాగనంపుతాడు ఆప్రాణహితుడు. శంకర్రావుతిన్నగా ఆలస్యంచేయ కుండా ఆపుంతదారిని స్టేషన్ చేరుతాడు. కాని ప్లాట్ఫారంమీదకు బండివచ్చివుంది. ప్రయాణీకులు హడావడిగా ఇటు అటు తిరుగు తున్నారు. ప్లాట్ఫారంమీద ఇటుఅటు నలుగురు పోలీసులుకూడా తిరుగుతున్నారు. అందుచే ప్లాటుఫారంమీదకు వెళ్ళడంమంచిది

కాచుకుని శంకర్రావు స్టేషన్ దాటి కొంచెము ముందుకు పోయి అప్పటి రైలుపట్టాలు దాటి క్రమంగా రైలుబండి అవతలప్రక్కకు వచ్చి మూడవతరగతి పెట్టెయెక్కి ఒక మూలగా పైన సామాన్లుపెట్టుకునే బల్లమీద పండుకున్నాడు కదలకుండా, కొంచెసేపటికి రైలు బయల్దేరింది. సుమారొకగంట సేపయ్యేసరికి పాపం అలసిపోయివున్నాడేమో గాఢంగా నిద్రపట్టింది. విజయవాడ స్టేషన్ కు ఇవతలగా టికెట్ కలెక్టరు ఆనందరావు ప్రవేశించడం ఆపెట్టెలోవున్న మనకథానాయకుణ్ణి పట్టుకోవడం వెనుకనే తెలుసుకున్నాం.

మూడవ ప్రకరణము సమాప్తము.

---

# నాల్గవ ప్రకరణము

అది మద్రాసునుండి కుర్దా పోయే ప్యాసింజరు. రాత్రి తొమ్మిదిగంటలసమయం. నిప్పులు గ్రక్కుకుంటూ ఆ కారుచీకటిలో నిర్భయంగా మధ్యమధ్య దిక్కులు ప్రతిధ్వనించేటట్లు అరచుచు ఆయినుపదారిగుండాపోతోంది ముందుకాపొగబండి. రెండవతరగతిపెట్టె అది. అందులో ఇద్దరువ్యక్తులు కూర్చుని సంభాషించుకుంటున్నారు. అందొకడు రైల్వేటికెట్ కలెక్టరు ఆనందరావు. రెండవవాడు మన కథానాయకుడు. వెనుకటి ప్రకరణములోవర్ణించినరీతిగా తన పూర్వచరిత్ర తానెరిగియున్నదంతయు పూసగ్రుచ్చినట్లు ఆనందరావుకు చెప్పివేశాడు ప్రభాకర్ పేరులోనున్న శంకర్రావు. ఆసాంతంతా పూర్తిచేశాక నిబ్బరమయిన మనస్సుతో క్లుప్తంగా ఆనందరావు ముఖంవంక చూస్తూ అంటాడు బరువుగా.

"అల్లాప్రయాణంచేస్తూ... చివరకు మీ చేతికి చిక్కాను..."

"అబ్బా!...ఎంతఅవస్థపడ్డావూ...పాపం...అయితే ఇంతపరం నువ్వు ఖూనీ చెయ్యలేదన్నమాట...!!" అన్నాడుఅంతావిన్నాక ఆశ్చర్యంగా ఆనందరావు.

"లేదు..."

"మరెందుకింక నీకీభయం...?"

"అట్లనియూఢి అవడమెల్లాగ...నాబట్టలుకూడా పోలీసులకు దొరికేవుంటాయి...నేరస్థుణ్ణి నేనని పత్రికలలోకూడా ప్రచురించారు...పైగా అట్టిపరిస్థితులలో నేరం నాపైనబలపడుచే మేలని భావించాను...అందుచే నేరం బలపడుతుందనే ఉద్దేశంతో పారిపోయివచ్చేశాను"

నిబ్బరంగా, గంభీరంగా చెపుతూన్న ప్రభాకరరావుమాటలు వినేసరికి ఆనందరావు ఆశ్చర్యపోయాడు. ఏమనడానికీకూడా తోచలేదు. ప్రభాకరుకు మతిభ్రమించిందేమో అనుకున్నాడు. ఆశ్చర్యపోయి ప్రభాకర్ ముఖంవంక తీవ్రంగాచూస్తూ...

"అయితే, నీవుద్దేశం...?"

"మరేమీలేదు...నావుద్దేశప్రకారంగా హత్యచేసిన నేరస్థుడికి మరణదండన తప్పదని. అల్లాటిస్థితిలో నేరస్థుడు మాబావ అవుతాడు న్యాయప్రకారంగా. అట్లయితేశిక్ష కేవలము వానికొక్కనికే కాదు. బంగారమువంటి వారికాపురము పాడగును. దానితోమా రాధకూడ భరింపరాని వైధవ్యము ననుభవింపవలసివచ్చును. అది సహింపరానిది. ఆమె నేనూ తప్ప ఇంకెవ్వరమూ తోడబుట్టినవారములేము. ఆమె సోదరుడనైయున్నందుకు నాశక్తివంచన లేకుండా ఆపద కడ్డుపడడమే విధిఅనినాతలచాను..."

"అయిన..." ఆశ్చర్యంతో ప్రశ్నిస్తాడు.

"ఏముంది. అల్లాటిస్థితిలో ఆఅపాయమునుండి తప్పించుకొనుటకు వేరొకమార్గం అగుపడలేదు. దేవునిపై భారంవేసి ఈత్రోవ తొక్కాను. పైగా నేనా బ్రహ్మచారిని. నాప్రాణముపోయినను ఆ దుఃఖముచాలవరకు నాతోనే అంతమగును. మా రాధస్థితి అట్టిది కాదు...అందుచే ఆ నేరమునాతలపైనే మోపుకున్నాను. కొనవరకు అట్లే నేరస్థునిగనేయుండ నిశ్చయించుకున్నాను..."

గంభీరమయిన అవ్వాగ్ధోరణి, ఆపరోపకారబుద్ధి తలంచుకొని, నిశ్చేష్టుడయిపోయినాడు ఆనందరావు. అంతటి యుదారస్వభావము సామాన్యులకుండదుకదా! అభిమానపూర్వకంగా.

"ఆహా!...ఏమి త్యాగమూర్తివోయ్! నిజముగా నీదీ ధన్యజీవితము. పరోపకారమనుపేర ఎంతటిభయంకర సమస్యను తలదాల్చావు...ఆహా! నీలాంటి పవిత్రహృదయులతోడి సంపర్కముగల్గుట వల్ల నిజంగా నేనుకూడ ధన్యుడనయ్యాను...ఎంతటిగొప్పవిషయం"

"ఏదో తప్పనిసరియై ఇందుకొడబడ్డాను...మరి ఏం చెయ్యను"

"నిజంగా ఈవయస్సులో B. A. ఫస్టుక్లాసులో ప్యాసయినవాడవు, నవనాగరికత అనేపేరుతో నీతినియమాలకు నీళ్ళువిడచి నిలువనీడ నిండయిన తిండీ లేకపోయిన,నిప్పులద్రొక్కిన కోతులులాగ నిర్దుష్టమగు మార్గములేక ఈనవనాగరికతా అగ్నిగుండంలో పడిపోతూన్న నేటికాలపు యువతీయువకులలో నీవంటిరూపయవ్వన విద్యావంతుడు పెడత్రోవలబోక పైగా సుఖములన్నిటికి స్వస్తిచెప్పి ఇట్లాంటిఅపవాదు నెత్తిన బెట్టుకుని జీవితం ఇట్లామరియొకరికోసం ధారపోస్తున్నావూ అంటే సామాన్యవిషయమా...ఎంతటి త్యాగమూర్తివి."

"........."మౌనంగా ఆనంద్ కేసిచూస్తూ ఏదో చెప్పబోతూంటే మళ్ళా ఆనందరావు అందుకుని పూర్తినిశ్చయంతో ప్రభాకర్ రెండుచేతులూ పట్టుకుని.

“చూడు... ఇక ఈ యిద్దరిపైని ఈసంగతి ఎవ్వరిదగ్గరా చెప్పకు. నిన్ను కాపాడేభారం నాది. నేటినుండి నిన్ను పోషించేభారం నాది. మాయింటిపక్కనే హాయిగా ఉండు. ఈనాటినుంచి మాయింట్లోనే మాతో కలసిమెలసి మా కుటుంబంలో ఒకడిగా వ్యవహరించు... తర్వాత ఏమిప్రమాదాలువచ్చినా నేనుచూస్తాను.”

దాంతో ప్రభాకర్‌కు ఏదో పెద్దభారం తప్పినట్లయింది. ఒక్క పెద్ద వేడి నిట్టూర్పు వదలినాడు. ఆనంద్ కేసి కృతజ్ఞతా పూర్వకంగా చూస్తూ,

“చాలా కృతజ్ఞత, నీఋణము ఎన్నిజన్మలకైనా తీర్చుకోగలనా...?”

“ఎంతమాట, నీవంటివానికి సాయపడుట అదొకగొప్పా...?”

ఆనందరావు చేతిగడియారం చూసుకుని కనుబొమలెగుర వేసి,

“అబ్బా పదకొండుదాటిందే టైము... సరే పడుకుందాం ఇంక... చాలా రాత్రి అయింది...”

ఇద్దరూ చెరియొకబెర్తుమీద పడుకున్నారు. కొలదిసేపటికే ఇద్దరకూ నిద్రపట్టేస్తుంది. రైలుబండిమాత్రం నిశ్శబ్దంగా యున్న ఆచీకటిలో ఆయినుపట్టాలగుండా పొగలు జిమ్ముకుంటూ వేగంగా ముందుకుసాగిపోతోంది. మరునాటిఉదయం ఎనిమిదిగంటలకల్లా వాల్తేరుస్టేషన్లో ఆగిందిబండి. ఆనంద్ ప్రభాకర్‌లు బండిదిగి కాలకృత్యాలు తీర్చుకుని టిఫెన్ చేద్దామని ప్లాట్‌ఫారంమీదుగా నడిచిపోయి ఒకపావుగంటకల్లా తిరిగివస్తూంటే, ఆనందరావు స్నేహితుడు పోలీసుఇన్‌స్పెక్టరు ‘రామం’ ఎదురౌతాడు. ఆనందరావునుచూచి రామం నిలబడతాడు. రామాన్నిచూసి ప్రభాకరరావు కొంచం భయపడుతూ బెదురుచూపులుచూస్తూ ముఖమావలదిక్కుగా తిప్పుకుని

ఏదో చూపిస్తూన్నట్లు నటిస్తూన్నట్లు నటిస్తూవుంటాడు. రామం వాని వోసారిచూసి ఆనంద్ కేసి తిరుగుతాడు.

“హల్లో! ఆనంద్! ఏమిటిల్లా పొద్దు ఊడిగబడ్డావు...?”

“హల్లో! రామం! ఇల్లాయింటికెళుతున్నాను శెలవుమీద...”

“ఏం, ఏమిటిసంగతి...ఎన్నాళ్ళుశెలవు?”

“ఏంలేదు...ఊరికే సె రెస్టుతీసుకుందామని పెట్టాను...రెండు నెలలు...”

‘అబ్బా!...ఇంకేం...బాగుంది...అయితే...ఇతనెవరు...’ పరీక్షగా ప్రభాకర్‌నుచూస్తూ ప్రశ్నిస్తాడు.

“ఇతనా...స్నేహితుడులే..” అప్పుడు ప్రభాకర్, రామంకేసి తిరిగి ధైర్యంగా...

“అయ్యా! నమస్తే!...”

“నమస్తే!!...” పరీక్షగావాని నాపాదమస్తకం చూస్తాడు ముష్టివాడిలాఉన్న వీడు, వీనికి స్నేహితుడేమిటా అని. అదిగ్రహిస్తాడు ఆనందరావు అనుమానం కలుగనీయకుండగా.

“ఇతను ‘పూనా’ నుంచి వస్తున్నాడులే... పేరు ప్రభాకరరావు...”

“అల్లాగా!...అసలువీరి దేవూరు...?”

“కాకినాడ...పూనాలోవుంటున్నాడు...”

“ఊ...హూం!...అయితే అక్కడ ఏంపనిలో వుంటున్నారండీ...?”

అన్నాడు వికృతంగావున్న వానిఆకారంచూచి కొంచంఅనుమానిస్తూను. ఏంచెప్పునో అనే సంకోచంతోటి అసలువానిని మాట

లాడనివ్వకుండా తానే అందుకుని గబగబా చెప్పడం మొదలుపెట్టాడు ఆనందరావు.

"కాలేజీలో చదువుతున్నాడు... ఈసంవత్సరమే B. L. అయిపోయింది. ఇంటికివచ్చేశాడు"

"ఇదేనా రావడమా...?" అనగానే ఆలోచించకుండా ఆనంద్

"అవును... ట్రైనులో పాపం సామానంతా దొంగలుకొట్టేశారుట... అంతా నానాపాడూ అయింది"

"అయ్యో! పాపం, అల్లాగా... రిపోర్టు ఇవ్వలేకపోయారా...?"

ఆనంద్ యొక్క ఈధోరణి అంతా తొలుత వింతగానే తోచినప్పటికీ ప్రభాకర్ వెంటనే గ్రహించుకున్నాడు. ఆనంద్ మాటలకు సరిపడేటట్లే తనూ మాట్లాడడం మొదలుపెట్టేడు.

"ఆ!... వెంటనే ఇచ్చానండీ ... ప్రయత్నం చేస్తామన్నారు ..." ఆనందరావందుకుని.

"అయితే ఇంకేం, మరేమీ భయంలేదు ... పోలీసుల చేతులలో పడితే ఊరికే పోనివ్వరు దొంగనీను..." అన్నాడు నవ్వుతూను రామం కొంచెంఅనుమానంతో.

"అయితే వీరు వెళ్ళవలసింది కాకినాడకదా... మరినీతో..."

"అవును కాకినాడనుండే వస్తున్నాం ... వాళ్ళువాళ్ళంతా పూరికెళ్ళారుట బరంపురంలో బ్రదర్ దగ్గరకు వెడదామని బయల్దేరాడు. స్టేషనులోనే నన్ను కలుసుకున్నాడు..."

"అయితే నువ్వు ఈవూరెప్పుడొచ్చావు...?" అని ప్రశ్నించాడు ఆనంద్.

"రెండురోజులయింది... ఆనక మెయిలులో వస్తానులే ఇంటికి"

ఇంతలోకి రైలుకూత వేసి కదిలింది. ఆనంద్ ప్రభాకర్లు బండి ఎక్కుతారు. ప్రభాకర్ ధైర్యంగా,

"అయ్యో! వస్తానండీ...సెలవు..."

"సెలవు"

బండి స్టేషను దాటి వెళ్ళిపోతుంది. ప్లాట్‌ఫారంమీద నిలబడి రామం తనలో తాను వితర్కించుకుంటూ వుంటాడు. ఏమిటి పిచ్చి స్నేహం. వాడెవడో ముష్టివెధవలా వున్నాడు... ఏమీ అర్థం కావడం లేదు, సరే ఆనక నెమ్మదిమీద అన్నీ తెలుసుకోవచ్చు అని సమాధానపరచుకుని వెళ్ళిపోయాడు తన దారిని.

ఇంక బండిలో మనవాళ్ళసంగతి. ఇద్దరూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు. ప్రభాకరుకు ఆనంద్ ధోరణి వింతగానే తోచింది. వానిమీద పూర్తి నమ్మిక యేర్పడింది. ఒక నిట్టూర్పు విడచి స్వస్థచిత్తంతో,

"అబ్బా! ఎంతనాటక మాడేవోయ్! నిజంగా వానిని చూడగానే నాకు వణుకు పుట్టింది..."

"అవసరాలనుబట్టి ఎల్లాటి నాటకాలయినా ఆడాలి ... అతనెవరో తెలసా ... పోలీసు ఇనస్పెక్టరు ... అవలిస్తే ప్రేగులు లెక్కిస్తాడు..."

"ఏమయినా నీ ఉపకారం ఎన్నటికీ మరువలేనోయ్, ఆనంద్!"

"ఆ!...దాని కేమిగాని ఇకముందుంది ముసళ్ళపండగ..."

"ఆ! అదేమిటి...?" కొంచం త్రుళ్ళిపడి మళ్ళా సర్దుకుంటాడు.

"అంటే మరేం లేదు...ఇంతవరకు దైవానుగ్రహంతో గెంటుకువచ్చాం...ఇకముందు జాగ్రత్తను గురించి అన్నాను అంతే..."

"అవును ... కాని ... నావల్ల నీవు కూడా కష్టాలలో చిక్కుకుంటున్నావు..."

"ఇదికూడా ఓకష్టమేనా...నేనల్లా భావించను. తోటిసోదరునకు అన్యాయంగా కష్టమేర్పడితే సాయపడడం మానవునిధర్మం

కాదా...అల్లా సాయపడకపోతే వాడు వైద్యశాస్త్రంలోకూడా నీచుడుగా చూడబడతాడు...అల్లాటప్పుడిందులో నన్నంత పొగడవలసినదేముందీ..."

"అయితే మనమింకా ఎంతవరకూ వెళ్ళవలసివుంటుందీ...?"

"విజయనగరమే...ప్రక్క స్టేషనే మరొక పదినిముషముల కల్లా వెళ్ళిపోతాం..."

"మీవూరు విజయనగరమా..."

"అవును..."

"అయితే...ఆసబిన్స్పెక్టరుదీ మీవూరేనా...?"

"అవును. మేమిద్దరం బాల్యస్నేహితులం. ఇద్దరం ఇంటర్మీడియేట్ పూర్తిచేశాం. అతనల్లా పోలీసు ఇనస్పెక్టరుగా వెళ్ళాడు. నేనిల్లా రైల్వేలోపడ్డాను..."

"అతని విషయం..."

"మనకేమీ భయంలేదు...అతడు చాలా మంచివాడు. తరుచుగా మాయింటికివస్తూనే వుంటాడు..."

"ఆ!...మీయింటికా!..."

"ఏం? అందువల్ల భయపడవలసినదేమీ లేదు ... నీసంగతి వింటే అతనుకూడ మనకు తప్పకసాయం చేస్తాడు..."

ఇంతలోకి రైలు విజయనగరం స్టేషన్ చేరుతుంది. విరామం లేకుండా చేసిన ప్రయాణానికి ఎంత అలసిపోయినదో యేమో వేడి నిట్టూర్పులవలె ఆవిరి పెద్దధ్వనితో వదలుతూంది. విజయనగరం స్టేషన్ జంక్షనుకావడం మూలాన ఎక్కువగా జనసమ్మర్దంగాను హడావడిగానువుంది. ఆనందరావు క్రిందకు దిగుతాడు. వానిననుసరిస్తాడు ప్రభాకరరావు. ఆనంద్ అల్లాపోతున్న పోర్టరు రామన్నను పిలుస్తాడు.

"ఓయ్! రామన్నా! ఇల్లారా..."

"ఏం బాబూ!..."

"చూడూ ఈ బెడ్డింగూ ట్రంకూ అవతల సునయిల్లాపెట్టి వున్నవాడి జట్కాలో పెట్టు. వస్తున్నాను..."

"చిత్తం! మానవీధిలోనే వున్నాడండి చప్పునరండి..." అని చెపుతూ ట్రంకు బెడ్డింగు తీసుకుని తిన్నగా గేటుదాటి ఓవర్‌బ్రిడ్జి మీదుగా అవతల బళ్ళఘాటీలో ఒక జట్కాబండిలో పెడతాడు సామాను. ఆనంద్ ప్రభాకర్లు నెమ్మదిగా నడచి వెడుతూవుంటారు. గేటుదగ్గర టిక్కెట్లు వసూలుచేస్తూవుంటాడు ఆనంద్ స్నేహితుడు ప్రకాష్! ఆనంద్‌ను చూడగానే నవ్వుముఖంతో.

"హల్లో! ఆనంద్, ఎప్పుడొచ్చావు...?"

"ఇప్పుడేవస్తున్నా..."

"ఏమిటిసంగతి...ఇతడెవరు?"

"ఫ్రెండులే...రెండు నెలలు శెలవుమీద వచ్చాను..."

"గుడ్! కొట్టావు ఛాన్సు..."

"వస్తానుమళ్ళీ ఆనక...త్వరగా పోవాలి..."

అంటూ ప్రభాకర్‌తో కలిసి తిన్నగా వంతెనదాటి బళ్ళఘాటీవద్దకు వస్తారు. అక్కడ సిద్ధంగావున్న బండి ఎక్కుతారు. ఆనంద్ రామన్నకు ఒక పావులా ఇస్తాడు. జట్కాకదుల్తుంది. ఆ బండి వాడిల్లు ఆనందరావిల్లున్న వీధిలోనే వుండడంచేత వారిల్లు బాగుగా తెలుసును. అందుచేత తిన్నగా తోలినాడు బండిని. అప్పుడు తొమ్మిదిన్నర అయిందికైము. ప్రభాకర్ తానిటుపైని ఎలాప్రవర్తించాలా, ఏమిచెయ్యాలీ అని యోచిస్తూ వుంటాడు. కొంచం సేపటికి బండి ఆనందరావింటిముందు ఆగుతుంది. అదిమొకచక్కని మేడ. చుట్టూ ఆవరణ ఆవరణలో పూలమొక్కలూ చాలా అం

దంగా వుంటుంది. ఆయిల్లు చాసన్నపేటలోవుంది పెద్దవీధిలోను. బండి ఆగగానే ఆనంద్ ప్రభాకర్‌లు క్రిందకుదిగుతారు. బండివాడు సామాన్లు లోపలకు వెళ్ళి ఒకచోట పెడతాడు. బండివానికియ్య వలసిన అద్దెఇచ్చేసి ఆనందరావు ప్రభాకరరావుతో కలిసి లోపలకు వస్తాడు. ఆనంద్‌ను చూసి లోపలనుంచి వంటమనిషి సీతమ్మ ఎదురుగావచ్చి ఆదరణగా పలకరిస్తుంది.

"రా!...నాయనా రా! ... ఇదేరావడమూ నేమిటి...! కులాసాగా వున్నావా...?"

"ఆ! కులాసాగానే వున్నాను. ఇక్కడంతా క్షేమంగా ఉన్నారా...? ఏరీ నాన్నగారూ, కమలాను...?"

"కమలమ్మకు యివాళ శలవుకదూ...ఎవరో స్నేహితుల యింటికి వెడతానని వెళ్ళింది...బాబుగారిప్పుడేవీధిలోకివెళ్ళారు..."

దానినిబట్టి ఆనందరావుకు తల్లిలేదని గ్రహించాడుప్రభాకర్. "నాన్నగారివంట్లో ఆరోగ్యంగా ఉంటోందా...?"

"ఆ!...లే నాయనాలే!...ఇతనెవరూ...?"

"ఇతనొక స్నేహితుడు. కొంచం పనివుండి వచ్చాడు... కొన్నాళ్ళపాటు మనింట్లోనే వుంటాడు..."

"అల్లాగా...! సరేలేవండిబాబూ! నేనూ...పెందరాళేమడి కట్టుకుంటాను...భోజనం చేద్దురుగాని...ఎప్పుడు తిన్నారో ఏమిటో పాపం..."

"అల్లాగేలెండి తొందరలేదు కానివ్వండి...పైన మేడమీద వుంటాం..."

అని ఇద్దరూ మేడమీదకు వెడతారు వీధితలుపు దగ్గరగా వేసి. సీతమ్మగారు మడికట్టుకోవడానికి వెడుతుంది, ఆనందరావు

తన గదిలోకి ప్రభాకర్‌ను తీసుకువెళ్ళి తాను బట్టలు మార్చుకుని, ప్రభాకర్‌కు ఒకజత శుభ్రమయిన దుస్తులనిచ్చి,

"ఇప్పుడేవస్తాను కూర్చోవోయ్! ... ఇవిగో ఈబట్టలు మార్చుకో..."

"అల్లాగేలేవెళ్ళు..." ఆనందరావు క్రిందకువెళ్ళిపోతాడు.

ప్రభాకర్ బట్టలుమార్చుకుని అచ్చట కుర్చీలో సంకుకుని పేపరు చదువుకుంటూ వుంటాడు. కొంచంసేపటికి సీతమ్మగారివల్ల తనఅన్న వచ్చాడని తెలుసుకుని సంతోషంతో తొందరగా ఆనంద రావు గదిలో ప్రవేశిస్తుంది కమల. ఆవలిదిక్కుగా ముఖంపెట్టుకుని పేపరు చూచుకుంటూయున్న ప్రభాకరరావు నాతొందరలో బాగుగ గుర్తించకయే ఆత్రుతగా "ఎప్పుడు వచ్చావన్నయ్యా!..."

వెంటనే ప్రభాకర్ ఒక్కసారిగా ఆమెవైపు చూస్తాడు. ఆమెకూడ ఆ అపరచిత వ్యక్తిని హఠాత్తుగాచూసి నిశ్చేష్టురాలయి తెల్లబోతుంది. క్షణకాలం ఆనాలుగుకళ్ళూ చలనంలేకుండా అల్లాగే వుంటాయి. అంతట కమల తెప్పిరిల్లి సిగ్గుచే ముఖం వంచుకుని క్రీగంట వానినిచూస్తూ, ఈతడెవ్వరాఅని అనుమానిస్తూ.

"క్షమించండి!...నా...అన్నయ్య అనుకున్నా..."

"ఫరవాలేదు...మీఅన్నయ్య ఇప్పుడే క్రిందకువెళ్లాడు..." అన్నాడు శాంతంగా.

"అయితే...మీరు..." అంతలోకే మాటకడ్డువచ్చి "మీ అన్నయ్యతో వచ్చాను...పనివుండి..."

మాట వినిపించుకోకుండానే వెంటనే తిరిగివెళ్ళిపోయింది. మరల పేపరు పుచ్చుకుని ఆలోచనలో పడ్డాడు ప్రభాకరరావు. ఇంతలోకి ఆనందరావు వచ్చాడు అంతట సంశయంతో అన్నాడు ప్రభాకర్!

"ఇప్పుడే ఎవరో మిస్సిస్ అనుకుంటాను వచ్చిందోయ్!"
"ఏదీ...ఏమందేమిటి...?"

"ఏంలేదులే...పాపం నన్నుచూసి తొందరలో అనునవ్వేతుంది...'ఎప్పుడొచ్చావన్నయ్యా' అంటిగదిలోకివస్తూనే. ఎవరా అని ఆశ్చర్యంగా చూచాను ఆమెకేసి. ఏమనుకుందోపాపం 'మా అన్నయ్యకోసం వచ్చా' నని అనేసి వెంటనే వెళ్ళిపోయింది..."

నవ్వుతూ చెపుతాడు. ఆనందరావుకూడా నవ్వుతున్నాడు.
"సరేపద క్రిందకుపోయి భోజనంచేద్దాం..."

ఇద్దరూ క్రిందకు వెడతారు భోజనానికి. అప్పుడు పదకొండు గంటలయింది టైము. సీతమ్మగారు భోజనసావడిలో వీళ్ళయిద్దరికీ వడ్డించింది. ఇద్దరూ భోజనాలకు కూర్చుంటారు. మరలరెండు నిమిషాలు పోయేసరికి కమలవస్తుంది. ప్రభాకర్‌నుచూసి సిగ్గుపడుతుంది. ఆగడ్డంచూసి కొంచం అసహ్యించుకుంటుంది. పట్టరాని ఆనందంతో అన్నగారిదగ్గరగావచ్చి అంటుంది.

"ఎప్పుడు వచ్చావన్నయ్యా!..."

"ఇప్పుడే వచ్చానుకమలా! ఒక గంటసేపవుతుంది...అంతా కులాసాగా వున్నారా...?"

"ఆ!...నాన్నగారు ఇందాకానే వీధిలోకి వెళ్ళారు...వచ్చే వేళయింది..."

"ఈమె మా Sister లోయ్! స్కూలు ఫైనల్ పరీక్షకు వెళ్ళింది ... ఇతను ప్రభాకరరావని కాకినాడలో ... కొన్నిపనులు చక్కబెట్టుకు వెళ్ళడానికి వచ్చాడు ... ప్రస్తుతం మనయింట్లోనే వుండాడు..."

"అల్లాగా! ...నమస్కారమండీ..." అంటుంది ఓరకంట చూస్తూను. అప్రయత్నంగా ఆమెకేసిచూసి ... నెమ్మదిగా చిరునవ్వుతో.

"నమస్కారం...!" నేటికాలపు నాగరిక లక్షణమేగాయిది?

"అయితే శలవులా! పేపర్లు బాగారాశావా...? ఇప్పుడు స్కూలుకు శలవులేనా?"

"ఆ! రెండు నెలలు..."

"బాగుంది అయితే...నాకుకూడ బ్రహ్మాండంమీద రెండు నెలలు శలవు గ్రాంటుచేశారు..."

"నీకు...రెండు నెలలు శలవుయిచ్చారా..." అంటుందిఆనంద రావుతో ఆతృతగా –

"ఆ పూర్తిగా రెండునెలలు యిచ్చారు..."

ఇంతలో వీధితలుపు చప్పుడవుతుంది. ఒకఅరవైయేండ్ల వ్యక్తి. అతడు వృద్ధుడయినా ఇంకా శరీరపటుత్వం తగ్గలేదు. దృఢంగానేయున్నాడు. లోపప్రవేశిస్తూ చేతికర్రఊపుకుంటూ భోజనముల గదిలోనుంచి వినిపించే మాటలువిని ఆవంకకు నడుస్తాడు. వానికి కమలయెదురవుతుంది.

"అన్నయ్యవచ్చాడండీ నాన్నగారూ..."

"ఆ!...ఏడీ...ఎప్పుడువచ్చాడు..." అంటూ భోజనాలగది దగ్గరకువస్తాడు. ఆయన ఆనంద్ తండ్రి చంద్రశేఖరరావుగారు.

"ఏం నాయనా! ఎప్పుడువచ్చావు...? ఎంతసేపయింది...?"

"ఒకగంటపైని అవుతుంది నాన్నగారూ...మీావంట్లో ఆరోగ్యంగా ఉంటోందా...?"

"ఆ!...నీవంట్లోసుఖివుగావుందా...ఇతనెవరు?"

"స్నేహితుడు...కాకినాడ..." అంతలోకి ప్రభాకరరావు బురిమెత్తి.

"నమస్కారమండీ!..."

"ఆ!...కానీయండి నాయనా భోజనాలు...తర్వాత నెమ్మదిగా మాటలాడుకోవచ్చును"

ఇంతలోకి సీతమ్మ వడ్డన్నకై ఏదో పనులు పట్టుకొచ్చి, చంద్రశేఖరరావుగారిని చూచి...

"మీరు కూడా మడికట్టుకోండి బాబుగారూ!"

"అల్లాగేలే...వస్తాను. ముందువాళ్ళసంగతి చూడు..."

అంటూ చంద్రశేఖరరావుగారు మేడమీదకు వెడతారు. కమల అక్కడనిలబడి ఆ స్థాలుగా సాగిపోయిన ఆ పెద్దమనిషి ఎల్లాంటి స్నేహితుడో అని ఆలోచిస్తూ ఏదేదో ఊహించుకుంటూ చూపుల వానిని చూస్తూ ఆప్రక్కగా నిలబడివుంది. సీతమ్మ ఏవో పదార్థాలు వడ్డించి వెళ్ళి చంద్రశేఖరరావుగారికి భోజనము కావలసిన ఏర్పాటులన్నీ చేస్తోంది.

సీతమ్మగారొక వలబజేళ్ళ పూర్వనివాసిని. చాదస్తమెక్కువ. పుట్టినింటివారు పేదస్థితి ఉండడమూ చేతను. భర్తపోయినా తానుమిక్కిలి అభిమానవంతురాలు తెలివయింది కావడంచేతను భర్తపోయిన పదేళ్ళనుండీ ఇల్లాగే గౌరవంగా ఏ పెద్దఆఫీసరింట్లోనో వంటలక్కగావుండి జీవయాత్ర సాగిస్తోంది. ఈమె చంద్రశేఖరరావుగారింట్లో వంటకు కుదిరి అప్పుడే ఆరేళ్లు కావస్తుంది. ఎంతో అన్యోన్యంగావుంటూ ఎవరిచేత మాటపడకుండా, తల్లిలేని ఆయిద్దర్నీ ఎంతో ఆదరణగా చూస్తూ చాలాజాగ్రత్తగా కాలంగడుపుతుంటోందీమె యిక్కడ.

నాల్గవప్రకరణము సమాప్తము.

# ఐదవ ప్రకరణము.

ఇంకమద్రాసులోని విశేషాలు విచారిద్దాం. అది వెంకటేశన్ మేడ. చాలా అందంగా నూతనపద్ధతులమీద నిర్మింపబడినది. చుట్టూ ఆవరణ, అందులో పలురకముల పూలమొక్కలు. ప్రహరీగోడకు అందమయిన సింహద్వారము. విద్యుద్దీపాలు, మిక్కిలి అందమయిన రెండంతస్థులమేడ. వెంకటేశన్ లక్షలధనవంతుడు. స్థిరాస్థి సుమారొక వందయెకరములవరకు భూమి, రెండుమేడలూవున్నాయి. ఇదిగాక సుమారయిదారు లక్షలవరకూ రొఖ్ఖంకూడావుంది. వడ్డీవ్యాపారాలుచేస్తూవుంటారు. ప్లీడరు ప్రాక్టీసు బాగావుడడంచేత నెలకు సుమారొక నాలుగుమూడువందలదాకా వస్తూవుంటుంది. యింత డబ్బువున్నదన్నమాటేగాని ఎవ్వరికి ఒక్కదమ్మిడీకూడా ధర్మం చెయ్యడు. ఎవరయినా ముష్టివాడువస్తే వాణ్ణి కొట్టినంతపనిచేసి మీ అందరకు ధర్మంచెయ్యడానికి నాకు వెనుక ఎక్కడపాతరలులేవు కష్టపడలేరూ... వెధవలు ముష్టివెధవలు, ఇల్లాంటివాళ్ళాఖ్యులంతాచేరబట్టే దేశంకూడా ముష్టివెధవదేశమయిపోయింది. కాస్తఊపిరయినా తీసుకోనివ్వరు... ఈవెధవలంతా ఒక్కసారిచస్తే బాగుండును... ఉన్నవాళ్ళయినా కడుపునిండాతింటారు. అంటూ ఓచిన్న లెక్చరుకొట్టి చివరకు ఒక్కదమ్మిడీఅయినా ఇవ్వడు. పాపం వాళ్లెంతపిసినికొట్లు వాళ్ళవుతారో అంతను పదిరెట్లుగాఖర్చుకూడ వారిచేత ఏదోవిధాన ఆభగవంతుడుకూడా చేయిస్తూవుంటాడు, అదివానియానందమేమో! ధర్మపన్నములు చెప్పువానిచేతనే అక్రమములెన్నియో రహస్యముగా చేయించును. బీదవానికే ఉన్నదానిలో సంతృప్తి కలుగజేయును వానివలనే ఎల్లప్పుడు సంతోషముగానుండును. అష్టైశ్వర్యసంపన్నుండగు సార్వభౌమునికన్న నిత్యదరిద్రుండగు 'నిరాడం

చిరజీవి నిత్యానందమూర్తి అన్నట్లుధనికులకెవ్వడును స్థిమితమను నదియుండదు. అందును ముఖ్యముగా పిసినిగొట్టువాండ్లు, వారెంత కష్టపడి చివరకు కడుపునకుగూడ నిండయినతిండితినక కూడబెట్టు చుందురో వారివద్దనుండి ఆచంచలలక్ష్మి అంతటిసులభముగాను వారల కండ్లకు మైకముగప్పిపోవుచుండును. అట్లేయున యీ వెంకటేశన్ కూడ డబ్బువిషయములో నిర్భాగ్యగాటముగా ప్రవర్తించువాడు. వీనికి తొలుత యెట్టిదురభ్యాసములు లేవు. కాని యొకనాడు మిత్రు నింటికి విందునకయిపోయి మిత్రులబలవంతముచేత కొలదిగా చవి చూచి నాడాదివ్యావృతము మద్యమును. ఆస్పర్శచేసిన వేళావిశే షమెట్టిదియోకాని యీ దేవి మనవానిని హస్తగావలచినది. కొలది కాలముననే పలురకములగు న్యాయశాస్త్రగ్రంథములు హరించి పోయి ఇంటిలోని బీరువాలనిండా పలురకముల బ్రాందీసీసాలు అవ తరించినవి. క్రమముగా యీ దేవిహితులురాండ్రు మనవానినాక ర్షించినారు. ఇంకగావలసినదేమిగలదు? రాపానము వేశ్యాగమ నము, తీరికవేళలందు జూదము. లక్షణములు అన్నియు అలవడినవి. తానుచేయు పరీక్షలకెల్ల తట్టుకున్న పరిపూర్ణభక్తునే యీ దేవదేవుడు తనసాన్నిధ్యమునకు గొనిపోవును. అట్లేమన వెంకటేశన్‌కుకూడదుర్వ్య సనంబులన్నియు సంపూర్ణముగ అలవడి పరిపూర్ణుడయిన వెంటనే పర లోకప్రాప్తి గల్గినది.

ఇంక వీనికుమారరత్నము సుబ్రహ్మణ్యముగలడు. అతడీసంవ త్సరమే 'B. A.' తరగతిలోనికివచ్చినాడు. బుద్ధికుశలత రూపురేఖ బాగుగాయున్నప్పటికిని, లక్ష్మీపుత్రుడే అయినప్పటికిని వానివద్దనొక విపరీతపుగుణముకలదు. కొంచమునునస్సు తరచుగాచపలమ్మై వుండు చుండును, అందమయిన అమ్మాయిలగాంచినంతనే ఉడుగయిన

కదపలేదు. స్త్రీవిషయములయందు దీక్షయుంచు. వెనుక లయచున్న, తండ్రి ని మించినకోపమూ దనుకోనుట కేవలమాత్రమును సందిగ్ధముగుండబోవు,

వెనుకప్రక్క ఇండ్ల వీసితండ్రి హత్యావిషయములో నవమునకు సముద్రతీరమునుండి గోని తెచ్చిన 'భీమన్న' యను కాపు వీరియింటి యందు కొంతకాలము నౌకరుగాయుండి తగ్గశివమాని చేసెనని చెప్పి యుంటిని. ఆతడునాని సేయుటకేతడే కారకుడు. భీమన్నకు 'అచ్చమ్మ' యను పదునారేండ్ల పడుచు కుమార్తెగలదు. మానప్రబుద్ధుడొకనాడు భీమన్న యింటిపరిసరములకు వ్యాహ్యాళికరిగి అచ్చట దూడలకు మేత వేస్తున్న 'అచ్చమ్మ' ను చూశాడు. అవయవ సౌష్టవం, ఆమె ముఖ మునందలి అసహజసౌందర్యం, నిర్వ్యాపారంగా కాలం వెళ్ళబుచ్చే ఆ కాపుపడుచును చూచేసరికి మనవాడు గుటకలు మ్రింగడం మొదలు పెట్టాడు. అమాయకురాలైన ఆమెదగ్గరకు ఇటునటు ఎవ్వరూలే కుండగాచూసి చేరినాడు. చిన్నజమీందారువచ్చినాడు కదాయని ఆమె ఏదో తగురీతిని మర్యాదచేసింది. వాడు చాలా పెద్దగ్రంథకర్త యని ఆమెకేమి తెలుసును? ఏవేవో అవీఇవీ కులాసాకబుర్లు చెవుతూ ధోరణి ఇంకోవిధముగా త్రిప్పాడు సుబ్రహ్మణ్యేశ్వరుడు. ఆమెకు కొంచం వానిధోరణి వింతగా తోచింది. ధనాశ చూపాడు. చాలా రహస్యంగావుంచుతానన్నాడు. ఆఖరుకు నెమ్మదిమీద ఎన్నోనగలు బట్టలుకూడా ఇస్తానన్నాడు. ఒక్కసారి తనతుచ్ఛకోర్కె తీర్చమ న్నాడు. ఆమెకంగారుపడింది. ఈవిషయమంతా తండ్రికితెలిస్తే బ్రత కనివ్వడు. అందుచే ఆమె భయంతో వానినివెంటనే వెళ్ళిపొమ్మంది. అసలుజబ్బుప్రవేశించకుండా నేవుండాలిగాని ప్రవేశించాక అంతత్వరగా పోతుందా? మనవాడికా కామోద్రేకంలో కన్నుమిన్ను కానరాలేదు. సాహసించి ఆమెచెయ్యిపట్టుకోబోయాడు. ఇంతలోకీ హఠాత్తుగా తండ్రి భీమన్నవొచ్చాడు. వెంటనే ఆమెచెయ్యివదలివేసి గుటకలు

బరజీవి నిత్యానందమూర్తి అన్నట్లుధనికులకెన్నాడును స్థిమితమును పడియుండదు. అందును ముఖ్యముగా పిసినిగొట్టువారికిలు, వారెంత కష్టపడి చివరకు కడుపునకైగూడ నిండయుండిలిండి తినక కూడబెట్టు చుందురో వారివద్దనుండి ఆ చంచలలక్ష్మి అంతటినుండివృగాను వారల కండ్లకు మైకముగప్పిపోవుచుండును. అట్లేమన యీ వెంకటేశన్ కూడ డబ్బువిషయములో నిర్భాగమూటముగా ప్రవర్తించువాడు. వీనికి తొలుత యెట్టిదురభ్యాసములు లేవు. కాని యొకనాడు మిత్రు నింటికి విందుకు యిబోయి మిత్రులు బలవంతించున కొలదిగా చవి చూచి నాడాదివ్యాస్వాదము మద్యమును. అస్పర్శ చేసిన వేళావిశే షమెట్టిదియో కాని యీ దేవి మనవానిని పూర్తిగానలచినది. కొలది కాలమునకే పలురకములగు న్యాయశాస్త్రగ్రంథములు నశించి పోయి ఇంటిలోని బీరువాలనిండా పలురకముల బ్రాందీసీసాలు అవ తరించినవి. క్రమముగా యీ దేవిమిత్రురాండ్రిందరు మనవానినాక ర్షించినారు. ఇంక గావలసినదేమిగలదు? రాపానము వేశ్యాగమ నము, తీరికవేళలందు జూదము. లక్షణములు అన్నియు అలవడినవి. తానుచేయు పరీక్షలకెల్ల తట్టుకున్న పరిపూర్ణశక్తుని యీ దేవ దేవుడు తనసాన్నిధ్యమునకు గొనిపోవును. అట్లేమన వెంకటేశన్ కుకూడ దుర్వ్య సనంబులన్నియు సంపూర్ణముగ అలవడి పరిపూర్ణుడయిన వెంటనే పర లోకప్రాప్తి గల్గినది.

ఇంక వీనికుమారరత్నము సుబ్రహ్మణ్యముగలడు. అతడీసంవ త్సరమే 'B. A.' తరగతిలోనికివచ్చినాడు. బుద్ధికుశలత రూపురేఖ బాగుగాయున్నప్పటికిని, లక్ష్మీపుత్రుడే అయినప్పటికిని వానివద్దనొక విపరీతపుగుణముకలదు. కొంచమునన్ను తరచుగా చవుల్వ ముందు చుండును. అందమయిన అమ్మాయిలగాంచినంతనే అడుగయిన

కదపలేదు. స్త్రీవిషయములయందు ఇకముందు వెనుకలరయడు, తండ్రి ని మించినకామాంధు డనుకోవటానికి మాత్రము సందేహముండబోదు.

వెనుక ప్రకరణముల సీతారామశాస్త్రి హత్యావిషయములో నవమోహను సముద్రతీరమునుండి గొనితెచ్చిన 'భీమన్న' యను కాపు వానియింటి యందు కొంతకాలము నౌకరుగాయుండి తరువాత మానివేసెనని చెప్పి యుంటిని. ఆతడు మానివేయుటకీతడే కారకుడు. భీమన్నకు 'అచ్చమ్మ' యను పదునారేండ్ల పడుచు కూతురున్నది. మనప్రబుద్ధుడొకనాడు భీమన్న యింటిపరిసరములకు వ్యాహ్యాళికరిగి అచ్చట దూడలకు మేత మేపుచున్న 'అచ్చమ్మ' ను చూచాడు. ఆ అంగసౌష్టవం, ఆమె ముఖ మునందలి అసహజసౌందర్యం, నిర్విచారంగా కాలం వెళ్ళబుచ్చే ఆ కాపువనుచును చూచేసరికి మనవాడు గుటకలు మ్రింగడం మొదలు పెట్టాడు. అమాయకురాలయిన ఆమెదగ్గరకు ఇటునటు ఎవ్వరూలే కుండగా చూసి చేరినాడు. చిన్నయజమానివచ్చినాడు కదాయని ఆమె ఏదో తగురీతిని మర్యాదచేసింది. పాపం వాడుచాలా పెద్దగ్రంథకర్త యని ఆమెకేమి తెలుసును? ఏవేవో అవీఇవీ కులాసాకబుర్లు చెప్పుతూ ధోరణి ఇంకోవయిపుకు త్రిప్పాడు సుబ్రహ్మణ్యేశ్వరుడు. ఆమెకు కొంచం వానిధోరణి వింతగా తోచింది. ధనాశ చూపాడు. చాలా రహస్యంగావుంచుతానన్నాడు. ఆఖరుకు నెమ్మదిమీద ఎన్నోనగలు బట్టలుకూడా ఇస్తానన్నాడు. ఒక్కసారి తనతుచ్ఛకోర్కె తీర్చుమ న్నాడు. ఆమెకంగారుపడింది. ఈవిషయమంతా తండ్రికితెలిస్తే బ్రత కనివ్వడు. అందుచే ఆమెభయంతో వానినెంటనే వెళ్లిపొమ్మంది. అసలుజబ్బుప్రవేశించకుండా నేవుండాలిగాని ప్రవేశించాకఅంతత్వరగా పోతుందా? మనవాడికా కామోద్రేకంలో కన్నుమిన్ను కానరాలేదు. సాహసించి ఆమెచెయ్యిపట్టుకోబోయాడు. ఇంతలోకీ హఠాత్తుగా తండ్రి భీమన్నవొచ్చాడు. వెంటనే ఆమెచెయ్యివదలివేసి గుటకలు

మ్రింగడం మొదలుపెట్టాడు సుబ్రహ్మణ్యం. భీమన్నకు ఒక్కసారిగా ఒడలుమండినది. తోకత్రొక్కిన త్రాచులాగున వచ్చిందికోపం. ఆ కోపంలో తానేమంటూన్నదికూడ తెలుసుకోకుండానే తలవాచేలా పెట్టాడు చీవాట్లు సుబ్రహ్మణ్యానికి. మరలఅక్కడ అగుపిస్తే నరికేస్తానన్నాడు. అమాయకురాలయిన అచ్చన్నను చావకొట్టాడు. నాటి నుండీ వెంకటేశ్వర్ ఇంట్లోఉద్యోగంమానేసి తనకున్న నాలుగెకరాల భూమిదున్నుకొని హాయిగా జీవనంచేస్తున్నాడు. ఇదీ అసలు భీమన్న మానివేయడానికి కారణం.

ఆనాడు ఉదయం ఎనిమిదిగంటలవుతుంది టయిము. సుబ్రహ్మణ్యం మేడమీది తనగదిలో ఒకసోఫాలోకూర్చుని ఏదోయోచిస్తూవుంటాడు. గదిచక్కగా అలంకరింపబడివుంటుంది. అది వానిపడక గది. అప్పటికితండ్రిపోయి సుమారొక ఇరువదిరోజులు అవుతుంది. తల్లియిదివరకే చనిపోయింది. ఇప్పుడాయింట్లో తానొక్కడే ఉంటున్నాడు. అతనియోచనలకు అంతరాయం కల్గుతుంది. నౌకరు వచ్చి పోలీసుఆఫీసరు వచ్చారనిచెప్పాను. దాంతో కాఫీఫలహారములు తెమ్మని ఆనౌకరుతో చెప్పి తాను క్రిందకువెళ్లి పోలీసుఇనస్పెక్టరును కలుసుకుంటాడు. ఆహ్వానించి ఒకటేబిలుదగ్గర ఇద్దరూ చెరియొక కుర్చీలోనుకూర్చునివుంటారు. నౌకరు తెచ్చిన కాఫీఫలహారములనార స్తూగి కర్తవ్యమునుగురించి సంభాషించుకుంటూవుంటారు.

"అయితే ఏమయినా సంగతులు తేలినాయా...ఇనస్పెక్టరుగారూ...''

"ఇంకా ఏమీ తెలియటం లేదు...గట్టిప్రయత్నములు మాత్రం చేస్తున్నాను.

"ఇంతపనిచేస్తాడనుకోలేదండీ...ఆశంకర్రావు...''

"అతనెల్లాంటివాడండీ...?''

"చాలామంచివాడేనండీ...ఖాళీ సమయాలలో దుకాణానికి వస్తూ పోతూ కూడా మా నాన్నగారితో ఆతనికేమీ పరిచయమయినా లేదు..."

"ఏమో...ఏమని నిర్ధారణ చేయుటకు వీలు లేదండీ...అయితే మీకింకా ఎవరిమీదయినా అనుమానముందా..."

"అసలు మా నాన్నకి కెవ్వరూ విరోధులే లేరండీ... (కొంచం సేపు యోచించి...భీమన్న సంగతి జ్ఞాపకం రాగా) ఆ...! అన్నట్లు మీతో ఒక్క విషయం చెప్పాలనుకున్నానండీ..."

"ఏమిటది..."పోలీసుఆఫీసరు ఆతురతగా అడుగుతాడు. ధూర్తుడయిన సుబ్రహ్మణ్యం అమాయకుడయిన భీమన్న, తననిదివరలో పరాభవించటంచేత ఆకోపం తీర్చుకొనటకిదే సమయమని భావించాడు, వానిపైన తనకనుమానమున్నట్లు యేదో ఒక కల్పితగాథ సృష్టించి వానిపై పగసాధించితీరాలని నిశ్చయించుకున్నాడు. తన కృత్రిమాలోచన ఇంచుకయినా బయల్పడనీయకుండా గంభీరంగాను, యోచనలో కూరుకొనినట్లు చెప్పాడు

"ఇదివరలో మాయింట్లో భీమన్నఅని కాపుబంట్రోతు వుండేవాడు..."

వెంటనే ఇనస్పెక్టరు వానిమాటకడ్డువచ్చి ఆతురతగా ప్రశ్నిస్తాడు.

"భీమన్నా!...వానియిల్లెక్కడ..."

"ఎక్కడో సరిగా నాకూ తెలియదు...ఒకమారు అడిగితే...సముద్రానికిదగ్గరేనని చెప్పాడు..." ఇనస్పెక్టరుఏదో ఆలోచిస్తూ బురవ్రాపుతూ.

"ఉ...హూం...అయితే...వాడిమీద నీకేమయినా అనుమానముందా..."

"అదే నేను చెప్పబోతోంది... వాడు పోయిన రాత్రి అంటే మా యింట్లో నౌకరుగా వున్నప్పుడే లెండి; పదకొండు గంటలకు మా యింటికి వచ్చి తనయింట్లో ఎవరితో మాట్లాడుతుంటే జబ్బుచేసిందట ఇరవైరూపాయలు ఇమ్మంటూ అడిగాడు మా నాన్నగార్ని. ఇదివరలో ఒకటిరెండు పర్యాయములు ఏదో డబ్బుకావాలని అడగ్గానే యిచ్చారు. ఆనాడు మా నాన్నగారు ఏదో కోర్టు వ్యవహారం గురించి చాలా చికాకుగా వుండి నా దగ్గరిప్పుడేం లేదు పొమ్మన్నారు. వాడెంతో బ్రతిమాలాడు. అసలే చికాకుగావున్న మా నాన్నగార్కి కోపం వచ్చింది. లేచిపొమ్మని చీకాకు పడ్డారు. దాంతో వాడికెంతగుండె ధైర్యమో చూడండి చివాలున లేచిపోతూ "నా నెత్తురు ధారపోసి మీ యింట్లో పనిచేస్తూంటే... అవసరానికిలా లేచిపొమ్మంటారా ఇప్పుడు!... నా నెత్తురు కళ్ళ చూడందే విడిచిపెట్టను అంటూ చరచరా వెళ్ళిపోయాడు. ఏదో వెర్రి వెధవ నోటికొచ్చినట్లు వాగుతున్నాడనుకున్నాం... కాని యీ పని చూస్తే వాడన్నమాట నిజంగా చేశాడేమో అనిపిస్తోంది..."

"అయితే వాడు మీ యింట్లో ఎంతకాలం క్రితంనుంచి పని చేశాడు..."

"అప్పటికి ఓ నాలుగయిదు మాసాలకన్న ఎక్కువ కాదండీ..."

"ఇప్పుడు వాడేంచేస్తున్నాడో..."

"ఏదో భూమి వ్యవసాయం చేస్తున్నాట్ట... అంతా అబద్ధం... త్రాగుబోతు వెధవ... తెగ త్రాగుతాడు..."

"అల్లాగా... సరే... బాగుంది... అయితే శంకర్రావు సంగతేమిటి...? ఇందులో దోషి ఎవరై వుంటాడు?... శంకర్రావు రక్తపు బట్టలు కూడా దొరికాయే... మనిషి అగుపించడం లేదు ... ఏమీ తలాతోకా కూడా లేకుండా వుంది... సరే తీవ్రంగా ప్రయత్నిస్తాము. ఏం జరుగుతుందో మరి..."

"మంచిది... మళ్ళా ఎప్పుడు? తమ దర్శనం...

"రేపు సాయంకాలం వస్తాను... శెలవు..."

"శెలవు..." అంటూ నమస్కరిస్తాడు. పోలీసు ఆఫీసరు లేచి టోపీ సర్దుకుంటూ ఏమిటో ఆలోచిస్తూ వెళ్ళిపోతాడు. సుబ్రహ్మణ్యాం ఆలోచనలో పడతాడు. తనలో తాను పొంగిపోతాడు. ఏదోవిధంగా భీమన్నమీద పగసాధించగల్గుతున్నానుకదా అని తనలో తాను మురిసిపోతాడు. ఇక్కడపరిస్థితు లిట్లావున్నాయి.

* * * * *

ఇంక విజయనగరంలో ఆనందరావింటికి వచ్చిన ప్రభాకర్ సంగతి విచారిద్దాం. ఆనందరావింట్లో మేడమీదగదిలో, ఆనందరావు, ప్రభాకరరావు ఇద్దరూ చెరిఒకసోఫాలోను కూర్చుని ఏమిటో కులాసాకబుర్లు చెప్పుకుంటూవుంటారు. అప్పుడు నాలుగుదగ్గరయింది టయిము. ఎండఇంకా తీవ్రంగానేవుంది. కొంచెంసేపటికి ఆనందరావు లేచి ప్రక్కబీరువా తెరచి రెండుజతల దుస్తులుతీస్తాడు. అందొక జత తాను కట్టుకుంటూ రెండవది ప్రభాకర్‌కిస్తాడు. ఇద్దరూ ఆ దుస్తులను ధరించుకుని మరల కూర్చుంటారు. ఆనందరావు ఆనాటి పేపరు ఇటూఅటూ తిరగవేస్తూవుంటాడు. ఇంకా తేనీరు రాలేదేమా అని యోచిస్తూను. అంతక్రితమే తేనీరు తేవడానికి క్రిందకు వెళ్ళింది కమల. ఆనందరావు చూస్తూన్నపేపర్ను హఠాత్తుగాఆపి గంభీరవదనంతో పరాకుగా కూర్చుని దేనినిగురించో యోచిస్తూన్న ప్రభాకర్‌తో అంటాడు.

"అయిదువేలు బహుమానంట... చూశావా..."

"ఆ!... దేనికీ...?" ఆనందరావు నవ్వుతూ కనుబొమలెగుర వేస్తూ...

"దేనికా...విను; శ్రీమాన్ ... శ్రీశంకర్రావు బహద్దరు వారిని పట్టియిచ్చినందులకు..."

శంకర్రావు ఉలిక్కిపడి మంచం ప్రస్తాయించుకొని.

"ఏమిటీ...నన్నా...ఏదీచూడనీ..."

"అవునోయ్ నిన్నే...ఇదుగో చూడు...పత్రికల్లో ప్రకటించారు!"

అంటూ ఆనందరావు తన చేతిలోని పేపరు ప్రభాకర్‌కిస్తాడు. ప్రభాకరరావు ఆ పేపరందుకుని చూస్తూవుంటాడు. ముందుకర్తవ్యాన్నిగురించి ఏమో యోచిస్తూవుంటాడు ఆనందరావు. ఈలోగా కమల శృంగారించుకుని రెండుపువ్వులతో తేనీరుపట్టుకొని అవతరిస్తుంది అక్కడకి. ఆమెనుచూడగానే ప్రభాకర్ మరల యీ ప్రపంచకము [illegible] ఆందోళనగా వుంటుంది. అప్పటికి ప్రభాకర్ [illegible] ఊహలోజుల చూస్తుంది. కమలతో [illegible]యమేర్పడుతుంది. ఇప్పుడు మొదటనున్న అందవికారపు శిరోజములుగాని, విస్తారముగా పెరిగిన గడ్డముగాని ప్రభాకరుకు లేవు. ఆనందరావింటికి వచ్చిన కొలదిరోజులకే వాని జీవితంలో నూతనత్వమేర్పడినది. క్రమంగా మనసులోని బెంగ మరచిపోవడానికి యత్నించుతున్నాడు. ఆనందరావుకూడా తనకు చేతనయినన్ని విధముల స్నేహితుని మనస్సు సంతోషంగానుంచుటకే యత్నించినాడు. ప్రభాకరు హృదయమును బాగుగా గుర్తించిన ఆనందరావు కమలా ప్రభాకరుల స్నేహమునకుగాని, వారిస్వేచ్ఛా సంభాషణలకుగాని ఎట్టి ఆటంకమును కలుగజేయలేదు సరికదా వారి ఆశయంబులకు దోహదమీయసాగినాడు. కమలకు మొదటి రోజున ప్రభాకర్‌పైగల్గిన దురభిప్రాయమిప్పుడు పూర్తిగామారినది ఆతడనిన ఒకవిధమగు భక్తి, గౌరవములు, అన్యులకందరాని అనురాగాంకురము ప్రబలినవి. కొలది దినములపాటు వ్యవహార పరిష్కా-

రమునకై వచ్చియున్న ఆతడింతకాలమొంటరిగ తమయింటివద్దను న్నాడాయన్న యోచనగాని, ఆసంగతి తనయన్ననడిగి తెలుసుకోవల యుననెడి కోరికగాని కమలకింతవరకు కలుగలేదు. దానిని మూఢ నిచే ఆమె యుండలేని స్థితిసమకూర్చినది. కానికె ప్రబలకారణ మిది యని నిర్ధారణచేయుటకేమియును లేదు. అతడా అందమయిన యువ కుడు, విద్యావంతుడు. ఆమె నవనాగరికతా ప్రపంచమున యువత రించిన ప్రబంధకన్య. విశాలాశయంబులుగల పదునెనిమిదేండ్ల ప్రాయపు సుందరాంగి. అట్టివారు ఒక్కచో నివసించుచు తమ స్వేచ్ఛా విహారంబున ఉటంకపరచువారు లేనిచో వారియందొక అపూర్వ భావముపుట్టి ప్రబలుటలో వింత యేమియుండును?

కమల తాను తెచ్చిన టీసెట్టినచ్చటి బల్లమీదపెట్టి వారివంక అర్థంకాని చూపులచూస్తూ చివరకు ప్రశ్నిస్తుంది కొంచెం స్థిమితపడి.

"ఏమిటల్లాగ నిశ్శబ్దంగా కూర్చున్నారు...ఇద్దరూను... మౌనవ్రతం పట్టారా యేమిటి?

దాంతో ప్రభాకరరావు కొంచెం తెప్పిరిల్లి చేతిలోని పేపరు ప్రక్కగా పెట్టి శాంతయుతమగుచూపుల జూచుచూ నెమ్మదిగా అంటాడు. ఆనందరావు గుడ్లప్పగించి చూస్తూ కూర్చుంటాడు.

"అబ్బే! ఏంలేదు కమలా! ... ఏమీతోచక ఏదో పేపరు చూస్తున్నాను..."

"నువ్వేం, అన్నయ్యా! అల్లాకూర్చున్నావు...? మాట్లాడ కుండాను..."

"ఏంచెయ్యమన్నావు ...అసలే వేసవి ఎండకు నోరెండి పోతోంది...పైగా ఇంతసేపూ మాటలాడి మాటలాడి గొంతుక యెండిపోతే...ఇంక మాటరాక ఊరుకున్నాను...టీ కోసం ఎదురు చూస్తూ...కమల అన్నగారి హేళనకు చిరునవ్వునవ్వుతూ

"ఇదిగో త్రాగండి...అయితే గొంతుక తడిపేదాక ఏమి మాట్లాడేరూ......?"

"ఆ! ఏమున్నాయి...మామూలు సంగతులే..."

"సరేగాని ఇవాళ డ్యాన్సుకు వెడదామా......?"

"డ్యాన్సా...!...ఎక్కడ...?" అన్నాడు ప్రభాకర్ కమల కేసి తదేకదృష్టితో చూస్తూ.

"ఇవాళే... కృష్ణామహలులో ... ఎవరో బొంబాయినుండి వచ్చారట. చాలా బాగా ఉంటుందిట..."

"రేట్లు ఎల్లాగో..." అన్నాడు ఆనందరావు.

"రిజర్వుడు అయిదురూపాయిలట, తర్వాత మూడున్నర... రెండు...అల్లాగే ఉన్నాయిట..."

"నాన్నగా రేమన్నారు,...కనుక్కున్నావా...?"

"ఆయన కేదో పనివుందిట...మనల్ని వెళ్ళమన్నారు..."

"అయితే ఇంకేం...ఆజ్ఞకూడా పొందేవచ్చావు..."

"ఎన్నిగంటలకు వెళ్ళాలి..."

"రాత్రి తొమ్మిది గంటలకు మొదలు పెడతారుట... ముందుగానే వెళ్ళి సీట్లురిజర్వుచేయించు కోవాలిట ... లేకపోతే దొరకవు..."

"మరేమీ బాధలేదులే...ఆనక అల్లా పార్కుకు వెళ్ళినప్పుడు కొనవచ్చును..."

"అయితే తప్పకుండా వెడతామన్నమాటే...!

చూడూ అయితే కమలా !...సీతమ్మగారితో చెప్పి వంట త్వరగాచేయించు వెడదాం...మేమల్లా వీధిలోకి వెళ్ళివస్తాం..."

"తొందరగా రండి..." అంతటితో ఆనంద్, ప్రభాకరరావు టీ త్రాగడం పూర్తిచేస్తారు. నెమ్మదిగాబయల్దేరి వీధిలోకి పోతారు. కమల క్రిందకు సీతమ్మకు వంట సంగతిచెప్పటకు వెడుతుంది.

చవచ్చు...ఏమంటావు...?...అందుచే నువ్వు కొంచం జాగ్రత్తలో వుండడం మంచిదని నాఅభిప్రాయము...

అంతసేపు మంత్రబద్ధుడైనట్లు నిలచియున్న ప్రభాకరరావు ఆనందరావుయొక్క ఆజామృతవాక్కులు చెవినిపడగానే ఒకింత తెప్పిరిలి,

"అన్నను...నీవన్నది ముమ్మాటికీసత్యము...నాకాపాటి యోచనాశక్తి లేకపోయినప్పటికి హితుడవయినందుకు నీవిచ్చిన యీఅమూల్యసలహాకు చాలాకృతజ్ఞుడను...తప్పక అట్లేచేస్తాను. ఇవేళ నుండే నావేషము పూర్తిగా మార్చివేస్తాను..."

"ఏమయినా మనజాగ్రత్తలో మనమున్నామా మనకెట్టిభయ ముండదను...ఇంతవరకు అదియే నాబుర్రలో కలతపెట్టుచున్న విష యము...ఇంతే...నడుపోదాం..."

ఆవిధముగా వారిద్దరూ క్షణకాలం పైవిధముగా సంభాషించు ...తిన్నగా యింటికిబోయిరి. ఇంటివద్ద వీరికొరకై వేచి ...కమల. అప్పటికే ఎనిమిదిన్నరగంటలు అగుటచే ముగ్గురూ ...రు వడ్డించిన భోజనము త్వరితముగాభుజించి తొందరగా ...బండిమీద బయలుదేరి సినిమాహాలుకు వెడతారు. లోనికి ముందు ముందువరుసకుర్చీలలోనే తమకై రిజర్వుచేయబడియున్న వాని ...దురుగా ఆనందరావు కమలప్రభాకరరావులు కూర్చుండిరి. అప్పటికి తొమ్మిదిగంటలైనయింది. హాలుకిక్కిరిసిపోయివున్నారు జనులు. అప్పుడే సెకెండ్ బెల్ కూడ కొట్టారు. నటకులు ఏవో దైవ ప్రార్థనగీతాలు పాడినపిదప నాట్యప్రదర్శన ప్రారంభించారు. రక రకాల నాట్యంచేస్తున్నారు. కన్నులుమిరుమిట్లుగొలిపే ఆవిద్యుద్దీప కాంతులలో మెరుపుతీగలవలె నృత్యంచేస్తున్నారు. మిక్కిలి చురుకు తనంతో వారివారిప్రావీణ్యత తెలుపుతూ, కొంతసేపటికి సర్వనాట్య ప్రదర్శనము. నాట్యకత్తెపదునారేండ్లకన్య. నిజముగా ఆనృత్యభంగి

మలో ఆమెకళ్లు నిజంగా కోడెత్రాచువాడిచూపుల ధిక్కరించుచున్నవో యన్నట్లున్నాయి. ఆమె తనరెండు మోకాళ్ళమీదను మోకరించి సర్పమువలె తనచేతులబట్టి బొంగరమువలె నలువైపుల తన నడుమును త్రిప్పుచు తననాట్యకళానైపుణ్యాన్ని ప్రేక్షకులు మెచ్చుకోనేటట్లు ప్రదర్శిస్తూవుంటే ఆహాలులోనివారల కెవ్వరికూ క్షణకాలము చైతన్యమే లేదంటే అతిశయోక్తి కాదు. ఈ విధంగా పలురకముల ప్రదర్శనములు జరుగుతున్నాయి. ఇదిట్లుండగా పాపం మన ఆనందరావు విపరీతమగు తలబాధతో బాధపడుతున్నాడు. తనసోదరికి, స్నేహితునకు నిరుత్సాహముకల్గునేమోయని పాపమెట్లో అంతవరకు ఓపికబట్టి లోలోన నే బాధపడుతున్నాడు. ఆ ప్రదర్శనమును చూచి యానందించుటకు ఆదైవమునకుగూడ యిష్టములేదేమో యన్నట్లుగా యింక సహించ లేకపోయినాడు. పాపము నెమ్మదిగా కమలాప్రభాకర్ లతో అంటాడు శిరస్సు చేతితో అదిమిపట్టుకొని.

“కమలా!...మీరిద్దరూ చూసి నెమ్మదిగా యింటికి రండి... నాకు తలబాధ ఎక్కువగా వుంది... భరించ లేకుండా వున్నాను...ఇంక ఇక్కడుండ లేను...జాగ్రత్తగా చూసిరండి...”

ప్రభాకరరావు తటాలున ఆనంద్ నుదుటిమీద చేయిపెట్టి విచారంగా అంటాడు.

“అయ్యో! పాపం ఒంటరిగా యెట్లా వెడతావ్!...మేము కూడా వచ్చేస్తాము నడు...”

“అబ్బే! అక్కర్లేదోయ్, నేను బండిమీదపోతాను...మరేమీ విశేషం లేదులెండి...అనవసరంగా డబ్బు వ్యయం...పైగా ప్రదర్శన చాలా బాగుందికూడాను...నేను వెళ్ళిపోగలనులే...ఈ ప్రదర్శన పూర్తిఅయ్యాక జాగ్రత్తగా రండి...నేను వెడతానుమరి...”

అంటూ ఆనందరావు లేస్తాడు. నెమ్మదిగా ఆవలకు బోయి బండి చేసుకొని యింటికి జేరుతారు. అప్పటికి సుమారు పదిన్నర అవుతుంది. ప్రభాకర్‌కు ఆనందరావు ప్రసక్తికి చాలా విచారం కలుగుతుంది. కాని తనకేమి తీవ్రమైన బాధ లేదని చెప్పి ధైర్యం చెప్పడంచేత ఎట్లో మనస్సును సమాధాన పరచుకుంటాడు. కమల కూడ బాధ పడుతోంది కాని వంటరిగా ప్రభాకరరావుతో కలుసుకొన్నప్పుడు మాటలాడుటకు తగిన సమయమేర్పడుటచే ఆమె అంతగా చింతించలేదు.

ఇంతలోకి త్రిదృశ్యం వచ్చినది. చాలా బాగా అలంకరించారు. ఘోరమయిన తపోదీక్షలో హిమవత్పర్వత ప్రాంతాన ఒక ప్రదేశమున కూర్చుని వుంటాడు శంకరుడు. వాని సన్నిధానమున వాని మెప్పుబొంది వాని పాణి గ్రహింపవలయునని అనెడి మహదాశయముతో భక్తిరస ప్రధానంబును, శృంగారరస ప్రధానంబునువగు నృత్య విశేషములజూపు పర్వత రాజపుత్రిక పార్వతి. చాల రక్తిగా వుంటుంది ప్రదర్శనము. ఆమె ఎన్ని విధముల ప్రయత్నించిన ఆ దేవ దేవుడు కనులు తెరువడు. పూర్ణ సమాధియందున్న వాని యింద్రియము లేవియు ఈమె మొగ నాలకించుటయే లేదు. ఆమెయు నిక్కిలి పట్టుదలవహించి స్థాణుస్వరూపుడయిన వానికెట్టయిన చలనము కలుగ జేయవలెనని యత్నించి చివరకు సొమ్మసిల్లి అచ్చటనే మూర్ఛిల్లును. ఆదృశ్యం చూడగానే అప్రయత్నంగా కమల కంటివెంబడిని రెండు కన్నీటిబొట్లు క్రిందకుజారినాయి. ఆమె వెంటనే తెలివితెచ్చుకుని... కన్నీరు తుడుచుకుని యిటునటుజూచి విచారంగా ప్రక్కనున్న ప్రభాకరరావుతో.

"చూశారా, ఎంత మొద్దులాకూర్చున్నాడో కళ్లుమూసుకుని పాపం చివరకు స్పృహతప్పిపడిపోయింది..." దానికి ప్రభాకరరావు చిరునవ్వునవ్వి విజయసూచకంగా...

"మహానుభావుడు.... వానితపోదీక్షను ఎంతయత్నించినా భంగపరచగలడా...?"

"అంటే... స్త్రీఅన్న అంతలోకువా— ఉన్నదన్నమాట మీదృష్టిలో... అంతేనా...!"

"అబ్బే!... నేనాయుమాటఅన్నా... ఒకవంక స్త్రీ శక్తిస్వరూపిణిఅని ఘోషిస్తూంటే... చులకనచేయడం నాతరమా... చెప్పు..."

"మరిమీపుద్దేశం...?"

"ఏముంది... ఎంతశక్తిగలదయినా... ఘోరమగు దీక్షలో వున్న పురుషునకు వ్రతభంగంచేయుట దుర్లభమని తెలిందిగా..."

అంటూడు విజయసూచకంగా ప్రభాకరరావు. ఇంతలోకి మరియొక రసన స్తరఘట్టమువస్తుంది. మహేంద్రప్రేరణచే మన్మధుడు ప్రవేశిస్తాడు. వెంటనే కమలనుకూడ అవ్యక్తవికారము మనమున బయల్దేరుతుంది. దృష్టిచలిస్తుంది. వడలు పరవశత్వమును పొందిది మనస్సులో ఏవేవో తీయనితలంపులు బయల్దేరుతాయి. ఏమో కొంచము పరధ్యానంగావుంటుంది. పరిదర్శనములో మన్మధుడు ధైర్యముగా మహేశ్వరునకు ముందుగానిలచి తనకుసుమ బాణము నెక్కుపెట్టి శంకరునిమీదకువిడుస్తాడు. ప్రభాకరరావు కమలవంకతిరిగి.

"చూశావా సీను ఎంతబాగుందో... ఆవనశృంగారం... చూడు మన్మధుడు ప్రవేశించి పూలబాణాలతో కొడుతున్నాడు..."

అప్రయత్నంగా కమలకూడ ప్రభాకర్ ముఖంవంక చూస్తుంది. సిగ్గుతో తలకొంచెంక్రిందకువంచుకుంటుంది. క్షణకాలం నిశ్శబ్దం. ఇంతలోకి ఒకపెద్దశబ్దంవినవస్తుంది. దాంతో ఇద్దరూమరల మామూలుప్రకృతిలోకివస్తారు. ఆశబ్దంమరేంకాదు. మన్మధబాణం

తగులగానే రుద్రుడు రౌద్రంతో కనులువిచ్చి ప్రళయాగ్ని వెదజల్లు మూడవనేత్రం తెరుస్తాడు. వెంటనే మన్మథుడు భస్మమయిపోతాడు. ఆకలకలమునకు పార్వతికూడ తెప్పిరిల్లి లేస్తుందికమలకొంచం క్రోధంగా.

"హాం!...ఎంత దారుణమోచూడండి...తపోభంగమయినదని ముందువెనకలుచూడక మన్మథుణ్ణి ఎట్లాభస్మంచేశాడో...ఇదే కాబోలును తపశ్శాలులధర్మం...

"మరేమనుకున్నావ్......మన్మథావేశంతో మానసికపరివర్తనం ఎట్లాటివారికయినా తప్పదని తేలింపగా..." అంటూ కమలముఖంలోకిచూస్తాడు. ఆమెకూడ వానిముఖంలోకి అప్రయత్నంగాచూసి ముఖంక్రిందకుదించుకుంటుంది. మొత్తంమీదప్రదర్శన అయింది. రాత్రి ఒంటిగంటవాటింది. నెమ్మదిగా అందరితోపాటు కమల, ప్రభాకరులీవలకువస్తారు.

"పదు...కమలా! త్వరగాపోదాం...పాపం ఆనంద్కు ఎట్లావుందో...

ఐదవప్రకరణము సమాప్తము.

---

# ఆరవ ప్రకరణము

ప్రదర్శన అయ్యాక—ఇద్దరూ యీవలకువచ్చి అవి వెన్నెల రాత్రులవడంచేతను, చల్లనిగాలి వీస్తూ కులాసాగా వుండడంచేతను, ఈవలకురాగానే త్వరగా యింటికి చేరవలయుననే సంగతి మరచి కాలినడకనే బయలుదేరారు నెమ్మదిగా యింటికి. త్రోవల్లో నాటి ప్రదర్శన విశేషాలు ముచ్చటిస్తూ నడుస్తూవుంటారు. అల్లాకొంత

దూరంపోయి ఒక సందుమళుపు తిరుగబోతూంటే కమల నెవరో పిలుస్తారు. ఆమె అరుణ. వెనుక వాల్తేరురైల్వేస్టేషన్‌లో ఆనంద్, ప్రభాకరరావులకు కనపడిన పోలీసు సబిన్‌స్పెక్టరు రామంపోదరి. కమలకు ప్రాణహితురాలు. ఆనందరావును మనసారాప్రేమించినది. కమలకన్న రెండేళ్లు పెద్దది. అందమయిన యువతి. కమలతోపాటు ఆయేడు స్కూల్ ఫైనల్ పరీక్షకు వెళ్ళింది. తండ్రిలేదు. తల్లి మెచ్చ టనో పల్లెటూరిలో సోదరునింటివద్ద నున్నది. తండ్రిలేనిపిల్లయగు టచే ఆమె బాధ్యతఅంతా సోదరుని తలపైననే పడినది. సబిన్‌స్పెక్టరు రామంకూడ ఆమెకు సాధ్యమయినంతవరకు ఏవిధమయిన లోటులేకుండానే చూస్తూ తనతోపాటుగా తీసుకువచ్చి స్కూల్ ఫైనల్‌వరకు చదువుచెప్పించాడు. ఆమెయొక్కజీవితాభివృద్ధికై ఎన్ని సౌకర్యాలయిన కలుగచేయుటకు ఆతడునిశ్చయించుకున్నాడు. సబిన్‌స్పెక్టరు రామానికి ఇంకా వివాహంకాలేదు...ఆవీధిలోనే వున్నదిరామంయిల్లు. కమల, తన్ను అట్టిఅర్ధరాత్రివేళ పిలచినది ఎవరా, అని యోచిస్తూ పరాకుగా నడుస్తూవుండడంచేత ఆగొంతు కను ఆనవాలు పట్టలేకపోతుంది. ఇంతలోకే మళ్ళా పిలుపువిన వస్తుంది. అక్కడకు రెండిళ్లు అవతలగానేవుంది రామంఉన్న మేడ.

"కమలా!...కమలా...!" కమల ఈమారు తనను పిలచి నది అరుణఅని గుర్తిస్తుంది.

"నువ్వా! అరుణా!...వస్తున్నా..." అంటూ బయల్దేర బోతూంటే ప్రభాకరరావు.

"ఎక్కడకు...కమలా!..."

"అదుగో ఆయింటికే ... మాస్నేహితురాలు అరుణ పిలు స్తోంది...రెండు నిమిషాలు ఇక్కడే ఉండండి...ఒక్కమాట చెప్పేసి వస్తాను..." దాంతో కొంచం సందేహిస్తూ మరల సమర్థించుకుని అక్కడే నిలబడి ప్రభాకర్ ఆమెరాకకై వేచివుంటాడు.

"సరే...త్వరగా రా...చాలారాత్రి అయిపోయింది..."

కమల చకచకా అరుణాయింటికి వెడుతుంది. అరుణ వీధి తలుపు తెరచి లోపలకు రమ్మంటుంది. 'చాలా ప్రొద్దుపోయినది' అని అంటూ రెండడుగులు లోపలకు వేస్తుంది.

"ఏం...అరుణా.. ఏమిటిసంగతి...?"

"ఎక్కడనుండి వస్తున్నావ్...డ్యాన్సుకు వెళ్లావా...?"

"అవును...ఎందుకు పిలిచావు..."

"అబ్బే ... మరేం లేదు కానీ..." ఇంతలోకి లోపలనుండి మూలుగు వినిపిస్తుంది. అరుణ కంగారుపడుతూ మేడమీదకు వెడుతుంది. కమల ఆమె ననుసరిస్తుంది. ఇద్దరూ మేడమీంది గదిలోకి వెడతారు. అక్కడ పాపం సబినస్పెక్టరురాముం అపరిమితమయిన కడుపునొప్పితో బాధపడుతున్నాడు. వాని బాధ చూచేసరికి అరుణకు, కమలకుకూడ దుఃఖంవచ్చింది.

"ఏం! అన్నయ్యా. ఏంజరిగింది...?" రాముం కడుపునొక్కుకుంటూ ఏడ్పుముఖంతో, మాటఅయినా సరిగా చెప్పలేక మంద స్వరంతో చెపుతాడు పరుపుమీద ఇటూఅటూ దొర్లుతూ.

"అబ్బా!...అరుణా...నొప్పి...కడుపులో నొప్పి ... అబ్బా నులిమేస్తోంది...అయ్యో..."

"అయ్యో! కొంచం నీలగిరితైలం నీళ్ళలో వేసిస్తానుండు..."

"అబ్బబ్బా!... అదిప్పుడే త్రాగేను... ఏంలాభంలేదు... అయ్యో!..."

కమలది అసలే జాలిగుండె. ఇతరులకు ఆపదవచ్చిందీఅంటే తనస్వంతపనులుకూడా మరచిపోతుంది. జాలిగా అరుణతో,

"అయ్యో! పాపం అరుణా...ఎంతబాధ పడుతున్నాడో... ఈచుట్టుప్రక్కల ఎవ్వరూ డాక్టరయినాలేరూ..."

"ఉన్నాడు నాలుగిళ్ల అవతల ... కొంచెం చూస్తావుండు... ఇప్పుడే పిల్చుకొవస్తాను..."

"అల్లాగేలే త్వరగా రా..." అందిపాపం ఆకష్టదశలోవున్న వారిని విడచిపోలేక. అరుణ గబగబ వీధిలోకివచ్చి నాలుగిళ్ళఅవతల క్రొత్తగా ప్రాక్టీసుపెట్టిన డాక్టరుగారింటికి వెడుతుంది. పిలవగా పిలవగా యింట్లోవారు లేచివచ్చి డాక్టరుగారు వూళ్లోలేరని చెప్పేస్తారు. దాంతో అరుణ కంగారుగా అన్న ఎంతటిబాధతోవున్నాడో అని ఆచీకటి నయినా లక్ష్యం చెయ్యకుండగా అవతలివీధిలోవున్న డాక్టరు రామారావుగారు మ్యునిసిపల్ డాక్టరును పిలవడానికి వెడుతుంది. ఇంక యింటిదగ్గర రామం పాపం భరించరాని అవస్థపడుతున్నాడు.

"అబ్బా!...కమలా!...నొప్పి...అబ్బా...బాధ..."

"అరుణడాక్టర్ని పిలవడానికెళ్ళింది...కంగారుపడకండి..."

అంతవరకు బాధపడుతూన్న రామానికి ఆ కడుపునొప్పి ఏమయిందో తెలియదు. రెప్పపాటుకాలంలో చటాలున లేచి కమలను సమీపిస్తూ చిరునవ్వుతో.

"కంగారు దేనికి కమలా!...కావలసినది దొరకినప్పుడు..."

కమల నివ్వెరబోతుంది. నెత్తిపై పిడుగుపడినట్లయింది. క్షణకాలం స్థంభించిపోయింది. నోటమాటరాలేదు. భయంతోవణకిపోసాగింది. కానిఒక్కసారిగా ధైర్యంతెచ్చుకుంది. అదిమొండిధైర్యం. ఆమె ఇప్పుడు పూర్వపు అమాయికపు కమలకాదు. భద్రకాళి రూపం దాల్చింది. రామం పన్నిన పన్నుగడఅంతా తెలుసుకుంది. కన్నులవెంట నిప్పులు గ్రక్కుతోంది. రెప్పపాటుకాలంలో అచ్చటినుండి పారిపోదామని చూసింది, కాని కార్యం మించిపోయింది.

రామంవెళ్ళి అడ్డుగా నిలబడ్డాడు. ఆమెకు సమయస్ఫూర్తి ధైర్యమే ఇప్పుడు శరణ్యం.

"ఆ!...ఇంకా నీవుంత్తు...మంచ్నర్గుడా...జాగ్రత్త నీమర్యాద దక్కదు..."

"మర్యాద... ఏమిటామర్యాద... నేనెఱుంగని మర్యాదలు కూడా ఉన్నాయా...చూడు...నామాటవిను...ఎంతో కాలంనుంచి ఆశించాను...నీతండ్రి వద్దకువచ్చి పెండ్లివిషయమెత్తితే ... వీల్లే దన్నాడు...అప్పటినుంచీ...నీకై...ఎంతో..."

"ఛీ!...దౌర్భాగ్యుడా...అడ్డులే ... ఇంతతుంటరి వనుకో లేను...జాగ్రత్త!...నాజోలికి రాకు...నన్నుపోనీ..."

"ఏమన్నావ్ ... పోనియ్యనా ... రామంచేతిలోపడ్డవాళ్ళు తప్పించుకోవడంకూడానా...నామాటవిను..."

"ఛీ! తుచ్ఛుడా...నీమాట వినడంకూడానా...ఇంతదుర్మార్గుడ వనుకోలేదు ... మాఅన్నతో స్నేహంచేసింది ఇందుకా ... చేసేది పోలీసు ఇన్‌స్పెక్టరుపని...చేసేవి ఇట్టిదౌర్భాగ్యపుపనులు... అందుకే యీపోలీసువాళ్ళను నమ్మకూడదు. మీరురక్షకభటులా! యమభటులుకానీ...చెప్పేవి శ్రీరంగనీతులు ... దూరేవి దొమ్మరి గుడిసెలు...చూడు...ఈవిషయం మాఅన్నకు తెలిస్తే నిన్నుబ్రతుక నివ్వడు. నన్నుపోనీ..."

కమల వెళ్ళి అప్పుడే పావుగంట దాటింది. ఇంతవరకు ఏ జాడా లేదు. ఆయింటిద్వారంకూడా తెరిచేవుంది. ఇప్పుడేవస్తానని ఇంతసేపు ఏమిచేస్తోందాఅని అనుమానపడ్డాడుప్రభాకరరావు. అర్ధరాత్రివేళ తననక్కడ నిలబెట్టి ఎంతకూరాదేమాఅని యోచించి తిన్నగా రామంయింటికి వచ్చాడు. లోపల ఏమీ అలుకుడు లేదు. ప్రభాకరరావుకు ఆశ్చర్యం, అనుమానంకూడా ఒక్కసారిగా పుట్టుకు

వచ్చాయి. యింటితలుపు తగ్గరగా వేసివుంది. తానట్టి అర్థరాత్రి వేళ పరాయియింట్లోకి ఎల్లా వెళ్ళగలడు? అయినా సాహసించి లోప లకు రెండడుగులు వేసేసరికి మేడమీాదనుండి ఏదో అవ్యక్తమయిన తీవ్రసంభాషణ వినవస్తోంది. ఆవి ఇద్దరు స్త్రీపురుషులమధ్య జరుగు తూన్న వాగ్వాదమని గ్రహించాడు. అందులోను ఆ స్త్రీకంఠం కమల గొంతుకధ్వనిని పోలివుంది. ఇంకేమీా ఆలోచించకుండా గబగబా మేడయెక్కాడు. ఎదురుగాగదిలోని దృశ్యం కిటికీగుండాచూశాడు. తనకళ్ళను తాను నమ్మలేకపోయాడు. ఆవ్యక్తిసబినస్పెక్టరురామం. అక్కడ అరుణఅనే వ్యక్తి లేదు. క్షణకాలం ఆమాటలువిన్నాడు. దుర్మార్గుడయిన రామంఉద్దేశం తెలుసుకున్నాడు. ఈలోగా లోపల రామం.

"ఏమన్నావ్...కమలా! మీాఅన్న...నన్నేమోచేస్తాడా... తర్వాతచూద్దాం...ఇప్పుడునిన్ను కాపాడేవాళ్ళెవ్వరో చూచుకో..."

కోపంతో ఒక్కసారి రాక్షసుడులావచ్చి ఆమెతో కలియ బడి పట్టుకుంటాడు. ఆమెఅబల ఎంతధైర్యముగా ఉన్నా అతడట్టి సాహసం చెయ్యబోయేసరికి ఎక్కడలేని పిరికితనం ఆవహించింది. పైగావాని పశుబలంముందు ఆమెఏపాటి. అయినా పెనగులాట లోనే ఖాళీచేసుకుని ఒక్కలెంపకాయ తగిలిస్తుంది. కాని పశు ప్రాయుడయిన వానికదొకలెక్కా. ఆమెకొట్టినదెబ్బను కొంచ మయినా లక్ష్యపెట్టక ఆమెను బలాత్కరించబోతూంటే చూస్తూన్న ప్రభాకరరావు సహించలేక పోతాడు. ఒక్కసారిగాకోపంతో వడలు రగుల్కొంటుంది. ఒక్కగెంతుతో లోపలప్రవేశిస్తాడు. దిక్కులేని వారికి దేముడేదిక్కు. వెడుతూనే రామాన్ని బలంగా ఒక్కటి కొడతాడు.

"దుర్మార్గుడా! ... యిదా నువ్వుచేసేపని ... నువ్వురక్షకో ద్రోహివా...చేసేపనులివా..."

ప్రభాకరరావు కొట్టినదెబ్బకు నిల్చోలేక ఆప్రక్క టేబిల్ మీదపడిపోతాడు కామయ్య. ఆ టేబిల్ కొసగిలి బలమయిన గాయం తగులుతుంది. ఏకధారగా రక్తం కారుతూవుంటుంది. స్పృహతప్పుతుంది. దాంతో ఆప్రక్క నేయున్న కూజాలోనీళ్ళు వాని ముఖంమీద కొన్నిపోసి కమలదగ్గరకు వస్తాడు. కమల పాపం నిలువునసిరయి తల వంచుకుని కంటనీరు పెట్టుకొంటుంది. అదిచూచి ప్రభాకరరావు ఓదారుస్తూ.

"ఎంతపని జరిగింది కమలా!...ఎంతకూ రాకపోతే ఏమయ్యావోఅని నేను వచ్చాను...దుర్మార్గు డెంతపనిచేయతలపెట్టేడూ..."

కమల దీనమయిన ముఖంతో వెక్కి వెక్కి యేడుస్తూ,

"నిజంగా మీరిప్పుడు రాకపోతే నాపనిఏమయ్యేదో..."

"ఊరుకో...కమలా!... న్యాయాన్యాయాలు విచారించడానికి పైన భగవంతుడు లేడూ...పదు ఇంకపోదాం... నీస్నేహితురాలుఏది...?"

"అదే ఈదుర్మార్గుడు పన్నినపన్నగడ ... కడుపులోనొప్పి వచ్చినట్లు నటించాడు ... పాపం ఆ అమాయకురాలు ... ఈఅర్ధ రాత్రి సమయంలో డాక్టర్ను పిలవడానికి వెళ్ళింది...సమయంచూసి ఈదుష్టుడిల్లాగ నన్ను అల్లరిపెట్టేడు..."

"ఔరా! ఎంతసాహసం!...ఏమయినా ఎంతటిఘోరకృత్యమయినా చెయ్యడానికి ఈపోలీసులకే చెందిందిలే ... గుండెలుతీసిన బంట్లు...రా, ఇంక ఇంటికి పోదాం ... అమ్మగోవానికి ఇంక తెలివి వస్తోంది...అక్కడపాపం మీ అన్నయ్య ఏమిబాధ పడుతున్నాడో"

అంటూ అక్కడ పడివున్న బల్ల మరల సరిగా పెట్టి ఇద్దరూ బయల్దేరి వెళ్ళిపోతూంటే పాపం వగర్చుకుంటూ ఎదురయింది అరుణ. ప్రభాకరరావును చూసి ఆశ్చర్యపడింది. విషణ్ణత చెందిన ముఖాలతో వెళ్ళిపోతున్నారు ఏమో అని అనుమానించింది. కంగారుగా,

“ఏం...? కమలా! ... వెళ్ళిపోతున్నావు...? ఎల్లాగుంది అన్నయ్యకి... ఈయన నెవరు?”

కమల కొంచం సర్దుకుని ధైర్యంగా జరిగిన సంగతి ఆమెకు చెప్పి ఆ అర్ధరాత్రి బాధపెట్టడం ఇష్టంలేక మరుగుపరచి,

“మీ అన్నయ్యకు తగ్గిందిలే...కొంచం తెలివితప్పితే...ఏవో నీళ్ళు జల్లాం...స్పృహ వచ్చింది...ఈయన మా అన్నయ్య స్నేహితుడు త్రోవంట పోతూంటే నాకు భయమేసి సాయానికి పిలిచాను... అయితే డాక్టరేడీ...?”

“ఏం చెప్పను కమలా! అవతలి వీధికొసనున్నారు కదూ డాక్టరు రామారావుగారు...ఆయన దగ్గరకు వెళ్ళాను. పిలవగా పిలవగా తలుపు తెరచారు...సంగతంతా చెపితే ఆ చాదస్తపు బ్రాహ్మడు నా కేకడుపు నొప్పి వచ్చినట్లు ఏవో డొంక తిరుగుడు ప్రశ్నలు వేశాడు...అవేవీ నాకు తెలియవు...ఒక్కసారి రండి అన్నాను...వస్తున్నాను నడవమన్నాడు...ఇక్కడ పరిస్థితి ఎల్లావుందో అని వాళ్ళ బంట్రోతును వెంటపెట్టుకుని వచ్చాను...”

కూడా వచ్చిన డాక్టరుగారి బంట్రోతు ఆపరిక్కగా నిలచి వుంటాడు. అరుణ ఇచ్చిన సమాధానానికి కమల కొంచం సంతృప్తిపడి తాను వెళ్ళిపోవచ్చును కదా అనుకుని,

“సరే ఇంక మేము పోతాం....ప్రొద్దున వస్తానులే.....వీలు చూచుకుని నువ్వు కూడా ఓ మారు రా... శెలవులేగా...”

"అల్లాగే...వెళ్ళిరండి..." అంటూ అరుణ లోనికి వెడుతుంది. అప్పటికి రామంకు పూర్తిగా తెలివివస్తుంది. తెప్పరిల్లి లేచి నుదుటికి తగిలిన గాయంనుండి కారే రక్తం తుడుచుకుంటూ సోఫాలో కూర్చుని అరుణనుచూడగానే కొంచంసిగ్గుచేత ముఖమావలదిక్కుగా త్రిప్పుకుని మరలవెంటనే అరుణకేసి తేరిపారిచూస్తాడు. అరుణ కంగారుగా వానిగాయంకేసిచూస్తూ ప్రశ్నిస్తుంది.

"ఎల్లావుంది అన్నయ్యా! కడుపులోనొప్పి...అదేమిటా దెబ్బ రక్తకూడా కారుతోందే..."

అంటూపాపం ఆఅమాయకురాలు అన్నగారిదెబ్బనుచూచి జాలిపడుతూ ఆగాయము బట్టతోతుడుస్తూవుంటుంది. నెమ్మదిగా సమాధానమిస్తాడురామం, "ఆ! తగ్గింది...కొంచంకళ్ళుతిరిగి పడిపోయాను...అప్పుడు తగిలివుంటుంది... (సత్యం మరుగుపరచడం ఉగ్గుపాలతో నేర్చినట్లున్నా) అయితే డాక్టరుగారేరీ...?"

"అదుగో [illegible] వారిబంట్రోతునుపంపేను... వెంటనేవస్తున్నానని చెప్పమన్నారు... [illegible]గారే..."

ఇంతలోకి డాక్టరు రామారావుగారు మందులసంచీతో ప్రవేశిస్తారు. డాక్టరుగారికి సుమారు నలభైఅయిదు సంవత్సరాల వయస్సుంటుంది. తెలివయినవాడు. ఛాందసుడు. ఆయన లోపలికిరాగానే రామం నమస్కారంచేస్తాడు. అరుణ ఆహ్వానించి అక్కడఒకకుర్చీ వేస్తుంది. ఆకుర్చీలో డాక్టరుగారుకూర్చుని.

"ఏమండీ...ఏమిటి...ఎక్కడనొప్పి...ఎల్లావుంది...?"

"ఇదుగో...ఇక్కడ కడుపులో ఎడమప్రక్కవచ్చిందండీ... విపరీతమయినబాధపెట్టింది. ఆబాధతోనేపోయి పడుందామని లేచి నడుస్తూంటే వళ్ళుతిరిగి పడిపోయాను. ఆబల్లమీదపడింది తలకీ దెబ్బ తగిలింది...ఒక్కసారిగా తలదిమ్ముపట్టి తెలివితప్పిపోయింది..."

ఇప్పుడు కాస్తసులువుగానేవుంది. ఇదిగో గాయంమాత్రం గట్టిగా తగిలింది..."

"బాగుంది...మంచిఅవస్థే పడ్డారన్నమాట..."

అంటూ నుదుటిగాయానికి కట్టుకడుతూ, కుడిచేతివంకచూసి "ఇదేమిటండీ...ఈచేతిమీద ఈరక్కులు......గోరుతోగీకినట్లుగా వున్నాయి..."

"ఆ!...అవునండీ....మీరనేదాకా నేనూచూడలేదు.... నాకూ ఆశ్చర్యంగానేవుంది...ఇంకాకటికి లేవుసుమండీ..."

"బహుశా మీకువంటిపై స్పృహలేనిసమయంలో ఏదో జరిగివుండాలి...సరే...ఏదీచెయ్యి..."

రామంచేతినందుకుని డాక్టరుకట్టుకట్టి శలవుతీసుకు వెళ్ళిపోతాడు. అన్నగారి చేతిమీది గోరుతోరక్కినగాయము చూసేసరికి అరుణకుమాత్రం ఏదోఅనుమానంకలిగింది. వెళ్ళిపోయినకమల మొదటవున్నంత ఉత్సాహంగా వెళ్ళబోయేముందు లేదు. ఏదో పెడముఖంతో ముభావంగానే మాట్లాడి వెళ్ళిపోయింది. పైగా ఆమెజుట్టు, కట్టువగయిరాలు రేగిపోయివున్నాయి. ఆమెముఖముకొంత అలసటనూచిస్తూ జేవురించివుంది. కూడావున్న ఆపెద్దమనిషి ముఖలక్షణాలుకూడా విపరీతంగానేవున్నవి. ఈవిపరీతలక్షణాలనుగురించి యోచిస్తూంటే తానులేనిసమయంలో ఏదయిన విపరీతకార్యం జరిగిందేమోనని బాగుగా ఆమెకు అనుమానంకల్గినది. అన్నగారి ముఖలక్షణాలను జాగ్రత్తగాపరిశీలిస్తూ...తనమనోవేదన కప్పిపుచ్చి మామూలుధోరణిలో,

"కమల.....వెళ్ళిపోయిందన్నయ్యా!....పాపం నీకుచాలా సేవచేసింది...ఏమనుకుందో ఏమిటో..."

"ఏమనుకుంటుంది....ఏదో చేసిందనేవ....పోనిద్దూ...ఇప్పు డెందుకాగొడవ..."

"ఏం...? అట్లా అంటున్నావు ..?"

"అబ్బే ఏంలేదు...చాలా రాత్రి అయింది పోయి పడుకో.... ఉదయాన్నే లేచాక సావకాశంగా మాటలాడుకోవచ్చును..."

అన్నగారి పసుగదల మాటలను గమనిస్తే ఏదో గ్రంథం జరిగిందనుకుంది. కాని తన అన్న అంతటి నీచ కార్యం చేస్తాడా...ఏమో... ఈవిధంగా అరుణ ఆనాటి రాత్రి ఆమిగిలియున్న కొలది కాలము ఏమేమో యోచిస్తూ పాన్పుమీద వ్రాలింది. రాము తన గదిలోనికి పోయి దీపం ఆర్పి పడుకున్నాడు.

*　　　*　　　*

మద్రాసులో కాలేజీ. మధ్యాహ్న ఒంటిగంట అవుతుంది సమయము. విద్యార్థులు, విద్యార్థినులు ఎవరిమట్టుకు వారు ఇండ్లకు మధ్యాహ్నభోజనానికై వెళ్ళిపోతున్నారు. దూరప్రదేశములనుండి వచ్చినవారు తమతో కూడా తెచ్చుకున్న భోజన ఫలహారములను ప్రత్యేకస్థలములకుగొనిపోయి అచ్చట భోజనప్రయత్నాలలో వున్నారు. కాలేజీ చాలామట్టుకు జనశూన్యముగా నిశ్శబ్దంగావున్నది. మేడమీది ఒకగదిలో ఒకవిద్యార్థిని నవయువ్వనకోమలాంగి, పదునెనిమిదేండ్లప్రాయపు యువ్వనవతి ఒంటరిగా కూర్చుని ఏదో పుస్తకమును తిరగవేస్తూవున్నది. కాని ఆమెమనస్సు ఆపుస్తకముమీద వున్నట్లులేదు. ఆమె దేనినిగురించో దీర్ఘంగా యోచిస్తూంది. ఆమె ముఖమించుక విచారమునుసూచిస్తూ దీనంగావుంటుంది. ఆమె అట్లచ్చట ఎంతసేపటినుండి కూర్చునివున్నదో తెలియదు. విరామం లేని ఆదీర్ఘయోచనంలోమునిగి ఆమె మధ్య మధ్య దీర్ఘముగు నిట్టూర్పులవిడచుచు ఇతరదృష్టి ఏమియులేక ఏమోయోచిస్తూంది.

ఇంతలోకి ఆపత్రిక్కగా ఏదిదో అలుకుడుఅవుతుంది. పరధ్యాన్నంగా యోచనాసముద్రంలో మునిగియున్న ఆమె ఒక్కసారిగా త్రుళ్ళిపడి నది. కొంచంస్థాయిపడినపిదప ఇటు నటు చూచేసరికి ఒకవ్యక్తి ప్రత్యక్షమయింది. చేతిలో టిఫెన్ కారియరు. రెండవచేత పుస్తకాలు పట్టుకొనివచ్చింది. ఆమెను చూడగానే మొదటనున్నవ్యక్తి కొంచంచిరునవ్వుతో ఆహ్వానిస్తుంది. ఆవచ్చినయామెగూడ నొక విద్యార్థినియే. ఆమెయు అన్నివిధములా ఆమొదటివనితనే బోలి యున్నది. రెండవవనితను గాంచగానే చిరునవ్వుతో,

"రా!...రా!!...లలితా!.....నువ్వు ఇంటికివెళ్ళడంలేదా యేమిటి మధ్యాహ్నంపూట..."

"లేదు కానీ...నువ్వు ఇక్కడిల్లాకూర్చున్నావేం పద్మా!... ఒంటరిగాకూడానూ..."

"అబ్బే...ఏంలేదు...ఏమీతోచక కాస్సేపువిశ్రాంతి తీసు కొందామని ఇక్కడకూర్చున్నాను..."

"అయితే...నువ్వు ఇంటికిపోలేదేం...?"

"ఆకలిగాలేదు...అందుచే బద్దకించిమానేశాను..."

"అయ్యో! భోజనంమానెయ్యడమేమిటి...రా, పోనీ కాస్త ఈ టిఫెన్ తిందాం ఇద్దరమూను......

"అబ్బే! నాకాకలిగా లేదు...నువ్వుతిను...

"నేనెల్లాగూతింటానులే...నువ్విలాఆకలితో వుండడంమం చిదికాదు...రా...నామాటవిను...

"నామాటవినులలితా ... నన్నొట్టేబలవంతం చెయ్యకు... నువ్వుతిను..."

"నాదగ్గరామొహమాటపడుతున్నావు...రా!..,తిందాం,

అంటూ పద్మచెయ్యిపట్టుకుని బలవంతాన తనదగ్గరగా కూర్చోపెడుతుంది, యిద్దర్రూ లలిత తెచ్చిన టిఫెన్ తింటూవుంటారు. పద్మమద్రాసులో జడ్జీగారికుమార్తె. లలిత గవర్నమెంటు వైద్యశాల డాక్టరుగారికుమార్తె. లలిత పద్మకన్న రెండేళ్ళుపెద్ద. బుద్ధికుశలతకలది.

"అయితే ఇవాళ సుబ్రహ్మణ్యాం కాలేజీకి వచ్చాడాలలితా!.

"ఆ!...వచ్చాడు. అంతాపరామర్శలు చేసేవాళ్ళే...

"అయితే సుబ్రహ్మణ్యాం ఏమంటున్నాడు...?"

"ఏమంటాడూ...తండ్రిపోయినందుకు విచారిస్తున్నాడు..."

"ఇంతకూ నేరస్తుడెవ్వరో ఏమయినా తేలిందా...?"

"తేలడానికేముంది...మనప్రముఖుడు శంకర్రావేనుట... అనుకుంటున్నారు...

పద్మకొంచం కంగారుపడి ఆతురతగా అడుగుతుంది ఏమీ ఎరుగనట్లు.

"ఏశంకర్రావు...?

"ఇంకెవరు ప్లీడరు రాఘవరావుగారి బావమరిది...

"ఆ!...ఆ శంకర్రావే ...నేనునమ్మను...అతడల్లాంటివాడు కాడు—నేను బాగాఎరుగుదును...."

"ఏమో ఏమెరుగుదువో...మొత్తంమీద వానిమీదే బలపడింది నేరం...పోలీసులు వెతుకుతున్నారు..."

"ఎల్లాబలపర్చగలరు...సాక్ష్యమేది? పైగావాళ్ళబంట్రోతు భీమన్నను పట్టుకున్నారుగా..."

"ఏమోమరి...ఏమనిచెప్పగలం...కాని శంకర్రావు బట్టలు కూడాదొరికాయిటకూడాను..."

"వానిబట్టలు దొరికాయా ...!"

"ఆ! వాళ్ళ బావగారింట్లో నేదొరికాయి... వాటినిండా రక్తం మరకలేను..."

పద్మతుళ్ళిపడి మరలపస్తాయించుకుని మొండిగా వాదిస్తుం దిలలితతో.

"అయితే...!"

"తానునిర్దోషే అయితే పారిపోవడమెందుకూ...?

"పారిపోకూడదని ఎవరనగలరు...? అతడేదో స్వంతపనిమీద వెళ్ళియుండకూడదా...?

"రెండు నెలలూ...స్వంతపనే...!"

"ఏం...శలవు లేగా...అయితే అవుతుంది..."

"పోనీ అల్లాగే అనుకుందాం ... మరెవరితోనూ చెప్ప కుండా రాత్రికి రాత్రి వెళ్ళిపోవడమెందుకూ...దొంగలాగ..."

"దొంగలా పోయాడన్నమాటేమిటి?...అర్జంటుపనులుంటే రాత్రేమిటి...పగలేమిటి... ఎప్పుడయినా మనంచూస్తుంటం వెళ్ళడం లేదూ..."

"పోనీ యింట్లోవున్న అప్పతోనయినా ... బావతోనయినా చెప్పవద్దూ..."

"ఏం...?...చెప్పాలన్ననియమమూ..."

"వాళ్ళ యింట్లోవుండి... వాళ్ళకయినా చెప్పకుండా పారి పోతాడా..."

"ఎవరంటారు పారిపోకూడదని ... వాళ్ళింట్లో ఉన్నంత మాత్రాన వాళ్ళకు తనరహస్యాలన్నీ చెప్పాలా...?"

"వెళ్ళబోయే ముందయినా చెప్పాలా వద్దా చెప్పు ... వాళ్ళింట్లో ఉన్నందుకు..."

"ఉంటేమాత్రం...వాళ్ళసాక్ష్యం వినడం లేదుగా...తండ్రి దగ్గరనుండి సొమ్ము తెప్పించుకొని ఖర్చుపరచుకుంటున్నాడు..."

"ఏమో నువ్వేమో సమర్థిస్తున్నావే గాని ... నాకేమీ నమ్మకం లేదు వాటిమీద...అతడే చేసి వుంటాడేమని..."

"అల్లాఎన్నటికీ చెయ్యడు...నాకానమ్మకం లేదు..."

"నీకు నమ్మిక లేకపోవడ మేమిటి...? ఊరంతా...దేశమంతా పాక్కిపోయింది...శంకర్రావు ఖూనీ నేరస్థుడని..."

"అదంతా అబద్ధం...ఋజువు కాదు..."

"నువ్వింకా పెరటిత్రోవనే వున్నావుపద్మా! ... పైకి నెమ్మదిగావుండి లోలోన ఎంతెంతలేసి మోసాలు చేస్తూన్న వాళ్ళు లేరు... ఇల్లాటివాళ్ళను నమ్మకూడదు...దొంగ వెధవలు..."

ఆమాట వినేసరికి పద్మకు అంతులేనికోపంవస్తుంది. గుర్రెర్ర చేస్తూ తానేమనేదీ తెలుసుకోకుండా ఆవేశంతో.

"లలితా!..."

"నేనన్న దానిలో తప్పేముందిపద్మా! మధ్యనీకెందుకింతకోపం.?

"అనవసరంగా దూషించడం మంచిది కాదు..."

"అయితే నీకెందుకీకోపం...పోమే బావ వాడయితే..."

"ఆమాట లేవద్దన్నాను...విన్నా!!—"

పద్మయొక్క తీవ్రభాషణ వినేసరికి లలితకు కొంచంపాటి అనుమానమేకల్గింది. శంకర్రావుకు పద్మకు సమీపంగా బంధుసంబంధమూ అంటే అల్లాటిదేమీ లేదే...మరియెందుకు నా మొకింతకోపం... లేకపద్మ వానిని...కొంచంపరీక్షగా పద్మలక్షణాలను పరికిస్తుంది. శంకర్రావునుగురించి చెడ్డగా చెప్పినప్పుడల్లా ఆమె ఏదో లోన బాధ పడసాగినది. ఆరహస్యంగ్రహించిందిలలిత. కొంచంనిదానిస్తూ.

"నీధోరణి నాకేమీ అర్థం కాలేదు...నీవుద్దేశం...?"

"ఏముంది...ఏమీ లేదు...అనవసరంగా అల్లాడుతూ పెంచ వద్దన్నాను..."

"నిన్ను నేనేమీ అనలేదుగా...వానినం చేసికేం..."

"అదే వద్దన్నాను..." నిశ్చయమయిన మనస్సుతో గంభీరం గాను క్లుప్తంగాను అంటుంది. ఇప్పుడు లలిత అనుమానం దృఢ మయింది.

"ఆ!...అంటే..."

"ఏమీ లేదు..." ఇప్పుడు పద్మ లలితముఖం చూడలేక పోతుంది. దాంతో పద్మ యొక్క ఉద్దేశం గ్రహించిందిలలిత. పద్మ యొక్క అమాయకత్వానికి చాలాజాలిపడింది....కొంచం తీవ్రం గాను పరీక్షగాను...కంగారుతో పద్మను పలుకరిస్తుంది.

"అయితే పద్మా !...నువ్వు వానిని..."

పద్మ ఏమీ మాటలాడదు. వంచినబుర్ర ఒక్కసారి పైకెత్తి లలితముఖంలోకిచూసి మరలబుర్రకిందకు దింపుకుంటుంది. పద్మ కళ్ళలో కన్నీరు చూస్తుందిలలిత. ఒక్కసారిగాజాలి, ఆశ్చర్యము ప్రేమ పుట్టుకువస్తాయి. పద్మకంటివెంబడిని రెండు వేడి కన్నీటిచుక్కలు క్రిందపడతాయి. అవితనకళ్ళారాచూసిందిలలిత. అమెకంతా అయో మయమైపోయింది. బుర్రలో అనేక ఆలోచనలు పరుగులెత్తాయి. పద్మ తనకు ప్రాణహితురాలు. ఒకరినొకరువిడచి ఒక్కక్షణమయిన ఉండలేరు. తనకష్టసుఖాలను ఒండొరులతో ఎప్పుడూ చెప్పుకుంటూ నిర్విచారంగా కాలం గడుపుతున్నారు. ఇద్దరూ ఇంటర్మీడియేట్ చదువుతున్నారు. ఆశ్చర్యంగా ప్రశ్నిస్తుందిలలిత.

"నువ్వు ఆలోచించుకున్నావా ... పద్మా! తప్పుత్రోవను పడ్డావుసుమా..."

"అంటే...నీవుద్దేశం...?"

"పద్మా!...నీజీవితం పాడుచేసుకుంటావా...అతడొక ఖూనీ నేరస్థుడని తెలిసికూడా..."

"హుఁ! నేరస్థుడు...ఎల్లా ధ్రువపరచగలవు...అతడల్లాంటి వాడుకాడు..."

"నువ్వు పొరబడుతున్నావు పద్మా!...అతడునిన్ను సుఖపెట్ట లేడు...నేరస్థుణ్ణి..."

"లలితా! అనవసరపు ప్రస్తావనవద్దు..."

"అదికాదు పద్మా! నామాటవిను...తొందరపడి బుద్ధిపాడు చేసుకోకు,...బాగా యోచించు...అతడు నేరస్థుడు...శిక్షతప్పదు, నిన్నేంసుఖపెడతాడు, .బహుశా ప్రాణాలుకూడా..."

అన్నది అనుమానిస్తూ స్నేహితురాలియొక్క క్షేమంకోరు తూ, ఆమాట చెవినిపడగానే పద్మకోపం ఆపుకోలేక పోతుంది, మైమరస్తుంది, ముందువెనుకలు ఆలోచించకుండా లలితచెక్క లెంప కాయ కొడుతుంది,

"Shut up" లలిత నివ్వెరబోతుంది, ఒక్కసారిగా కోపం వస్తుంది, కాని ఆమె చాలాసూక్ష్మదృష్టికలది, వెంటనే శాంత మయిన దృష్టితో మందస్వరంతో వినయపూర్వకంగా పద్మను క్షమాపణ వేడుతుంది,

"క్షమించుపద్మా! నావల్లపొరపాటే జరిగింది..."

దాంతో పద్మకు తెలివివచ్చింది. తాను చేసినపని ఎంతటి దారుణమయినదో తెలుసుకుంది, లోనుండి దుఃఖం కట్టతెగినయేరు లా పొంగిపొరలివచ్చింది, మిక్కిలి పశ్చాత్తాపపడింది, తనక్షేమం

కోరి తనకు హితవుచెప్పిన ప్రాణసమానురాలయిన లలితను వడలు తెలియని ఆవేశంలో కొట్టింది. ఆమెకప్పుడేమి చెయ్యాలో అర్థం కాలేదు. లలితముఖంవంక చూడలేకపోయింది. అల్లాగే లలిత పాదాలదగ్గర కూలబడింది. వచ్చేదుఃఖాన్ని దిగమ్రింగుతూ,

"నాతప్పు మన్నించు...లలితా?...చేయరానితప్పు చేశాను. వళ్ళుతెలియని ఆవేశంలో ఏమేమో అన్నాను...అవన్నీమరచిపో. నీకాళ్ళుపట్టుకుంటున్నా...నన్ను క్షమించవూ..."

అని లలిత పాదాలుపట్టుకున్నది. వెంటనే లలిత తెలివితెచ్చుకుని ఆమెను లేవనెత్తి బుజ్జగిస్తూ,

"వెర్రిదానా...ఇందులో అంతబాధ పడవలసినదేముంది... విచారించకు ... అసలు నిన్నాపరిస్థితికి తేవడమే నాదితప్పు... మరేమీ బాధలేదు...చింతించకులే...!"

ఇప్పటికి పద్మకొంచం తెప్పిరిల్లింది. లేచి లలితప్రక్కగా కూర్చుని కారేకన్నీటిని తుడుచుకుంటూ...అనుమానంతో,

"అయితే లలితా!...దీనికింక మార్గమేలేదా...!"

అందుకు లలిత వెంటనే ఏవిధమయిన సమాధానం ఈయలేకపోతుంది. పద్మయొక్క అమాయకత్వానికి మిగుల జాలిపడుతుంది. ఏవిధంగానయిన ఆమెకు సాయముచేసి ఆమెకోర్కె కొనసాగింపజేయాలనే పట్టుదల లలితహృదయంలో దృఢంగా ఏర్పడుతుంది. క్షణకాలంయోచించిన పిదప కొంచంధైర్యంగా,

"పద్మా! బొత్తిగా వెర్రిదానవయిపోతున్నావుగాని...ప్రయత్నించిచూస్తే మనకేమీ మార్గాలే దొరకవా?...అయినా ఎందుకయినా మంచిది. ముందుఒకసారి రాఘవరావుగారింటికి వెళ్ళి ఓ మాటు పరామర్శిద్దాం...ఏమయినా తేలవచ్చు..."

"సరే...అదీమంచి ఆలోచనే...గదు ఆనక న్యాలువిడచి పెట్టాకవెడదాం...ఏమయినా కొంచమయినా తెలుసుకోవచ్చును,"

ఇంతలోకి ఎవ్వరో విద్యార్థులావేస వచ్చుచున్న అలుకుడు విని వారిద్దరు మాటలాడుట మానివేసి త్వరితముగా అచ్చటనుండి లేచి తమతమ తరగతులకు బోవుదురు.

ఆఱవ ప్రకరణము సమాప్తము

---

## ఏడవ ప్రకరణము

నాడు సాయంకాలము ఆరుగంటల సమయమప్పుడు లలితా పద్మ లిద్దరు నొకగుఱ్ఱపుబండిపై రాఘవరావుగారింటికి వెళ్ళినారు. రాఘవరావింటికి యింకను రాలేదు. లోపల రాధమాత్రము వీధి సావడియందొక్క సోఫాలో కూర్చుని ఏమోలేసును అల్లుకుంటూ ఒంటరిగానున్నది. క్రొత్తగా పెట్టుకొనిన నౌకరు కుఱ్ఱవాడు వీధి యావరణలోని పూలమొక్కలకు నీళ్ళుపోస్తున్నాడు. రేడియోలో శ్రావ్యమగు సంగీతము వినవచ్చుచున్నది. ఆసమయంలో లలితా పద్మ లిద్దరు యెక్కివచ్చినబండి ఆయింటి గేటువద్దఆగినది. నౌకరు కుఱ్ఱవాడు గబగబావెళ్ళి గేటుతెరచి ఆత్రుతగా ఆవచ్చిన వారి వంక చూస్తూ ప్రక్కకుతొలగి నిలచియుండును. నెమ్మదిగాబండిలో నుండి ఆయిద్దరు వనితలు క్రిందకు దిగి తిన్నగా మేడవద్దకు బయలు దేరిరి. వీరినిగాంచినరాధ చరాలునలేచి ఈవలకు వారికెదురుగావచ్చి ఇద్దరును ఆహ్వానించింది. అందులలిత ఆమెకు చిరపరిచితురాలు కావడంచేత వెంటనే ఆమెను గుర్తించింది. పద్మనామె యిదివరలో చూసివుండకపోవడంచేత ఆమెవంక క్రొత్తగాచూస్తూ,

"రా! లలితా! రండి... ఈవిడఎవరు...!

"మాస్నేహితురాలులెండి...మనజడ్జీగారమ్మాయే..."

"ఆ!...అల్లాగా...రా, అమ్మా...కూర్చో..."

అంటూ లోపలకు ఆహ్వానిస్తుంది. అంతా వీధిసావడిలోనే సోఫాలలో కూర్చుంటారు. వీళ్లిద్దరు ఇప్పుడెందుకు వచ్చారా అని సందేహిస్తూ ఏదో ధోరణిలో.

"ఇవాళ కాలేజీ లేదా యేమిటి...లలితా!"

"లేకేమండీ...ఉంది ... కాలేజీ విడచుట అయిదుగంటల కేగా..."

"ఓహో! అవునన్నట్లు ... అయితే ఏమిటిల్లాగ వచ్చారు... అంతా క్షేమమేనా...?"

"ఆ! అంతా దేవునిదయవల్ల ఇంతవరకు క్షేమంగా నేవున్నాం ...పాపం శంకర్రావు సంగతే... చాలా విచారకరంగావుంది..."

అన్నది లలిత రాధముఖంలోకిచూస్తూ విచారసూచకంగా. పాపం శంకర్రావుసంగతి వినేసరికి పద్మకు ఒకవిధమగు బాధ కలిగినది కాని చాలవరకు ఆలక్షణాలేవి పైకి పొక్కనీయక అణచి వేసింది. ఇదేసమయంలో ఆమెదృష్టి ఎదుటిగోడమీది శంకర్రావు ఫొటో మీదపడ్డది. ఆబొమ్మనుచూస్తూంటే పాపమామెకు దుఃఖంపొంగి పొరలివచ్చింది. ఆపుకుందామని ఎంతో ప్రయత్నించింది ... కాని అది ఆమెవశము తప్పినది. కళ్ళవెంబడి జొటజొట నీరుకారసాగింది. దాంతో చరాలున తెలివితెచ్చుకుని ముఖమావలిదిక్కుగా త్రిప్పు కుని కన్నీరు తుడుచుకున్నది. ఈవిషయమంతయు లలిత గ్రహించి నదికాని, తమ్మునివిషయ మడుగగానే పుట్టుకవచ్చిన దుఃఖంలో (అంటే అంతాసహజమయినది కాకపోయినా) మునిగిపోయివుండడం చేత రాధ, పద్మచర్యలు కనిపెట్టలేకపోయింది. పరిస్థితులు విషమి స్తున్నాయని గ్రహించిన లలిత రాధను ఓదారుస్తూన్నట్లుగానటించి,

"ఇంతకూ.. రోజులు సరిగాలేకపోతే అల్లాగే వచ్చిపడు తూంటాయిలెండి..."

"ఏమో...ఏంచెయ్యమన్నా!...ఇదంతా మా ప్రారబ్ధం... ఇదెక్కడి శనిరోజులో కాని ఇల్లాంటివాడు పడింది...ఏపాపంఎరగని వాడివిూద..."

"విచారించి ఏంలాభంలెండి రాధమ్మగారూ! ... ఇంతకూ సత్యం ఎన్నటికీదాగదు..."

ఆమాట వినేసరికి రాధగుండెలో రాయిపడ్డట్టయింది. ఒక్క సారిగా ముఖలక్షణాలు మారిపోతాయి. ముఖంలో విషాదరేఖలు అలుముకుంటాయి. కొంచం కంగారుపడుతుంది. కాని అంతలోకే కొంచం సర్దుకుని...

"ఏమోనమ్మా, ఏమవుతుందో ... ఎక్కడున్నాడో... ఏం చేస్తున్నాడో మాఅమ్మా నాన్నా మంచం పట్టేశారు ... రేపుబయు ల్దేరి గుంటూరు వెడదామనుకుంటున్నాం..."

"అల్లాగాండి...ఇంతకూ ఏదివిల్లాజరగాలో అల్లాతప్పదు... అంతమంచివాడికల్లాంటి వాదేమిటిచెప్పండి..., సరేనస్తామండి... ఊరికే చూసివెడదామని వచ్చాం..."

"మంచిది వెళ్ళిరండమ్మా...!

"వస్తామండీ..."

అంటూ లలిత పద్మ లిద్దరూలేచి నెమ్మదిగా బయల్దేరివెళ్ళి బండిఎక్కుతారు. కారేకన్నీటిని తుడుచుకుంటూ రాధకూడా గేటు దాకావెళ్ళి వారిని సాగనంపి వెనుదిరిగి లోనికి పోయింది. ఇంకబండి వెళ్ళిపోతూంటే బండిలోనివా రిద్దరూ సంభాషణలోనికి దిగారు.

"అయితేపద్మా! ఎంతపనిచేశావు...? ఆమెగోడవలో ఆమె పడివుండబట్టి నీచర్య యేమిూగుర్తించలేకపోయింది కాని...లేకపోతే ఏంజరిగేదో..."

"ఏంచెయ్యను లలితా! ఆయింటిలోని గోడకున్నవానిఫోటో చూసేటప్పటికి దుఃఖం ఆగిందికాదు. ఆపుకుందామని ఎంతయినా ప్రయత్నంచేశాను..."

"బాగానేవుంది. కాని మనకీవిషయంలో ఏమీలాభంలేదు సుమా...అంతా వృథాశ్రమే అయిపోయింది..."

"వచ్చింది మొదలుకుని బుడీబుడీదీర్ఘాలే తీయడం మొదలు పెట్టింది ఆయిల్లాలు. ఇంకేంచెయ్యం"

"కాని ఆమెలక్షణాలనుపరిశీలించావో లేదో కాని ఆమెనిజంగా దుఃఖిస్తున్నట్లు అగుపించడంలేదు...అంతా నటనలావుంది..."

ఆమాటకు పద్మ ఆశ్చర్యపోయింది. లలితమాట నిజమా. ఆమె అంత తీక్షణంగా పరిశీలించగలదా! పోనీ అల్లాగే అనుకుందాం ...అయితే ఆమె ఎందుకల్లా నటిస్తుంది. ఏమో ఇదంతా పద్మకు చాలా ఆశ్చర్యమయమైపోయింది. తాము తప్పుదారి త్రొక్కుతున్నారేమోఅని అనుమానించింది. ఇక ఉండబట్టలేక లలితను అడుగుతుంది.

"అంటే!...నీవుద్దేశం...?"

"అట్టేఏంలేదు ... విషయం ఏమయినా కొంచమయినా తెలుసునేమోనని..."

బండిజోరుగా వెళ్ళిపోతోంది. అప్పటికీ సుమారు ఏడుగంటలవుతుంది. పట్టణమంతా విద్యుద్దీప కాంతులలో మెరిసిపోతూవుంటుంది. మనబండి ఆమిణుమిట్లుగొల్పు దీపకాంతులలో శరవేగంతో ముందుకు సాగిపోయింది.

ఏడవ ప్రకరణము సమాప్తము.

---

# ఎనిమిదవ ప్రకరణము

ఉదయం ఎనిమిదిగంటలసమయం. జడ్జీగారి మేడలో పైన మేడమీద సావడిలో ఒక సోఫాలోకూర్చుని ఒక స్త్రీఏమో దీర్ఘంగా యోచిస్తూవున్నది. మరికొంచము సేపటికి మరియొక స్త్రీ ఆసావడియందు ప్రవేశించింది. వస్తూనే పరధ్యానంగా వున్న మొదటిస్త్రీనామెను హెచ్చరిస్తూ.

"ఏం?పద్మా!...ఏమిటిల్లాఒంటరిగా కూర్చున్నావు..."

దాంతో ఆస్త్రీ...పద్మ ఉలిక్కిపడి ఆవచ్చినయామెవంక చూసి "రా! లలితా!...ఏంలేదు, రాత్రినిద్దురపట్టక కొంచం ఆలస్యంగా ఇంతకిప్రతమే లేచాను......ఏమీతోచక ఇల్లాకూర్చున్నాను ... రా!...కూర్చో..." లలితఆపక్కగా కూర్చుంటుంది. ఇద్దరూ సంభాషణలోకి దిగుతారు. పద్మ ఆతురతగా అడుగుతుంది.

"అయితే లలితా!...మనశ్రమఅంతా వృధాఅయిపోయినట్లే కదా!...ఏమీ లాభించిందికాదు"

"అంతమాత్రానికే అధైర్యపడితే ఎల్లా చెప్పుపద్మా! నెమ్మది మీద జరగాలిగాని తొందరపడితే ఎల్లాగ...?

"ఏమో ఏమిటో నాకేమీబోధపడటంలేదు ... ముందుఏమి చెయ్యాలోనాకేం తోచడంలేదు...

"నాకూయేమీ అర్థంకావడంలేదు ... కాస్తస్థిమితపడి యోచిస్తేకాని ఏమీలాభంలేదు..."

"అయితేఏమంటావు...ఏదయినా కొత్తమార్గంను వెదకి చూడాలి..."

లలిత క్షణకాలంతీవ్రంగా యోచిస్తుంది. క్రమంగా ఆమె ముఖంలో ఆనందరేఖలు గోచరిస్తవి. అవిచూడగానే పద్మకు ధైర్యం అతురత హెచ్చుతాయి.

"ఏం?...లలితా! ఏమయినా తోచకుండాయేమిటి..."

"అదే ఆలోచిస్తున్నాను...ఆ! అన్నయ్యమన మొక్కపని చేస్తే బాగుండేటట్లుంది..."

"ఆ!...ఏమిటది...త్వరగా చెప్పు"

"మనమే శంకరాన్నను వెతుకుతే...?"

"మనమా...ఎక్కడున్నాడని వెదకగలం?"

"మనమెక్కడకు వెళ్ళడం...?"

"మరివెల్లాగ...?"

"మరియింతేనా ... నువ్వాలోచించినది... 'C. I. D.' ని పెట్టి వెతికించాలి..."

"C. I. D."నా...!"

"అవును...ఈ విషయం చాలా గూఢంగావుంచు ... అన్నీ నేను చేస్తాను...డబ్బుకుమాత్రం మనం లోభత్వం చెయ్యకుండావుంటే ...వానిజాడతీయడాని కెంతో కాలంపట్టదు..."

"డబ్బు కెన్నడూ సందేహంలేదు...మరినువ్వే ఆసంగతేదో చూడాలి..."

"చూడడాని కేముంది...ధైర్యంగా ఇప్పుడు నువ్వొకపని చెయ్యాలి..."

"నేనా!...ఏమిటది...?"

"నెమ్మదిగా మీనాయన గారికి తెలియపరచాలి... తర్వాత విషయమంతా నేను చూస్తాను"

"అమ్మో! మా నాన్నగారికే...ధైర్యంచాలదు...లలితా! ...ఇల్లాంటివిషయం..."

"అల్లాగంటే మరిపనిజరిగే విధానమేదిచెప్పు ... మీనాన్న గారు నీమాటకాదనలేరు...ధైర్యంవహించాలి...ఊ!...లే..."

ఇంతలోకి అప్పుడే స్నానంజపం పూర్తిచేసుకొని జడ్జీగారు మేడమీదకు వస్తూవుంటారు. లలిత ప్రోత్సహిస్తుంది. పద్మకు ధైర్యం చాలదు. గజగజ వణకిపోతుంది. కాని లలితప్రోత్సాహంతో కొంత ధైర్యం తెచ్చుకుంటుంది. జడ్జీగారు చిన్నగా తనగదిలోనికిపోతూ—

"పద్మా!......" పద్మధైర్యం తెచ్చుకుని.

"ఆ!...వస్తున్నానండీనాన్నగారు...!"

"అంటూ జడ్జీగారిగదిలోకి వెడుతుంది. ఆయన ఆమెకేసి ఎంతో ప్రేమతో చూస్తూ.

"ఏమమ్మా! ఏంచేస్తున్నావ్...?"

"ఏంలేదండీ...లలితవచ్చింది ... ఏదోమాట్లాడుతున్నా... కాఫీపట్టుకువస్తా నుండండి..."

"చూడు...మీఅమ్మనుకూడా రమ్మన్నానవిపిలు..."

"అల్లాగే..." అంటూ పద్మతిన్నగా క్రిందకు వెడుతుంది. జడ్జీగారిఆజ్ఞ తల్లికిచెప్పి కాఫీ టిఫెనూ పట్టుకొని బయల్దేరుతుంది. వెనువెంటనే లక్ష్మీబాయమ్మగారు కూడా వస్తుంది. ఈలోగా జడ్జీగారు బట్టలుమార్చుకుని తిన్నగాసావడిలోనికివచ్చి అక్కడున్నలలితను చూసి.

"ఏమమ్మాలలితా! ఏమిటిల్లాపొద్దుటేవచ్చావు...? మీనాయనగారు ఆస్పత్రికివెళ్ళారా..."

"ఆ! వెళ్ళారండీ...పద్మకోసం—వచ్చాను..."

ఇంతలోపద్మ,లక్ష్మీబాయమ్మగారువస్తారు. పద్మ తాను తెచ్చిన కాఫీ ఫలహారములను అచ్చటబల్లమీదపెట్టి లలితప్రక్కన

సోఫాలోకూలబడుతుంది. లక్ష్మీబాయమ్మగారు చిరుమందహాసంతో వీధిలోనికి వెళ్ళడానికి సిద్ధంగానున్న బట్టలను ధరించివున్న భర్తనుచూచి,

"వీధిలోకేనా యేమిటి ప్రయాణం ......? మా అన్నయ్య వచ్చాడు..."

"ఏడీ...ఎప్పుడొచ్చాడు...?"

"ఆరుగంటలబండిలో వచ్చాడు...కూడా ఎవరో వున్నారు. మీరు నిద్రపోతున్నారని...మళ్లా ఆపెద్దమనిషిని సాగనంపి ఒక గంటలో వస్తానన్నాడు...మిమ్మల్ని ఇంటిదగ్గరే వుండమని చెప్పమన్నాడు..."

"బాగానే చెప్పమన్నాడులే...!"

"ఎవరమ్మా కేశవరావు మామయ్యా...!"

"అవును...ఈపాటికివస్తూనే వుంటాడు..."

"అవునులే వస్తూనేవుంటాడు...కావలసినవారిని చూశాడు, వెళ్ళాడు...ఎప్పుడో వస్తాడు..."

అంటారుజడ్జీగారు కొంచం చిరాకునభినయిస్తూ. దానిమీద తోకత్రొక్కిన త్రాచులా లేస్తుంది లక్ష్మీబాయమ్మగారు. ఇల్లాకొంతసేపు ఛలోక్తులతో ఆమెకు బాగా కోపంరానిచ్చి మళ్ళాఏదో లంచంతో ఆమెను శాంతపరచడం జడ్జీగారికి ఆనందం. లంచాలు విషయం బాగా తెలిసివుంటుందిగామరి. అప్పుడప్పుడు కులాసాసమయాల్లో జడ్జీగారికిల్లాటి విషయాలు పరిపాటు.

"అదుగో అంతవరకే మీఆలోచన ఎప్పుడూ ఎదుటివాళ్ళను పేడలోపురుగులా తీసిపారెయ్యమంటే మీతర్వాతే..."

"అయ్యో! అంతకోపమెందుకూ...ఉన్నమాటే అన్నాను, లేకపోతే...సరేలేపోనీ ఏదోవెళ్ళాడు గంటలోవస్తానన్న పెద్దమనిషి ఛూడు అప్పుడే తొమ్మిదిదగ్గరవుతోంది...అంటే మూడుగంటలకు

కూడా పికరు లేడన్న మాట ... ఏమయినా పెద్దఉద్యోగస్థుడు ... ఎల్లాగయినా బాధ లేదు...ఏమంటావ్...?"

"అయితే అంతమాత్రానికే ఇంతమల పరించాలా! అవతల మనిషిని సాగనంపాలా అక్కర్లేదా...?'

"పోన్లెద్దూ అన్నా! ...... ఇంతకూ మామయ్య ఒక్కడే వచ్చాడా...?"

"అవునమ్మా...ఒక్కడే వచ్చాడు...అతనికి ఈవూరు బదిలీ అయిందిట...ముందు ఛార్జి పుచ్చుకోడానికి వచ్చాట్ట..."

"అయితే మీావదినా పిల్లలూ అంతా క్షేమంగా వున్నట్లేనా?

"ఆ!...అంతా క్షేమంగానే వున్నారట...మళ్లా వెళ్లి వాళ్ళను తీసుకువస్తాట్ట..."

"అయ్యో! ఇప్పుడే తీసుకురాలేకపోయాడూ ... అన్నీసర్దు బాటయ్యేదాకా ఇక్కడే వుండును"

"అత్తా! పిల్లలూ వస్తారాఅమ్మా!..."

"ఆ! ఒకవారంరోజులలో వస్తాడట...మీావదిన ఈసంవత్స రమ్ ఎఫ్. ఎ. లోకి వచ్చిందిట..."

"ఊ!...అయితే...ఇంకా ఏమన్నాడూ..."

"ఇంకేమీా చెప్పలేదు...మిమ్మల్ని తానువచ్చేదాకా ఇంటి దగ్గరేవుండమన్నాడు..."

"అల్లా!...ఏమిటో ఆరాచకార్యం...హుం...ఏం చేస్తాను. తప్పదుకదా..."

"హూం...!అంత వేళాకోళంగావుంది మామాటం టేమీాకు"

"వేళాకోళమేమిటి నీమొహం...బావగారుకదా మర్యాద చెయ్యకపోతే ఎల్లాగా..."

ఇంతలోకే వంటమనిషి లోపలనుండి పిలుస్తుంది. జడ్జీగారి కన్న మాటలయినా పూర్తిగా వినిపించుకోకుండా దబదబలాడుతూ వెళ్ళి పోతుంది లక్ష్మీబాయమ్మ. దాంతో ఓ గాలివాన తగ్గినట్టుంటుంది అంతా. జడ్జిగారు ఫలహారం తినడంపూర్తిచేసి కాఫీ త్రాగుతూ, అంతవరకూ మౌనంగా కూర్చున్న లలితనుచూసి.

"ఏమమ్మా లలితా! అల్లామౌనంగా కూర్చున్నావు... కాఫీ త్రాగేవా...?"

"ఆ త్రాగేవచ్చానండీ..."

"పద్మ, నువ్వు జాగ్రత్తగా చదువుకుంటున్నారా...ఇదిగో ఇంకోవారానికి మీకింకొక క్రొత్త స్నేహితురాలుగూడా వస్తోంది."

ఇంతలోకే పద్మ ఏదోచెప్పాలనుకుని పెదవులు కదిపి మరల ధైర్యంచాలక వెనుకకుతగ్గి వూరుకుంటుంది. అదిగ్రహించి జడ్జీగారు ప్రేమతో.

"ఏమమ్మా ఏంకావాలిసీకు ... సందేహిస్తున్నా వెందుకు చెప్పు...?"

"ఏం లేదండి నాన్నగారూ..." సిగ్గుపడుతుంది. లలితముఖం వంక చూస్తుంది. ఇంకప్పుడూరకుంటే లాభంలేదనుకుని లలిత ధైర్యం తెచ్చుకుని పద్మదిక్కుగా.

"సిగ్గుపడతావేం ... ఏం లేదండీ బాబయ్యగారూ...శంకర్రావుసంగతి...ఏమైనా... తెలిసిందేమోనని..."

దాంతో జడ్జీగారు త్రుళ్ళిపడి లలితముఖంవంకచూచి, పరీక్షగా పద్మవంక చూస్తారు. పద్మతలక్రిందకు దించుకుని వుంటుంది. ఆయనకేమీ అర్థంకాక, వీళ్ళకు శంకర్రావు .సంగతి ఎందుకని సందేహిస్తూ ఏమీఎరుగనట్లు.

"ఆ!...శంకర్రావుసంగతా..., ఏశంకర్రావు...?"

"వెంకటేశన్ కేసులో...ముద్దాయి..."

"ఏం...? ఇప్పుడా విషయమెందుకూ...?"

"అబ్బే...ఏంలేదండీ...అసలువిషయం తెలుసుకుందామని అడిగి..."

"ఓహో...అదా...అబ్బే. ఇంకాఏమీ తేలలేదు...శంకర్రావు ఆచూకీ ఎక్కడాదొరకినట్లులేదు ... వెంకటేశన్ బంట్రోతును భీమన్న అనేవాణ్ణిమాత్రం అనుమానించి పట్టుకుని ఖైదులో వుంచారు..."

"అయితే పాపమేమై...య్యుంటాడో... అనవసరంగావచ్చి పడిందీ అపవాదు..."

"అనవసరమా...! ఏం? నువ్వెలాచెప్పగలవు...?"

"నేను అతణ్ణి బాగా యెరుగుదునండీ...చాలామంచివాడు. యోగ్యుడు...అల్లాంటిపని చేశేవాడుకాడు..."

"ఏమో ఏంచెప్పం...? వానిగుడ్డలుకూడా దొరికాయిట మరి..."

"అదే అర్థంకాకుండావుంది...ఇంతకూ..."

"పోనిద్దూ...ఇప్పుడెందుకా పాడుగొడవ..."

"అదికాదండీ బాబయ్యగారూ...అల్లాగవదలివేస్తే...

జడ్జీగారికి ఆశ్చర్యం ఎక్కువౌతుంది. వాణ్ణిగురించి మధ్య అనవసరంగా లలిత ఎందుకింత శ్రద్ధతీసుకుంటోందా అన్నఅనుమానం కల్గింది. జడ్జీగారికి ఏమీతోచిందికాదు. శాంతంగా లలిత చెప్పేవిషయాలు వింటే సంగతంతా అప్పుడే తెలుస్తుందని నిబ్బరపడి, కొంచం సందేహంతో ప్రశ్నిస్తారు. దానికి లలితకూడాకొంచం జంకుతూనే విషయం బయల్పరుస్తుంది.

"అంటే...!"

"ఏమీ లేదండీ..."

"సంకేతిస్తావేం... చెప్పాలి దేమిటో..."

"మీరు వేరుగా భావించకుండా..."

"వేరుగా భావించడమా...! నాకేమీ అర్థం కావడం లేదు... అసలు సంగతేమిటి...?"

లలిత పద్మవంక చూస్తుంది. పద్మ భయపడుతుంది. సిగ్గుతో అక్కడనుండి తరలిపోయి తలుపు ప్రక్కకుపోయి నిలుస్తుంది. దాంతో జడ్జీగారు మరీ ఆశ్చర్యపోతారు. ఇంతసేపూ తాను లలిత విషయమే మోఅని అనుమానిస్తూంటే ఇప్పుడు ఈ పద్మచర్య చాలా అగమ్యగోచరమయిపోయింది. పద్మ నిలిచిన స్థలము వంక ఒక్కసారి పరీక్షగా చూసి లలిత వంక తిరిగి నెమ్మదిగా,

"అయితే సంగతేమిటి...? లలితా!"

"మరేం లేదండీ... శంకర్రావుని... పద్మ..."

"ఆ!... శంకర్రావును... పద్మా!..."

తెల్లబోయినాడు జడ్జీ. క్షణకాలం అల్లాగే వుండిపోతాడు. అందలి గూఢార్థం గ్రహిస్తాడు. ఒక్కసారిగా వదలు జలదరిస్తుంది. ఏమిటీ... సేవిస్తుడయిన శంకర్రావును పద్మ ప్రేమించిందా...! పద్మకు మతి కాని చెడ లేదుకదా. ఇటు అటు చూచి మందస్వరంతో,

"ఏమిటి లలితా!... ఇది నిజమే...!!..."

"అవునండీ... పాపం మీ యెదుట నిలుచుటకు భయపడి..."

"అయితే ఆ శంకర్రావుని... ఆ!..."

"అవునండీ... ఆ మెపూర్తిగా స్థిరపరచుకుంది..."

"ఆ!... అల్లాగా... ఈ సంగతు లేవీ నాకు తెలియవే... ఏదీ ఆవిడ్ని ఒక్కసారి పిలు..."

లలిత వెంటనే అక్కడనుండి కదలిపోయి మరుక్షణంలో మళ్ళా లక్ష్మీబాయితో ప్రవేశిస్తుంది. కూడాగా పద్మ అక్కడుండడ మిష్టపడక పక్కగదిలోనికిపోయి తలుపుదగ్గరనిలచి ఇవతలనున్న వారిసంభాషణ జాగ్రత్తగా ఆతురతతో వింటూవుంటుంది. లక్ష్మీబాయమ్మగారు రాగానే జడ్జీగారు ఆమెను దగ్గరగాపిలిచి,

"ఏమిటే...నువ్వువిన్నావా...?"

"ఏమిటని...ఏమిటివినడం...?"

"పద్మవిషయం..."

లక్ష్మీబాయమ్మగారు ఆశ్చర్యపోతుంది. పద్మవిషయమంత గూఢంగామాట్లాడుకోనవలసినంత విశేషం ఏంజరిగిందా అన్న అనుమానం ఎక్కువయింది. ఎట్లాటిపరిచూడదకరమయిన విషయం తన భర్త చెప్పబోతున్నాడో అని దిగులుతో.

"పద్మవిషయమా!...ఆ!...ఏదీపద్మ...?"

"లోపలవుంది లే...నెమ్మదిగామాట్లాడు..."

"ఏంజరిగింది...?"

"ఆశంకరరావు...అదే వెంకటేశన్ కేసులో ముద్దాయిని పెళ్ళిచేసుకుంటానని చెప్పిందట లలితతో..."

"ఆ...! ఆమర్యాదస్తుణ్ణా...అయ్యో!...అయ్యో!...అదేం పని...ఏదీఎక్కడుందీ..."

"లోపలవుందండీపిన్నిగారూ..."

"పద్మా!...ప..."

"వస్తుందిలెండి..."

"అయ్యో! ఇ దేం బు ద్ధి దీ ని కి...మరీజ్ఞానంలేకుండా పోతోంది..."

"అది...ఆమెతప్పకాదండీ...పిన్నగారూ" అన్నది ఆశ్చర్యంతో నెమ్మదిగా లలిత.

"అయితే మరింకెవరిదీ...కూడా...లేక ఆసృష్టించిన ఆ దేముడుదా...?"

"ఆమె చాలా కాలంనుంచివానిపై దృష్టి పెట్టుకునివుందండీ..." జడ్జిగారు కొంచం గాయిపడి.

"ఆ!...అల్లాగా!...ఎప్పుడూ కొంచమయినా తెలియు లేదే...ఎంతగూఢం...?"

"ఇందులో గూఢానికేముందండీ...పాపం ఎప్పటికప్పుడే తన అభిప్రాయం మీతో చెప్పదామనుకుని ధైర్యంచాలకవూరుకుంది..." దాంతో లక్ష్మీబాయమ్మగారందుకుని విసుగ్గా సాదిస్తూ.

"తెలిసినమాత్రంఏం చెయ్యాలి...ఇదుగో ఇప్పుడు తెలిసింది కా చెయ్యండి...ఏంచేస్తారో"

"అదికాదునా వుద్దేశ్యం... నీచెప్పేదిపినవు...పైగా రుసరుస లాడతావు..."

"మధ్యనా కెందుకీ కష్టారం... నే నేమీ మాటలాడను...మీరే కానివ్వండి...ఏంచేస్తారో..."

"అబ్బా! ఎప్పుడూగొడవే వేసీతోటి...అసలు అమ్మాయి నడుగుదాం...ఏమంటు మేమిటో..."

"ఆ...ఏమీ అడగనక్కర్లేదు...ఈచనువంతా మీరిచ్చిందే...లేకపోతే"

"నేనిచ్చే దేమిటి నువ్వేవ్వలేదూ...ఇంతకూ అసలువిషయం వదలివేసి మనంమాట్లాడుకుం టేఎల్లాగ...కా స్తశాంతపడు..."

"నే నేంపోట్లాడడం లేదు......మీరే పిలిచి పేచీమొదలు పెట్టారు..."

"అబ్బబ్బా! ఒక టేగోల... మాటూ కాస్త స్థిమితపడి నామాటవిందూ..."

"వింటూనేవున్నాను గా... చెప్పండి... ఏమిటో..."

ఇదంతా చిత్రంగా చూస్తూ కూర్చునివున్న లలితవంక తిరిగి జడ్జీగారు కొంచం హేళనపూర్వకంగా నవ్వుతూ.

"చూశావా అమ్మా! లలితా... మీపిన్నమ్మ సంగతి... ఆమె ముందు నిలబడి వాదించడానికి ఏలాయర్లూ పనికిరారు... నూటు ఎల్లా ఝణఝణలాడిస్తోందో... కోర్టులో ఎల్లాంటి చిక్కువిషయాన్నయినా గుర్తించి వాదించగలను గాని మీపిన్నమ్మతో మాత్రం వాదించడం చాలాకష్టంగావుంది..." దాంతో లక్ష్మీబాయమ్మగారికి రోషం వచ్చింది. క్రోధంతో అభిమానపడి.

"పాపం... ఏంచేస్తారూ... ఎల్లాగో కష్టపడి మీరు భరిస్తున్నారు లేకపోతే..."

"కాదుమరీ... సరేకాని... ఈనగోల ఇల్లావుండేగే... పద్మను పిలిచి నెమ్మదిగా ఆమె వుద్దేశం తెలుసుకో... కాని నాదగ్గర చూపించిన తీవ్రింమాత్రంచూపించకు... పాపంచిన్నపిల్ల... ఆగలేదు..."

"చూడమ్మా... మాను... మీబాబయ్యగారు ఎల్లావణుకు తున్నారో నానుంచి. అంత వేళాకోళంగావుంది నామాటంటే..."

అని లక్ష్మీబాయమ్మగారు ఎకసక్కెంగా అనేసరికి లలిత కలుగచేసుకున్నది. అసలు సంగతివదలివేసి అనవసరపు గొడవ పెంచడమెందుకని.

"అబ్బే! బాబయ్యగారు అల్లా అనలేదండీ... ఏదో కొంచం..."

"సరి... ఇంకేం... నువ్వుకూడా కలిశావ్గా... వారితో"

"లేకపోతే నీయెదుట నిలువగలమా...?"

"హూం! అల్లాగుంది నామాటంటే... సరేలెండి..."

అంటూ రుసరుసలాడుకుంటూ చిన్నగా క్రిందకు వెళ్ళి పోతుంది లక్ష్మీబాయమ్మ. జడ్జీగారు ఒక పెద్దనిట్టూర్పువిడచి.

"అమ్మయ్య!...తగ్గింది గాలివాన..."

"అమాయకత్వమండీ...హూ పిన్నిగారిదంతానూ..."

"ఊ...అయితే లలితా!...అసలువిషయంఏమిటో చెప్పు... సవిస్తరంగా..."

"ఏముందండీ చెప్పడానికి...అసలు మొదటినుంచీ వానినే పెళ్ళాడాలని నిశ్చయించుకుంది...దాంతో అతడు నేరస్థుడు కాడని వాదిస్తుంది...చివరకు పిచ్చికూడా ఎత్తేటట్లుంది..."

"నీవుద్దేశమేమిటి...?"

"నాకుకూడా...అతడు నిర్దోషేఅయివుంటాడనితోస్తుంది... మరినిజం దేముడెరుగును..."

"అయితే అసలు అతడెల్లాంటిమనిషంటావ్..."

"చాలామంచివాడండీ ... అనవసరంగా ఏవిషయంలోనూ కలుగచేసుకోడు..."

"మరియిదేమి టీగొడవ...?"

"అదేవచ్చిన చిక్కు...అఖరుకు చిన్నరాఘవరావుగారింటికి కూడా వెళ్ళాం...కానీఏమీలాభించింది కాదు..."

"మరేమిటిసాధనం...నాకేమీ పాలుపోవడంలేదు...ఇంకా నయం, ఎల్లుండిబయల్దేరి వెళ్ళి పెళ్ళిసంబంధం స్థిరపరచి వద్దామను కుంటున్నాను...ముందే తెలిసి ది భగవంతుని దయవలన..."

"నాకొక్కటితోచిందండీ...బాబయ్యగారూ..."

"ఏమిటమ్మా అది...?"

"మనమే రహస్యంగా శంకరావు ఆచూకీతీస్తే ... బాగుం టుందేమోనని..."

“అనిపించిందే...కాని...దానికి ఏదిసాధనమా అని ఆలోచిస్తున్నా...”

“పోలీసువనమే ఒక ‘C.I.D.’ని పెట్టి వెతికిస్తే...!

“భేష్! ... బాగాచెప్పావు ... చిన్నపిల్లవయినా సమయస్ఫూర్తిగలదానవు...అయితే...”

“ఇంకాఆలోచన దేనికి:...”

“అభ్యంతరేంలేదుకాని...వానికి ఆనవాలు ఇవ్వడమెల్లాగ అని...ఆ!...అన్నట్లుపేపరులో వానిబొమ్మ వేశారుగా...”

“అవునులెండి ... కావాలంటే మాయింట్లో కూడా వుంది, మా అన్నయ్యఅతనుకలిసి తీయించుకున్నారు. మొన్నటెన్నిస్‌లో నెగ్గినప్పుడు...”

“అయినా ఎందుకయినావుంటుంది వెళ్ళిపట్టుకురా...వీధిలో కారుంది...”

లలిత వెంటనేబయల్దేరి వెడుతుంది. వీధిలోవున్న జడ్జీగారి కారుమీద త్వరితంగా యిల్లుచేరుతుంది. ఈలోగా జడ్జీగారు ఆయనకు బాగుగా తెలిసివున్న అనుభవనీయుడగు డిటెక్టివ్ నాధ్‌ను ఫోనులో పిలుస్తారు. నాధ్‌కు సుమారు ముప్పదియేండ్ల వయసుండును. మిక్కిలి బుద్ధికుశలతగలవాడు. అనేకమగు దుర్భేద్యమగు నేరములను భేదించి ప్రభుత్వ మన్ననల నందుకొన్నవాడు.

“మరియొక్క అరగంటకు నాధ్‌వచ్చినాడు. జడ్జీగారికినమస్కరించినాడు.

“నమస్కారమండీ...”

“ఆ! నమస్కారం...వచ్చా...రా...కూర్చోవోయ్!”

“చిత్తం!...ఏమిటండీవిశేషం...పిలిచారు...”

"అంతా ఓ కేసమే... నీకు పెద్దపని తగిలింది... నిపుణతతో పని చెయ్యాలి..."

"ఏమిటండది...!"

"చెప్తా!... ఇల్లాదగ్గరగారా... నాన్, దగ్గరగావచ్చి కూర్చున్నపిదప జగ్గీగారు నలువంకలచూచి నెమ్మదిగా 'నాన్' తో సంభాషింప మొదలుపెడతారు. ఈవిషయాలన్నీ ప్రక్కగదిలోనున్న పద్మ అతిశ్రద్ధగా వింటూనేవుంది.

"నాకూ... లాయర్ రాఘవరావు బావమరిది శంకర్రావు."

"అవును వెంకటేశన్ మర్డర్ కేసులోఉన్నాడుగా... వాని జాడలు తియ్యడానికి మనడిటెక్టివ్ సుందరంగారిని అప్పుడే నియమించారే..."

"ఆ!... అల్లగా.... నువ్వుఇప్పుడు రహస్యంగా వానిని వెతికి జాడలుతియ్యాలి..."

"వాని జాడకనుక్కోవాలా!... సుందరంగారికికాంపిటీషనా,"

"అల్లాగేఅనుకో... కాని చాలాజాగ్రత్తసుమా... చాలా రహస్యంగా ప్రవర్తించాలి. ఎక్కడున్నసరే... ఎంతడబ్బు కావాలన్నా నేనిస్తాను... నేనునీకు వేరే ఒక అథారిటీ లెటర్ కూడా యిస్తాను. జాగ్రత్తగా సాధ్యమయినంత త్వరలో కూపీతియ్యాలి.."

"ముద్దాయి శంకర్రావును గురించి ఈయన ఇంతశ్రద్ధ ఎందుకు చూపుతున్నది 'నాన్' కుఅర్థంకాలేదు. పద్మమాత్రము బ్రహ్మానందపడింది ఆమాటలువిని. సరే ఏమయినా శంకర్రావుజాడతీయ నిశ్చయించుకుని,

"తప్పక ప్రయత్నిస్తానండీ... ఇతంకూ అతనిబంధువు లెక్కడున్నారో మీకేమయినా తెలుసా..."

"నాకేం తెలియదే..." అని ఆయన యోచిస్తూండే సమయంలో లలిత ఫోటో పట్టుకొనిస్తుంది. అది జడ్జి వీరరాఘవరావుగారందుకొని 'నాథ్' కిస్తూ.

"ఇదుగో వానిఫోటో. ఈమె కేమయినా వాని బంధుగుల సంగతి తెలియవచ్చు..."

"మీకు... ఈశంకర్రావు బంధుగులెక్కడెక్కడున్నారో ఏమయినా తెలుసునా అమ్మా!"

"ఊళ్ళో లాయర్ రాఘవరావుగారు వానిబావగారే... తల్లీ తండ్రీ గుంటూరులో వున్నారట... కానీ అతనక్కడా ఉండి ఉండడు..."

"సరే ప్రయత్నిస్తానండీ... శక్తివంచన లేకుండా... ఇవాళే బయల్దేరుతాను దేవునిపై భారం వేసి—"

"శుభం! వెళ్ళిరానాయనా...అతిజాగ్రత్తగా సాధ్యమయినంత్వరలో తెలుసుకోవాలి సుమా. ఇంద... ప్రస్తుత మీరెండు వందలూ ఖర్చులకు తీసుకుని వెళ్ళు..."

నాథ్, ఆసొమ్ము పుచ్చుకొని జడ్జీగారిచ్చిన వుత్తరంకూడా పుచ్చుకొని వెళ్ళడానికి లేస్తాడు.

"శలవు వస్తానుసార్ !'

"మంచిది...త్వరగా కార్యంసాధించుకురా..."

నాథ్ వెళ్ళిపోతాడు. వెంటనే ప్రక్కగదిలోని పద్మకూడా క్రిందకు వెళ్ళిపోతుంది. నాథ్‌కు కార్యం నియోగించడమయినాక లలితతో కలసి జడ్జీగారు క్రిందకువస్తారు. క్రింద పద్మ సావిడిలో కూర్చుని ఏదోపుస్తకం తిరుగవేస్తూ తండ్రిని లలితను చూడగానే కంగారుపడి లేస్తుంది; చిరునవ్వుతూ లలిత ఆమెనెంతో ఆదరణగా పలుకరిస్తుంది.

"ఏంచేస్తున్నావు పద్మా! ఇక్కడ...నన్ను మేడమీదకూర్చొబెట్టి—"

లలితముఖంలోకిచూచి సిగ్గుతో తలక్రిందకు దించుకుంటుంది. పాపం తండ్రిముఖమువంక చూచుటకు ధైర్యచాలక ముక్తసరిగా.

"ఏమీలేదు..."

"వెర్రిపిల్లా! ఎందుకమ్మా అంతసిగ్గుపడతావు...? మీఅమ్మ ఏమందినీతో..."

అప్పుడే లక్ష్మీబాయమ్మ ఆపక్క గదిలోనుంచి వస్తావుంటుంది.

"ఇదుగో...మళ్ళీవచ్చారూ...ఎంతఅడిగినా నాకేమీసరిగా చెప్పడంలేదు...అదేమిటో మీరేకనుక్కోండి. నాకు తెలియదు బాబూ! ఆగోల..."

"ఇంతేనా నీచాకచక్యం..."

"ఆ! అంతే...మీచేతుల్లోపడ్డాక ఇంకెంతఅవుతుంది...?"

రుసరుసలాడుకొంటూ అక్కడనుండి వెళ్ళిపోతుందిఆవిడ.

"చూశావమ్మాపద్మా! నాతోనే నువ్వెందుకు చెప్పావు కావు అంతభయమెందుకునీకు...నీమాట ఎప్పుడయినా కాదన్నానా..."
పద్మకళ్ళలో నీళ్ళు గిర్రునతిరుగుతాయి.

"అదికాదండినాన్నగారు. నావుద్దేశం... చెప్పడానికి..."

"పిచ్చిదానా! కళ్ళనీళ్లెందుకుపెట్టుకుంటావు...నువ్వుకోరింది ఎప్పుడయినా కాదన్నానాచెప్పు..."

పద్మ ఆశగాతండ్రివంక ఒకసారిచూచి మరల ముఖంక్రిందకు దించుకుంటుంది. ఆమె అమాయకత్వానికి పాపంజాలికలిగింది జడ్జీగారికి. వెంటనే లలిత చిరుమందహాసంచేస్తూ దగ్గరగావచ్చి ఆమెచెయ్యిపట్టుకుని.

"ఇంకెందుకులే...నీకోరికేసిద్ధించింది..."

"ఇప్పుడేదొక "C. I. D"ని నియమించి సాధ్యమయినంత త్వరలో రహస్యంగా వానిజాడలు తెలుసుకు గమ్మునివుండేను... త్వరలోనే తెలుస్తుందికబురు... కాని ఎక్కడా నాకుమాత్రం నోరుజార్చి అనకు, కొంపమునుగుతుంది..."

పద్మకు పట్టరాని ఆనందం కలిగింది. నిజంగా తన తండ్రియొక్క దయార్ద్రహృదయం ఆమెకు స్ఫురింపకల్గింది. వ్యవహారమంతా అంతవరకు సుముఖంగా నడచినందుకు లలితకూడా లోలోన చాలాసంతోషించింది. ఈ త్యాగంలో పద్మ చేయిపట్టునని.

"సరే... ఇంక ఆలోచిస్తావేమిటి...? ఇవాళ లీలయింటికి వెళ్ళాలి జ్ఞాపకంలేదూ..."

"అవును నాన్నా... ఇవాళ మంగళవారమేగా... లీలపుట్టినరోజు పెందరాళేవచ్చెయ్యమని మరీమరీచెప్పింది... ఇవాళ మా స్నేహితురాలింటికి భోజనానికి వెడుతున్నానండీ..."

"అల్లాగా... మీఅమ్మతో చెప్పావా... అదుగో ఆవిడఇల్లాగే వస్తోంది..."

లక్ష్మీబాయమ్మ వస్తుంది. ఆమెకు సూటి జడ్జీగారు కనుబొమ లెగురవేస్తూ.

"ఏదో స్నేహితురాలింటికి విందుకు వెడుతుందటపద్మ..."

"అవును నిన్ననే చెప్పింది... వెళ్ళమన్నాను..."

"ఇంకేం... అసలు రావలసినచోటినుండే అనుజ్ఞవచ్చింది... వెళ్ళిరండి..."

"మీరుండగా మధ్య నేచెప్పేదేమిటి...?"

"అయితే మీకోసం కారువీధిలోనేవుందినాన్నగారూ..."

"ఇప్పుడెక్కడకూ వెళ్ళనవసరంలేదని చెప్పెయ్యమ్మా! అదుగో ఆపడ అన్నగారువచ్చాడుట ఉండమని శాసించాడు... ఉండకపోతే భోజనంబంద్..."

అతిదీనంగా అభినయిస్తూ అన్న జడ్జీగారిమాటలకు చాలా కోపంవచ్చింది లక్ష్మీబాయమ్మగారికి.

"అబ్బ! వంటఇంటికిపోతున్నారండీ. మూడాళ్ళంటేను... అంత వేళాకోళంగా వుందన్నమాట..."

"అబ్బే నేనన్నానా...మీవాళ్ళసంగతి నేనెరుగనూ—"

లలితపద్మలు అచ్చటనుండి వెళ్ళిపోతారు. లక్ష్మీబాయమ్మగారు ఇంచుక గొంతుక పెద్దదిచేసి,

"హూం!......అంతఇదేమిటీ... పైవాళ్ళున్నారనయినా చూడకుండానూ..."

"చిన్నపిల్ల...పైగా క్రొత్తదా యేమిటి...ఏదోపోనిద్దూ... ఆ!......అన్నట్లు అసలువిషయమేమరచాను ...... బట్టలు రేపు పుదయాన్నే తెస్తానన్నాడుచీరలు..."

దాంతో లక్ష్మీబాయమ్మగారికి ముఖంవికసిస్తుంది. ఆత్రుతగా సమీపమునకువచ్చి,

"ఆ! తెస్తున్నారా...అన్నిరకాలు తెస్తున్నారా..."

"ఆహా!...అన్ని తెస్తున్నాను ... వాడిసామానంతా పట్టుకొచ్చెయ్యమన్నాను. ఇంకా ఏమయినావుంటే అవికూడా తెచ్చివేయమన్నాను...సరా!"

"చాల్లెద్దురూ...రానురాను మరీచిన్నపిల్లవాడిలా అయిపోతున్నారు..."

"సరేలేకాని చూడూ...నీఅన్నయ్యవస్తే మళ్లాఎక్కడకూ పోవద్దనిచెప్పు ... ఒకఅరగంటలోవస్తాను ... నాలుగురోజులుండి వెళ్ళమను..."

అంటూ లేచి జడ్జీగారు వెళ్ళిపోతారు. లక్ష్మీకాంతమ్మలోనికి పనిమీద వెళ్ళిపోతుంది.

ఎనిమిదవ ప్రకరణము సమాప్తము.

*　　*　　*

## తొమ్మిదవ ప్రకరణము

విజయనగరంలో ఆనందరావిల్లు. సాయంకాలము మూడు న్నరగంటలు దాటుతుంది సమయం. ఎండ తీవ్రిమించుక మందగిస్తూ వుంటుంది. మేడమీద గదిలో చెరియొక సోఫాలో కూర్చుని ఏమేమో సంభాషిస్తూవుంటారు ఆనందరావు ప్రభాకరరావులు. ఇప్పుడు ప్రభాకరరావు పూర్తిగా మారిపోయాడు. ఆనవాలు పట్టుటకూడ చాలా కష్టం. వేషంకూడా చాలామారిపోయింది. పెద్దగడ్డము, మీసము, కంటికిజోడు. ఎంతపరిచయస్తుడయినా సులభంగా ఆన మాలుపట్టలేడు. కమల తేనీరుపట్టుకురావడానికి వెళ్లింది. కమలతో ప్రభాకర్ స్నేహం పూర్వంకన్నా బలబడింది.

“ఏమిటోయిఆనంద్ ! ఎంతకాలమిల్లాగ సిగుద్యోగినై... అజ్ఞాతవాసంగడపడం చెప్పు...”

“సత్యం బయల్పడేదాకా...”

“అసలది ఎన్నటికయినా బయల్పడదనుకుంటూవుంటుంటా అని...”

“ఏమిటోయ్ నీకీవెర్రి...నోరునొక్కాయుగలము కాని లోకాన్ని మాయగలమా...నిజం ఎంతకాలమని కప్పిపెట్టగలరు...ఎన్నటి కయినా నిలకడమీద బయల్పడకపోదు...”

“కాని చాలినల్ల ప్రమాదంవున్నదికదామరి...”

"ఎవరికి...?...మా బావకేనా...!"

"కాదా మరి..."

"దానికి నువ్వేం చేయగలవ్...ఎప్పటికయినా ఆవిషయం నలుగురకు తెలియకపోదుకదా..."

"మరిఅల్లాటిబాధ వానికిలేకుండా వుండేటందుకేకదా నేనీ అపవాదు భరిస్తున్నది..."

"నిజమే...కాని లోకమంతా నీవంటిబుద్ధిమంతులతో నిండి లేదు...కాకున్నా తప్పుచేసినవాడు శిక్షపొందుటధర్మం...అదిఎప్పటి కయినా నెరవేరకతీరదు..."

"అయితే...ఈనాశ్రమఅంతా వృథాయేనా..."

"అట్లనిపూర్తిగా చెప్పడానికీ వీలులేదు...చూడూ, జరిగిన విషయం బుద్ధిపూర్వకంగా చేసినదికాదు..."

"అవును...అతనికటువంటి వుద్దేశమేవున్నట్లులేదు..."

"దైవఘటన అల్లావుంది...దానికి ఎవరు ఎంతగా విచారించినా ఏమీ లాభంలేదు..."

"కాని అతడు బుద్ధిపూర్వకంగా చేయలేదుకదా అనే న్యాయం గమనిస్తుందా లోకం..."

"అల్లా గమనించేటట్లు మనబుద్ధికుశలత నుపయోగించి యత్నించాలి..."

"ఏమో నాకేమీ పాలుపోవడంలేదు... అక్కడవాళ్ళకేమయినా ప్రమాదం కలుగనున్నదేమో...పడినవాడు ఎల్లాగూపడింది ...నేనేఇప్పుడుపోయి కోర్టుకు హాజరయితే..."

"నువ్వా! బాగుంది ... ఇప్పుడు వెడతావా...? ఫలితం ఏమిటో తెలుసా..."

"ఆహా! నాకుశిక్ష...మాబావకు స్వేచ్ఛ..."

"హుం! నిజంగా నీది ధన్యజీవితమోయ్! కాని, నీ చావుతో విషయమంతా తేలిపోతుందా?... దానివల్ల నీ తల్లిదండ్రులకు ఎంతటి బాధ కలుగుతుందో గమనించావా...?"

"మరి ఇంకేమిటి చెయ్యడం... నేనే దోషినని అపవాదు పడి నది... నన్ను పట్టుకొనుటకు విశ్వప్రయత్నాలు చేస్తూనే వుంటారు... ఎప్పటికయినా వారిచేతికి దొరకక తప్పదు..."

"అందుకని ముందు ఏమో ప్రమాదం రానున్నదని ఇప్పుడే వురిపోసుకుంటావా... చచ్చి ఏం సాధిస్తావోయ్ వెర్రివాడా... కొంచెం స్థిమితపడు... వ్యవహారాలేమీ శృతిమించలేదు... ఏ మార్గానికి వస్తాయో రానీ... సమయానుకూలంగా తంటాలుపడదాం... ఇప్పుడు నీకు కల్గిన యిబ్బందేమిటి...?"

"నాకా యిబ్బంది... ఎంతమాట... ఎల్లా అనగలను...? అల్లాంటి కష్టసమయంలో... నేరస్థుడనని తెలిసిన తర్వాతకూడ ఆదరించి ఆశ్రయమిచ్చి కాపాడేవు... నీ ఋణం తీర్చుకోగలనా..."

"అంతకు వేయిరెట్లు తీర్చుకోగలవు... నీవు అధైర్యపడి మనస్సు పాడుచేసుకోకుండా వుంటే... గ్రహస్థితి బాగులేకపోతే ఏవో కొన్ని ఆటంకాలు రావడం సహజం... మళ్ళీ వాటంతటవే ఎల్లా వచ్చాయో అల్లాగే దాటుకుపోవడంకూడా వుంటుంది... మనమెంత వరకు చేయగలమో అంతా చేద్దాం... మీద దేవుడున్నాడు. ఇంతకూ విధివ్రాత తప్పదుగదా! మనం తలచినది ఒకటయితే జరిగేవిధానం వేరుగా వుంటూ ఉంటుంది... ఎన్ని అడ్డంకులు వచ్చినా ధైర్యంతో వాని నెదుర్కోవడం మనవిధి... ఇంతకూ ఆ వెంకటేశన్ దారుణమయిన ద్రోహాన్ని తలపెట్టాడు ప్రతిఫలం పొందాడు. ఇందులో నీ పాల తప్పుకూడా అంతగా లేదు... న్యాయం ఎన్నటికీ జయం పొందకపోదు.

అందుచేతనం ఓపికతో వచ్చేకష్టాన్ని ఎదుర్కొంటూ ధైర్యంతో భరించవలసిందే...!"

"నువ్వు చెప్పినదంతా బాగానేవుంది కాని... నేనిల్లా నిరుద్యోగినై మీయింట్లో ఊరికే కూర్చుని కాలంగడపడం నాకేచాలా చిన్నతనంగా వుంది... ఏదో ఆశ్రయమిచ్చారుకదా అని జీవితాంతం దాకా పాతుకుపోవడం..."

"పరవాలేదులే... చిన్నతనానికి పెద్దతనానికి ... ఇది విమర్శించే సమయం కాదు. అవసరాలనుబట్టి మనం వ్యవహరించుకుంటూ వుండాలి. ఏదయినా కష్టంకల్గినప్పుడే ఇతరులసాయం కోరేది. అంత మాత్రంచేత శక్తిగలిగివుండి ఆశ్రయమివ్వనూవచ్చు...పుచ్చుకోనూ వచ్చును. ఏదో దేవుడిదయవల్ల ఇంతటిదానికి ఉండబట్టేనీకు ఆశ్రయమివ్వగలిగాము కాని...అదికూడ లేక పూటకు గతిలేనివాడేమి ఈయగలడు?...కాకపోయినా ఇతరుల కష్టములను గుర్తించే విషయంలో బీదాసాదా అను వ్యత్యాసము ఎన్నటికీ గుర్తించబడదు. కాబట్టి...ఏమిటో వెర్రిఆలోచనలతో మనస్సు పాడుచేసుకోకు... నామాటవిని కొంచంస్థిమితపడు..."

"ఊరికే సోమరిపోతులా ఇంటివద్ద వుండడంకన్న ఏదయినా వుద్యోగం..."

"నీకీస్థితిలో వుద్యోగమా ... ఇంటిదగ్గరుండకపోతే ఇల్లాంటి పరిస్థితులలో రచ్చకెక్కుతావా మంచివాడవే ... ఇంతకాలంనుంచీ పడ్డశ్రమంతా గంగపాలైపోతూ...ఇప్పుడు ఉద్యోగంచేసి నీరసంపాదనతో ఎవర్నిపోషించాలి...? నామాటవిను ఉద్యోగంవద్దు...ఏమీ వద్దు కొన్నాళ్ళపాటు ఇంటిదగ్గరేవుండు..."

"ఇంతలోకి కమల ఫలహారాలు, తేనీరు తీసుకవస్తుంది. అక్కడ బల్లమీదపెట్టి వింతగా వాళ్ళిద్దరిముఖాలవంక చూస్తూ

వుంటుంది. ఇప్పుడు కమలకు ప్రభాకర్ మీద ఒక ప్రత్యేక అభి మానం ఏర్పడింది. అతడేమాత్రం కష్టపడినా ఆమెచూసి ఓర్వ లేదు. అతడెంతమాత్రము బాధపడినా ఆమెనుసస్సు కూడ విపరీత మయిన బాధపడుతుంది. ఆమెరాకను గ్రహించి ఆనంద్ ప్రభాకర్ లిద్దరూ సంభాషణ తగ్గించారు.

"ఏమిటన్నయ్యా! వాదించుకుంటున్నారు?..."

"అబ్బే! ఏంలేదు...ఇప్పుడేదయినా ఉద్యోగం చేస్తానంటా డు అతను...నెమ్మదిమీద చూసుకోవచ్చును ... తొందరపడవద్దం టాను నేను...అతనువినడు..."

"ఏమండీ...అంతఉద్యోగంచేసి డబ్బుతేకపోతే మీకిప్పుడు గడవడంలేదా..."

"నావుద్దేశం అదికాదు కమలా! ఉద్యోగం పురుషలక్షణం అన్నారు. అనవసరంగా సోమరిపోతులా కూర్చోవడ మెందుకని!"

"ఇప్పుడు అంతమాత్రంచేత స్త్రీలక్షణాలువస్తాయా ... అన్నయ్య చెప్పినమాట వినకూడదూ..."

"సరేలే ఏదోచేయవచ్చు...అన్నాచెల్లెలు యిద్దరూ ఏకమ య్యారు...నడవ్వోయిపోదాం..."

అందరూ ఫలహారములు తేనీరు పూర్తిచేశాక ఆనందరావు ప్రభాకరరావు దుస్తులు మార్చుకుని బయల్దేరి వీధిలోకి వెళ్ళిపోయా రు. కమల ఆలోచనలో పడింది. కమలకు మొదట్లో ప్రభాకర్ ఎవరో...తమయింటికి ఎందుకు వచ్చాడో ... తెలుసుకోవాలన్న కుతూహలం వుండేదికాని క్రమంగా అదిపూర్తిగా తొలగిపోయింది. అసలు ఇప్పుడావిషయమేకమల తలంపుకు రావడంలేదు. ఆవిషయం కదిపితే ప్రభాకర్ నుండి ఎక్కడ ఎడబాటు కల్గుతుందో అని ఆమె భయం. అతడు అసహ్యంగా ఆగడ్డం మీసం ఎందుకు పెంచుతున్నా

డో కూడా ఆమె తెలుసుకోడానికి సాహసించలేదు. అక్కడకీ ఏదో ఒకసారి అడిగితే మొక్కుబడివున్నదని చెప్పి తప్పించుకున్నాడు. ఆట్టే ప్రశ్నలువేసి వానిని కలతపెట్టడంకూడా ఆమెకిష్టం లేదు. కేవలం ఆమె ప్రభాకర్ దగ్గరవుంటే ఏమోవన్న భావనలవి కాని ఆనందాన్ని పొందుతూ అందులో సర్వం మైమరుస్తుంది.

త్రోవలో ఆనంద్ ప్రభాకర్‌లు వెనుకటి విషయమును గురించే కొలదిగా ప్రసంగించారు. చివరకు ఏదోవుద్యోగం ఆతను చేయనిశ్చయించుకున్నాడని గ్రహించాడు ఆనందరావు. ప్రస్తుతమతడున్న వేషభాషలలో వానిని తానేగుర్తించుట కష్టంగావుండడం చేత ఇతరులెవ్వరూ అసలే గుర్తుపట్టలేరని ధైర్యపడ్డాడు. త్రోవలో ప్రభాకరరావు ఆనంద్ దగ్గరగా నడుస్తూ,

"చూడు ఆనంద్! ఏమయినా ఇల్లాఊరికే ఇంటిదగ్గరకూర్చోడం ఏమీబాగా లేదు...అంచేత కొంతకాలక్షేపం జరుగుతుందని అన్నాను. నువ్వు మరోలా అనుకోకు. నామాటవిని ఎక్కడయినా"

ఆనందరావు తీవ్రమయిన ఆలోచనలో పడ్డాడు. కొంతసేపటికి తెప్పిరిల్లి,

"సరే...అయితే ప్రయత్నిద్దాం. రైల్వేలో టెంపరరీగా ఓరెండునెలలుపని చెయ్యి...సూర్యనారాయణగారిద్వారా కనుక్కుందాం"

"రైల్వేలోనా...అంటే...ఎక్కడ...?"

"అబ్బే...ఈవూళ్లోనే...ఎల్లుండి, బుకింగ్‌క్లర్కు శెలవుపెట్టి వెడుతున్నాడు. ఆ ఖాళీలో..."

"సరే...ఏదోఒకటి..."

ఈవిధంగా తమలోతాము అనేక విషయాలు చర్చించుకొంటూ పార్కుకువెళ్ళి అచ్చట చాలసేపటివరకు కూర్చుని, అప్పటికే రాత్రి ఎనిమిది గంటలు దాటుటంచేత నెమ్మదిగా లేచి ఇంటి

ముగిస్తారు. ఎనిమిదిన్నర కల్లా యింటికి రాగానే చంద్రశేఖరరావు గారు అప్పుడే భోజనం చేయడానికి వెళుతూవుండడంవల్ల వెంటనే బట్టలు మార్చుకొని భోజనాలకు వెళతానంటాడు. కమలకూడా అక్కడే కూర్చునివుంటుంది. వంటలక్క సీతమ్మగారు వడ్డిస్తూ వుంటుంది. కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేస్తూవుండగా కొంతసేపటికి కమల,

"నాన్నగారూ! ప్రభాకర్ ఉద్యోగం చేస్తాట్ట ... అన్నయ్య అంటున్నాడు..."

"ఏమోయ్...అవునా..."

"అవునండీ ... ఊరికే కూర్చుని ఏం చేస్తాడు...? అప్పుడే నేనువచ్చి నెల్లాళ్ళు కావస్తోంది..."

"నెలఅయినా ...ఆరు నెలలుఅయినా స్థిమితంమీద చూసుకుంటే ఏదయినా మంచిది దొరుకుతుంది కాని..."

"అవునులెండి...అందుకనే చూస్తున్నామని..."

"ఏక్కడయినా ఖాళీలున్నట్లు తెలిసిందా యేమిటి?..."

అందుపై ఆనందరావు అందుకొని,

"మనవూరు రైల్వేస్టేషన్‌లో బుకింగ్‌క్లర్కు శెలవుపెట్టాడు రెండునెలలు. మీరు వెళ్ళి కనుక్కొని అప్లికేషన్ పెట్టిస్తే రావచ్చు"

"అదిసరేకాని...అతడిప్పుడు ఈ రెండు నెలలుమాత్రం ఏమంత ముంచుకుపోయిందనీ చెయ్యడం..."

ప్రభాకర్ నిజస్థితిని అదివరకే ఆనందరావు విపులంగా తనతండ్రికి తెలియచెప్పాడు. అందుచే ప్రభాకర్ యొక్క పరిస్థితులను బాగా అర్థంచేసుకున్న చంద్రశేఖరరావుగారికి ప్రభాకర్ యొక్క ఉద్యోగధోరణి ఏమంతమంచిదిగా తోచలేదు. నలుగురిలోను తిరుగుతూ వుద్యోగం చేసేటప్పుడు తాను ఎన్నిమార్లు వేషాలు మార్చు

కుని జాగ్రత్తగా పుస్తకప్పటికీ. పరిశోధకుల దృష్టికి దూరమవడం కష్టసాధ్యం. ఇట్లతడు దొరికిపోతే తనశ్రమఅంతా బూడిద పోసిన పన్నీరగును. ఈ విధ గా తీవ్రంగా క్షణకాలం యోచించి ఏనిర్ణయమునకు రాలేక ఆనందరావువంక తీక్షణంగా చూస్తాడు చంద్రశేఖరరావుగారు కర్తవ్యమేమిటా అన్నట్లు. అదిగ్రహించి ఆనందరావించుక మందస్వరంతో.

"అదే నేను చెప్పేను...కాని అతను చేస్తానంటున్నాడు ... ఆ! అన్నట్లు చూడు కమలా! మేడమీద నాకోటలో ఒకవుత్తరముంది పట్టుకురా..."

"కమలకు ఏదో ఆవిధంగా పనికల్పించి సీతమ్మ అక్కడ లేకపోవడంచేత నెమ్మదిగా అండ్రితో.

"మాకు పేరుతోనే వుంటాము......"

ఆమాట ఆనంద్ నోటంటరాగానే ప్రభాకర్ విని తెల్లపోతాడు. తనయొక్క రహస్యవర్తనమంతా చంద్రశేఖరరావుగారికి తెలిసిందనిభావించి, తన్నుగురించి ఆయ నెట్లభిప్రాయపడ్డారో అనికొంచం సంకోచిస్తాడు. తెలతెలపోయిన ముఖంతో ఆనంద్ ముఖంవంక చూస్తూవున్న ప్రభాకర్ ముఖలక్షణాలను చూచిన చంద్రశేఖరరావుగారు కొంచంశాంతచిత్తంతో గంభీరంగా.

"నాకుఅంతా తెలుసునోయ్ ప్రభాకర్! అందు నీతప్పేమీ లేదు...బెంగపడకు—అనవసరపు యోచనలతో బుర్రపాడుచేసుకోకు...రోజులు తిన్నగా లేకపోతే ఇల్లాంటివి అనేకము వస్తూవుంటాయి... అయినా యోచించు ... నాకుతోచింది చెపుతున్నాను. మానెయ్యడంమంచిది...కాదని చేస్తానంటావా చెయ్యి ... బాగా యోచించుకో..."

చంద్రశేఖరరావుగారికికూడా తన సంగతి తెలియడంచేత తన్నుగురించి ఆయనకూడా చెడుగాతలుస్తారేమో అనుకున్నవాడి కిప్పుడు కొంత ధైర్యంకల్గిందికాని ఆయన కింతవరకూ తనసంగతి తెలుసునో. ఆనందరావు తండ్రికిపూర్తిగా చెప్పి వుంటాడా. ఏదిఏట్లా వున్నప్పటికి పరాయిగృహంలో అల్లా తను వాళ్ళసొమ్ము తింటూ సోమరిపోతులా కూర్చోవడం యిష్టంలేకపోయింది. తనమనస్సు కష్టపెట్టుకుంట కిష్టంలేక వాళ్ళపైకి ఏమీఅనకపోయినా లోలోన ఏమనుకుంటున్నారో! ఏదో పనిమీద వచ్చానని చెప్పానుకమలతో. ఏదోపనిమీద వచ్చినవాడయితే పనితీరినవెనుక వెళ్ళిపోకుండా వుంటాడా. అప్పుడే తానువచ్చి నెలదాటింది. తనప్రవర్తన ఏమీ బాగులేదనుకున్నాడు. కష్టకాలంలో ఆదరించి ఆశ్రయమిచ్చిన ఆనందరావుమాట తోసివేయజాలక అక్కడేవున్నాడు ఇన్నాళ్లూ ఏదోవిధంగా ఆనందరావుమేలుకు కృతజ్ఞతను వెల్లడిచెయ్యాలనిభావించాడు. అయితే తాను ఉద్యోగంచేసి సంపాదించిన డబ్బు ఆనంద్ స్వీకరిస్తాడా. ఆనంద్ తనడబ్బుకు ఆశపడి తనకాశ్రయమిచ్చాడా... లేదు. అతనివంటి ఉదారస్వభావుడు మహోపకారి మరియొకడుండబోడు. తనయోచన సంకుచితమైనదని గ్రహించాడు. ఏమయినప్పటికి దైవసంకల్పమా యన్నట్లు ఉద్యోగము చేయవలెననెడి పట్టుదల తనలో సడలలేదు. పూర్తినిశ్చయంతో.

"ఫర్వాలేదండీ ... చేస్తాను ... ఊరికే యింటివద్దవుండడం బాగాలేదు..."

"......సరే...అప్లికేషన్ రాయి ... రేపు స్టేషన్కువెళ్ళి ప్రయత్నంచేద్దాం......"

ఈలోగా కమలమ్మ వస్తుంది...అదే సమయానికి సీతమ్మగారు కూడా పదార్థంపట్టుకుని వడ్డనకువస్తుంది. కమల కంగారుగా అన్నగారివద్దకువచ్చి సంకోచంతో

"అన్నయ్యా!...నాకెక్కడా అగుపించలేదే ... ఏ జేబులో పెట్టావు...?"

"మరచిపోయి చెప్పానులే...అది నా పుస్తకాలలోనే పెట్టాను. ...నేను తీసుకుంటానులే......"

"ఎక్కడనుండి అన్నయ్యా వుత్తరం...?"

"అబ్బే...స్నేహితుడి దగ్గరనుండీ లే..."

ఇంతలోకీ వారివారి భోజనాలు చేయడం పూర్తిఅవుతుంది. అంతాఎవరిపనులకు వారు లేచివెళ్ళిపోతారు. ఆకలిలేకపోవుటచే కమల ఆపూట కొంచంపాలుతాగి పూరుకుంది. సీతమ్మకూడ భోజనంచేసి ఇల్లుచక్కబెట్టుకొని వెళ్ళిపోతుంది.

మర్నాడుపొద్దుట ఎనిమిదిగంటలసమయం. మేడమీద సావిడిలో ఆనందరావు ప్రభాకరంపు చంద్రశేఖరరావుగార్లు ముగ్గురూ కూర్చుని తమలోతా మేదిమో సంభాషించుకుంటూ వుంటారు. కొంచంసేపటికి కమల కాఫీఫలహారాలుపట్టుకుని అక్కడ ప్రత్యక్షమవుతుంది. అంతా కులాసాకబుర్లు చెప్పుకుంటూ ఫలహారాలు ఆరగిస్తూవుంటారు. ఇంతలోకీ క్రిందనుండి సీతమ్మగారు పిలుస్తుంది.

"అమ్మా! కమలమ్మా!..."

కమల వరండాలోకివెళ్ళి క్రిందనున్న సీతమ్మగారినిచూసి.

"ఏమమ్మా ..పిలిచావు...ఏం...?"

"బాబుగారికోసం ఎవరోవచ్చారని చెప్పు..."

"ఎవరావచ్చింది...కూర్చోమను..."

"ఎవరో బంట్రోతులావున్నాడు..."

ఆమాటవినికమల లోపలకువచ్చి తండ్రితో.

"మీకోసం ఎవరోబంట్రోతువచ్చాడుటండీనాన్నగారూ..."

"చాకోసమా...సరే మీరు కాఫీలు తాగిరండి వస్తాను..."

చంద్రశేఖరరావుగారు క్రిందకువెడతారు. అక్కడఒకవ్యక్తి భయభక్తులతో నిలబడివుంటాడు. ఆవ్యక్తికి సుమారొక ముప్పై వత్సరములవయస్సుంటుంది. సామాన్యంగావున్నాడు. వానిఆకార లక్షణాలనుబట్టిచూస్తే ఏదో దీనదశలో వున్నట్లు తోస్తోంది. అతడు రెండు చేతులను కట్టుకుని వున్నాడు. సామాన్యమయిన దుస్తులు, అక్కడక్కడ చినిగివున్నవి ధరించి వున్నాడు. తలకు ఓగుడ్డపాగా చుట్టుకుని వినయాన్నిప్రకటిస్తూ నిలువబడివున్నాడు. చంద్రశేఖర రావుగారినిచూడగానే రెండుచేతలూయెత్తి నమస్కరించాడు వినయంగా.

"దండాలుబాబయ్యా !..."

"ఏం...? ఎవరునువ్వు ?"

"చిత్తం...బాబూ ! నాదిరాజమండ్రీబాబూ ! తిండానికి తిండిలేక మలమలమాడిపోతూ ఇక్కామీపాదాలదగ్గరకొచ్చి పడ్డానండి బాబయ్యా ! ధర్మప్రభువులురక్షించాలి...దయచూపి ఏదయినా నౌకరీయిప్పిస్తే..."

"ఏంపనిచేస్తావ్...?"

"చిత్తం...అన్నిచేయగలనుబాబయ్యా ! తమదయ ఏపని సేస్తే ఆపనల్లాచేస్తాను..."

"నీపేరు..."

"నాపేరు అప్పన్నంటారండి...ఆదోళ్ళనత్తారింటికాడ దిగ యిడిసి ఇల్లాపొట్టచేత్తో పట్టుకుని దేశాలంట పడ్డానుబాబయ్యా !"

చంద్రశేఖరరావుగారు క్షణకాలంయోచించారు. తమ యింట్లోచాలాకాలంపనిచేసిన రామన్నఅనేవాడు పాపంపెద్దవాడయి పోయాడు. ఇంక పనిచెయ్యలేక ఊరుకున్నాడు. ప్రస్తుతం నౌకరు

అవుసరమే. పాపం ఏదో ఈ అప్పన్న ఒకడు సమయానికిట్లా వచ్చాడు. వాడు చాలా దీనదశలో వున్నట్లున్నాడు. అందుచేత వానికి తనయింట్లో బంట్రోతుపని ఇవ్వదలచి ఆ విషయమై ఆనంద్‌కు కూడా చెప్పాలమని కమలను పిలిచినారు చంద్రశేఖర రావుగారు.

"కమలా !...కమలా !!"

"ఆ ! వస్తున్నానండీ..."

మరుక్షణంలో కమల వస్తుంది. అప్పన్న వంక తీవ్రంగా చూచి.

"ఏం నాన్నగారూ...ఎందుకు పిలిచారూ..."

"అన్నయ్యనొకసారు పిలమ్మా!..."

కమల వెళ్ళి మరల ఆనంద్‌తో ప్రవేశిస్తుంది. వారి వెనకనే వస్తాడు ప్రభాకర్. ప్రభాకర్‌ను దూరంనుంచే చూస్తాడు అప్పన్న. ఎందుచేతనోగాని వానిని పలుసార్లు పరకాయిస్తాడు. ఆనంద్ రాగానే వానితో.

"చూడు...ఆనంద్! వీడెవడో పాపం చాలా దూరంనుంచి వచ్చాడుట. నౌకరీ కావాలంటున్నాడు...మనయింట్లో కూడా ఎవ్వరూ లేరు పెట్టుకుందామా...?"

అప్పన్నకు మనస్సులో ఆశ కల్గింది. తనకక్కడ స్థానం దొరుకుతుంది కదా అని లోలోన సంతసించాడు. ఆనంద్ అప్పన్న వంక తీవ్రంగా చూచి.

"అల్లాగా...ఏవూరోయ్ నీది...? నీపేరెవరు...?"

"రాజమండ్రం బాబూ ! నాపేరు అప్పన్నండి...ధర్మ ప్రభువులు కనికరించాలి..."

"జాగ్రత్తగా చేయగలవా ... పని ... బజారు పనులు చేయగలవా...?"

"అన్నీ చేయగలను బాబూ !...అయినోతరగతిసది నేను..."

"అయితే...ఏమిమ్మంటావ్...?"

"కడుపురోజులు బాబూ ... పొట్టగడవక్ చ్చాను...తమకు తెలియందేటుంది బాబూ...తమదయ..."

"సరే ఇరవై రూపాయలిస్తారులే... రేపటినుండిపనిలోకిరా నీబసెక్కడ...?"

"నాకెక్కడా లేదు బాబూ...ఈవూరొచ్చి రెండురోజులయింది బాబూ...సంత్రంలో పడుకున్నాంటున్నా బాబూ పొద్దస్తమానం ఊళ్లో నాకరీకోసంతిరిగి... ఇగోమేళ లేచి నేళమంచిది ధర్మప్రభువులు కనికరించారు..."

"అయితే నీసామానేదయినావుంటే పట్టుకుని రేపిక్కడికే వచ్చెయ్యి...వెనకాలపాకలో వుండువుగాని ..."

"చిత్తం...చిత్తం!! బాబయ్యా !"

"సరే వెళ్ళు ... రేపుప్రొద్దుటే రా..." అన్నారు చంద్రశేఖరరావుగారు.

"దండాలు బాబూ ! రేపు కోడికూతేళకే లెగిసొచ్చేస్తా..."

అని చంద్రశేఖరరావుగారికి ఆనంద్ ప్రభాకర్‌లకు నమస్కరించి మరలఎందుకో ఒకసారి ప్రభాకర్ వంక పరిశీలనగా చూచి నెమ్మదిగా వెళ్ళిపోతాడు. వీరుకూడా లోనికి తమపనిమీదవెళ్ళిపోతారు. ఆమరునాటినుండీ అప్పన్న చంద్రశేఖరరావుగారింట్లో మిక్కిలిశ్రద్ధాభక్తులతోను, విశ్వాసపాత్రంగాను తనవిధి తాను నిర్వర్తించుకుంటూ నౌఖరీచేస్తున్నాడు.

తొమ్మిదవ ప్రకరణము సమాప్తము.

---

## పదియేడవ ప్రకరణము

మద్రాసులోని వింతల నించుక వివరిస్తాము. మద్రాసులో అతిభయంకరంగా కలరా వ్యాపించింది. ఏక్షణానికాక్షణం తీవ్రమౌతున్నదే కాని ఎచ్చటా మందగించుసూచనలు కనిపించుటలేదు. ఎచ్చటచూచినా రోగులే. ఏవంకచూచినా రోగులమూల్గులే... వృద్ధులేమి శిశువులేమి యువ్వనులేమి ఏవారనకుండ అభయంకర కలరా దయ్యము వారినుండి పోలేక మృత్యువ్వాలింగనము చేయుచున్నారు. గంటముందుగాంచినవ్యక్తి యిప్పుడు జీవముతో కానవచ్చుటలేదు. ఎటుచూచినను ఆర్తనాదములే ఆవేళ సవముగాఆకలిగొన్న బెబ్బులివలె కరాళనృత్యం గావిస్తూ మృత్యుదేవత ఎందరినో తనపొట్టన పెట్ట[illegible] రెండురోజులతీవ్రరూపము దాల్చిన కలరాపిశాచి అనుగ్రహించిందో యేమో ప్పుడు ఒక్కసారిగా నుండు సద్దణగినది. ఎక్కడనో ఒకటిరెండు కేసులు మాత్ర మింకను పూర్తిగా ఉపశమనము కలుగలేదు. గడచిన మొదటి పక్షము గత రెండు దినములనుండియు ఆమూల కలరాపిశాచి నెదిర్చి పోరాడినది వృధాగానుండగా చివరకు పూర్తిగా తుదముట్టించగలిగారు. నాటి క్రితంరోజు జాడ్యంచాలా తీవ్రంగావుంది. దానినరికట్టుట ఎవరిశక్యం కాకుండాపోయింది. కలరా బాగుగా వ్యాపించినస్థలాలనుండి ప్రాణభీతితో వ్యాధిపీడితులగు తమ బంధుజనులగూడ విడనాడి దూరప్రదేశములకు పోయారు. నగరంలో ఇట్టి క్లిష్టపరిస్థితులు ఏర్పడ్డాయి. అప్పటికి న్యాయవాది రాఘవరావు సుమారు నెలరోజులనుండి విషజ్వరంతో బాధపడి ఎట్లో దైవకృపచే బ్రతికి నాటికి మూడురోజులయింది పథ్యంతిని. వంట్లో చాలా నీరసంగా వుంది. అల్లునకు వంట్లో సుస్తీగా వున్నదంటే సహాయంనిమిత్తం

నాటికి పదిరోజులక్రితమే వచ్చివున్నాడు రాఘవరావింటికి లచ్చుమ్మ, రామశాస్త్రిగార్లు.

ఆనాడు మధ్యాహ్నం సుమారు మూడుగంటలవుతుంది. ఎండ తీవ్రంగా కాస్తుంది. రాఘవరావింకా పూర్తిగా ఇటూ అటూ తిరుగలేనిస్థితిలో వున్నాడు. క్రింద వీధిసావడిలో పడక కుర్చీలో కుందుకునివుంటూను ఏదో పేపరుతిరుగవేస్తూ రాఘవరావు, రాధ వానికై తేనీరు తీసుకువస్తుంది. అదేమిజరిగినదో కాని పాపం ఆ తెచ్చిన తేనీరు అచ్చటిబల్లమీద పెడుతూనే తల రెండుచేతుల తోను అదిమిపట్టుకొని తూలిపోతూ ఆప్రక్కనేయున్న సోఫాలోపడి పోయింది.

"ఆ!... అమ్మా! ... అబ్బా కళ్ళు తిరుగుతున్నాయ్ ... అయ్యో...వాంతి వచ్చేటట్లుంది ... ఊ ... అబ్బా!"

అంటూవుండగానే ఒకవాంతి అయింది. ఆమె కాళ్ళుచేతులూ వణుకుతున్నాయి. పాపం తలబాధతో యేమోగట్టిగా తనరెండుచేతు లతోనూ తలను అదిమిపట్టుకుంది. క్షణకాలంలో జరిగిన యీ మార్పు ఆమెవాంతిచూచేసరికి పాపంరాఘవరావు గుండెలో రాయి పడినట్లయింది. క్షులకాలం క్రితంవరకు ఎంతో ఆరోగ్యంగావుండి కల కలలాడుతూవున్న తనరాధ ఇంతట్లో ఇల్లామారిపోతుందని ఎల్లా వూహించగలడు? ఆమెకి పాపం లేవనెత్తి ఉపచారం చేయడానికా తనకుశక్తిచాలదు. అయినప్పటికి ఎట్లోశక్తితెచ్చుకుని లేచి రాధ దగ్గరకువచ్చాడు. లోపలఏదోపని చక్కబెట్టుకుంటూవున్న అత్త గారిని పిలుస్తాడు. రామశాస్త్రి సుఖంగా నిద్రపోతున్నాడు.

"అత్తయ్యా! ... అత్తయ్యా!..."

లోపలఏదో పనిధోరణిలోవున్న ఆమెకు వానికేకలు విని పించలేదు. మళ్లాబిగ్గరగా పిలచేడు. ఈలోగా మరియొకవాంతి అయిందిరాధకు. క్రమంగా స్పృహతప్పుతోంది.

"అత్తయ్యా!..." గట్టిగా ఆతృతగా పిలిచిన అల్లుని కేక ఒకసారిగా లచ్చమ్మకూ, మగతనిద్రలోనున్న రామశాస్త్రికీకూడా వినిపించింది. రామశాస్త్రి త్రుళ్ళిపడి లేచాడు. ఏమిప్రమాదంవచ్చిందోఅని వెంటనే వచ్చింది హాల్లోకి లచ్చమ్మ. రామశాస్త్రికూడా కళ్ళునులుపుకుంటూ అక్కడకువస్తాడు. ఇద్దరూ ఆదృశ్యంచూస్తారు. నిలువున నీరయిపోతారు, క్షణకాలం ఇద్దరినోటివెంటా మాటలేదు. ఒక్కసారిగా రాధదగ్గరకు పడతారు ఇద్దరూ. కొంచం గద్గదిక కంఠంతో రాఘవరావును ప్రశ్నిస్తాడు రామశాస్త్రి.

"ఏమిటోయ్ ఇది...ఏమయింది...?"

"ఏంచెప్పను మామయ్యా! ఇప్పుడేనాకు టీ పట్టుకువచ్చింది. ఆబల్లమీద పెడుతూనే తలబాధంటూ...పడిపోయింది..."

"ఆ!...ఈ వాంతులేమిటీ..."

"అవును...అప్పుడే రెండయ్యాయి ... పిలుస్తేపలకదు ... ఒకటే మూలుగు..."

"వాంతులే...అమ్మనాయినోయ్...ఏంవచ్చిందే తల్లీ నీకింత ట్లోనూ, ఏంముంచుకు పోయిందే రాధా!..." అంటూ లచ్చమ్మ వెక్కి వెక్కి ఏడ్వడం ప్రారంభించింది. రామశాస్త్రికికూడా పెద్ద దిగులుగావుంది మనసులో. ఊళ్ళో పరిస్థితి బాగాలేదు. ఉన్నట్టుండి అనేకమందిని ఎత్తుకుపోతోంది ఆమాయరోగం. ఆకలరామాట తల్చుకునేసరికి ఆముగ్గురి హృదయాల్లోను అంతులేని భయమావహించింది. నెమ్మదిగా ఆమెనాప్రక్కనున్న ఒకమంచంమీద పడుకోబెట్టాడు. పాపంరాఘవరావుకు కలరాసంగతి తల్చుకునేసరికల్లా తనభార్య తనకు దూరమైపోతుందేమోనన్న దిగులుఎక్కువయింది. ఏమీ పాలుపోలేదు. ఒక్కసారిగా వెనుకటి విషయాలన్నీ జ్ఞప్తికి

వచ్చాయి. తానానాడు వెంకటేశ్వర్లును కత్తితో పొడిచిందెందుకు...? తనప్రియమయిన రాధమానం కాపాడడానికేకదా... హంతకుడు తానయినా, అపవాదు నెత్తిన పెట్టుకుని అది బయటపడే నిమిత్తం పరారిఅయిన శంకర్రావు ఎవరికోరకు చేశాడు అల్లాటిసాహసం తనప్రియసోదరిరాధ సంసారం నిల్పడానికి. అంధకారబంధురమయిన తన జీవితానికి వెలిగించిన నిర్మలజ్యోతి ఎవరు? రాధ. అట్టిరాధ తనకు దూరమయిపోతుందనే ఆలోచన మనసుకు తట్టేసరికి పాపం రాఘవ రావుకు తాను నిలచినస్థలం పాతాళానికి జారిపోయినట్లయింది. ఒక్క సారిగా వివిధయోచనలతో మనస్సంతా కలవరపడిపోయింది. తన జీవితమార్గానికి కారుమేఘాలు క్రమ్ముకొని అంధకారబంధురం చేసేశాయి. తనకంతా అగమ్యగోచరంగా తోచింది. దిగాలుపడి, దృష్టిమరల్చిపడియున్న రాధవంక దీనంగా చూస్తున్నాడు. అట్టి సమయంలో చేయదగిన ప్రయత్నం మరచి, ఇతరులకా స్త్రీవిషయం చెప్పవలసినదేముంది. తమ్మెపోడుద్దరించి తన పెద్దకాలంలో సాయపడ తాడన్న కొడుకు జాడలేకుండాపోయాడు. పోనివ్వు కూతురున్నయినా చూసుకుని కాస్త ధైర్యపడదామంటే ఆమెస్థితి ఇకనోయిప్పుడో అన్నట్లుంది. ఇంక ఆకన్నతల్లిదండ్రుల విచారానికి అంతులేకుండా వుంది. లచ్చమ్మ వెక్కివెక్కి యేడుస్తూ ప్రక్కకు సడలిపోయినరాధ చీరచెంగును సర్దుతూ ఆమెతలదగ్గర కూలబడి.

"ఇదేమిటా దేవుడా...ఒక్కసారిగా ఇల్లాటిదొంచుకు వచ్చే సింది...అమ్మా! రాధా..."

రాధకన్నులు తెరువదు. నిశ్చేతంగా నిట్టూర్పుతూవుంటుంది. ఆమెమూలుగుతూన్నకొలది వీరిఆందోళన హెచ్చుతుంది.

"ఒక్కసారు కళ్లుతెరవమ్మా తల్లీ!...అమ్మా...రాధా! ... రాధా!! ఇల్లావచ్చిపడిందేమిటే తల్లీ...ఒక్కమాటు మాటాడమ్మా."

“అయ్యో!...మాట్లాడదేం...రాధా!...రాధా!!...”

“అమ్మాయీ...రాధా!...మీఅమ్మపిలుస్తోంది ... ఒక్క మాటుకన్ను తెరవమ్మా...చూడూ”

“ఇదేమిటోయ్ ...ఇల్లాపడిపోయిందీ ... ఇందాకటిదాకా బాగానేవుందీ ...”

“ఎందుకయినామంచిది...ముందువెళ్ళి ఒకడాక్టర్నిపిలవండీ. అంది కంగారుపడుతూ లచ్చమ్మ. వెంటనే రామశాస్త్రి బయల్దేరబోతాడు. కాని తనకా పట్నంలో ఏమీ తెలియదే. రాఘవ రావుకదలలేని స్థితిలోవున్నాడు. ఏమయినా తప్పనిసరి ఏబండో వేసుకుని వెళ్ళితీసుకువద్దామని నిశ్చయించుకున్నాడు.

“నేను వెళ్ళి వస్తానుండండి-రామయ్యా!...”

“అయ్యో! జ్వరంతోనువ్వు ఎక్కడకు వెడతావు నాయనా.. ఎల్లాగో ఆయనే...”

“మామయ్యకీవూళ్లో ఏం తెలుస్తుందత్తయ్యా! ఎల్లాగో ఏ బండిమీదో నేనే వెళ్ళి వెంటనేవస్తాను. చూస్తూ వుండండి...”

అంటూ పాపం ఆకంగారుతో అసలేనీరసంగా వుండేమో కొంచంతూలుతోనే వీధిలోకివెళ్ళి అక్కడిబండిఒకటి ఎక్కి డాక్టరు గారింటికి వెళ్ళిఆయనతో పరిస్థితంతా చెప్పి కలిసి ఇంటిముఖంపడతాడు. ఇంకఇక్కడ అతనూ వెళ్ళిన కొంచంసేపటికి పెద్దపీరేచనం అవుతుంది. కాని రాధకువంటిమీద స్పృహలేదు. లచ్చమ్మ ఎల్లాగో ఆబట్టలు మార్చి ఆందోళనతో వెక్కి వెక్కి ఏడుస్తూ.

“అయ్యో! తల్లీ, రాధా! నేనేంచేతునేఅమ్మా ... ఇద్దరూ రెండుకళ్ళల్లా వున్నారనుకుంటూ మురిసిపోయేదాన్ని ... మమ్మల్నీ ముసలికాలంలో వదలివేసి ఎక్కడకో పోయాడువాడు ... నువ్వు చూస్తే ఇల్లావున్నావ్...ఇప్పుడేంచేతునేతల్లీ...నాకేదిదారి...”

లోపలనుండి పొంగివస్తూన్న దుఃఖాన్ని దిగమింగుకుంటూ మగవాడుగాబట్టి కాస్తధైర్యం తెచ్చుకుని, రుద్ధకంఠంతో భార్యకు కాస్తధైర్యం చెప్పయత్నిస్తాడు రామశాస్త్రి.

"ఏడవకే...అల్లాగ...ఏంచేయగలం ... ఇదంతా మనఖర్మ ...కాకపోతే ఎన్నడూఅనుకోంది వాడికదేంబుద్ధిపుట్టాలి..."

"అయ్యో దేముడా...నీకళ్ళు వీళ్ళమీదేపడాలీ...అప్పుడే."

"కర్మనెవడుతప్పిస్తారే... ఏకొక్కకొడుకు... పెద్దచదువు చదివి పెద్దవాడై మన్నేదో ఉద్ధరిస్తాడనుకున్నాంగానీ ... వాడల్లా మన్ని నడిసముద్రంలో పారేసి లేచిపోతాడనుకున్నామా...ఇప్పుడు గోరుచుట్టుమీదరోకటిపోటంది ... ఏంచేస్తాం... అనుభవించాలి."

"ఏడుకొండలవాడాతండ్రీ! వెంకట్రమణమూర్తీ...మమ్మల్ని దిక్కుమాలినవాళ్లను చేసేస్తావాతండ్రీ! ఉగండగడిస్తే స్వయంగా నీదర్శనంచేయించి భోగంచేయిస్తానాయనా! కాపాడుతండ్రీ! వెంకట్రమణమూర్తీ..."

"రాధకుమళ్ళా ఏపెద్దవాంతి అవుతుంది. తోవనపోతూన్న ఓఆసామి వీరిగోలచూచి కాస్తలోపలకువచ్చి ఒక్కసారిత్రుళ్లిపడి "బాబోయ్! తాతగారూ! కలరాఅండీఅది ... చప్పునలేచి పొండి అక్కడనుంచి..."

"అంటూఅక్కడనుండి నాలుగడుగులలోకి వచ్చి వీథంట వెనుకకు తిరిగిఅయినా చూడకుండా వెళ్ళిపోతాడు. కలరాపేరు వినేసరికి ఒక్కసారి కంపంబయల్దేరుతుంది లచ్చమ్మకు రామశాస్త్రికీ. ఆమాటవినగానే ఇద్దరూ క్షణకాలం స్తంభించిపోతారు.

"ఆ!...కలరాయే...అయ్యబాబోయ్!...అయ్యోరాధా!."

అంటూ రెండడుగులు వెనుకకువేస్తాడు రామశాస్త్రి. ఎంతయినా ఎవరిప్రాణం వారికితీపికదా. లచ్చిమ్మకూడా పెద్దపెద్ద దీర్ఘాలుతీస్తూ అక్కడనుండిలేస్తుంది.

"కలరాణీ!...అయ్యో మాతరో ఏమ్ ... ఇంకేందా రేనాకు ...వెంకటప్రమణా...తండ్రీనీదే భారం..."

"ఇంతలోకి రాఘువరావు డాక్టర్ను వెంటబెట్టుకుని కంగారుగా ప్రవేశిస్తాడు. ఆదృశ్యం చూస్తాడు. దూరంగా తొలగి ఏడుస్తూవున్న అత్తమామలను చూస్తాడు. వారిమాటలువింటాడు. డాక్టరు రాధను పరీక్షచేసి లచ్చమ్మవంక తిరిగి,

"పరిస్థితిచాలా సీరియస్‌గావుందే ... ఎన్నివాంతు లయ్యాయండీ..."

"ఇప్పటికయిదు బాబూ!... అల్లామాట లేకుండా పడిపోయి వుందితండ్రీ...చూడండిబాబూ......" కన్నకడుపు పడడంవల్ల కంటి నీరుతుడుచుకుని మళ్ళామంచందగ్గరగా వచ్చిందిలచ్చమ్మ. డాక్టరు ఆమెదగ్గరగా వెళ్ళి నాడిపరీక్షచేస్తూ పెదిమవిరిచి

"అయ్యా! రాఘవరావుగారూ... నమ్మకంలేదు ... చాలా సీరియస్‌గావుంది..."

"అంటూ రెండు ఇంజక్షనులు ఇచ్చి రాఘవరావువంకతిరిగి,

"అయ్యా! అయినాశక్తివంచనలేకుండా ప్రయత్నిస్తా ... చూడండీ ఇప్పుడీ ఇంజక్షనులిచ్చాను ... బహుశా తిరగవచ్చు ... నాతోరండి మందిస్తాను ... ఏమో చెప్పలేం..."

రామశాస్త్రి డాక్టరుదగ్గరకువచ్చి వినయంగా దీనముఖంతో

"బాబూ! మీదేభారం ... బిడ్డనుబ్రతికించారా మీమేలు మరువలేం..."

"ప్రయత్నిస్తానండీ...మందుకుఎవరయినారండి ...ప్రతీఅరగంటకూ ఒక్కొక్క మోతాదు చొప్పునఇవ్వండి..."

"చిత్తం!... నేనేవస్తానండితమతో ... అత్తయ్యా! మీారు కొంచంజాగ్రత్తగా కనిపెట్టివుండండి ... నేనిప్పుడే మందుపట్టుకు వస్తాను..."

"అల్లాగేచెప్పునరా ... నాయనా!"

రాఘవరావు డాక్టరుతో కలిసివెళ్లి బండిఎక్కి వెళ్ళిపోతాడు. రామశాస్త్రికూడా డాక్టర్ని సాగనంపడానికి వీధిగుమ్మందాకా వెడతాడు. రామశాస్త్రి అక్కడే నిలబడి పరధ్యానంగా ఏంజరుగు తుందోఅని యోచిస్తూవుంటాడు...ఇంతలోకే కంగారుగా లోపల నుండి లచ్చమ్మ కేకలు వినిపిస్తాయి. ఒక్కపరుగునలోపలకు వెడతాడు.

"ఏమండోయ్...ఏమండోయ్! మిమ్మల్నే...చెప్పునరండి"

"ఆ!...వస్తున్నా ...ఏం...? ఎందుకూ...?"

"అయ్యో! అయ్యో! కూతురోయ్! ... ఇల్లావళ్ళు చల్లబడి పోతోందేమరోయ్! అయ్యో! అయ్యో దేముడోయ్ ... ఎంతపని చేశావ్... చూస్తారేమిటె ఇల్లారండి...ఇల్లా వళ్ళుచల్లబడిపోతోంది. ఎవర్నయినా పిలవండీ..."

"ఆ!..." నిర్ఘాంతపోతాడు. గబగబావచ్చి రాధవళ్ళుతాకి వణుకుతూన్న చేతులతో...దుఃఖాన్ని దిగమింగుతూ.

"ఇంకా ... పిలవడ... మేమిటే...మన్నివది ... లేసిందే... రాధ!...ఇంతపనిచేస్తావనుకోలేదురా భగవంతుడా...అయ్యో!.."

"ఆ!...పోయిందీ ... నా రాధపోయింది ... నాకేందారి... రాధా!...రాధా!"

గుండెబాదుకుంటూ నెత్తివాదుకుంటూ గొల్లుమనిఏడుస్తూ వుంటుంది. పాపం ఆకష్టదశలో ఆమెనోదార్చడానికయినా ఆఖ రుకు ఆత్రోవనుపోయేవారయినా అక్కడకు రాసాహసించలేదు... అంతాగోడ్డుమీాదే నిలబడి ఇంటివయిపు చూస్తూవుంటారు. అందు లోనే కొంచం ధైర్యం తెచ్చుకుని గుండెరాయిచేసుకుని రామశాస్త్రి.

"ఊరుకోవే... ఏంలాభం... ఇదంతా మనకర్మ..."

"అయ్యో! నా రాధా! ఎన్నాంటిచావు వచ్చిందే నీకు... అయ్యో దేవుడా... నువ్వున్నావా... లేదు .... లేడు దేవుడు లేడు... ఉంటే నా రాధను బ్రతికించడూ..."

అంటూ పిచ్చి కేకలు పెడుతూ క్రమంగా అలసిపోయి స్పృహ తప్పుతూవుంటుంది. దాంతో రామశాస్త్రి భయపడి ఆమెను పట్టుకుంటాడు. ఈలోగా రాఘవరావు వస్తాడు. లచ్చమ్మ గొల్లుమంటుంది. ఆదృశ్యాన్ని చూడగానే చైతన్యం పోతుంది రాఘవరావుకు చేతిలోనిమందుసీసా అప్రయత్నంగా జారి క్రింద పడిపోతుంది. ఒక్కసారిగా రాధప్రక్కను కూలపడతాడు.

"రాధా...! నన్ను వదిలేశావా..."

పెద్దవాడయిన రామశాస్త్రి దుఃఖం దిగమ్రింగుకుని కొంచం ధైర్యం తెచ్చుకొని నెమ్మదిగా వెళ్ళి రాఘవరావు భుజంమీద చేయి వేస్తాడు... నెమ్మదిగా ముఖం పైకెత్తి రాఘవరావు చూస్తాడు శూన్యదృక్కులతో. దుఃఖం పొంగిపొరలి వస్తుంది.

"లే... నాయనా! విధి ... తప్పించడం ఎవరికివశం ... చూస్తూంటే కడుపు తరుక్కుపోతోంది..."

రాఘవరావు నెమ్మదిగా లేవబోతాడు. కాని లేవలేకపోతాడు. గుండెలో నొప్పివస్తుంది. అసలేజ్వరపీడితుడాయె. పైగాభార్యవియోగదుఃఖం. వానికి ప్రపంచమంతా శూన్యంగా కనబడింది. అసలే నీరసస్థితిలో నున్నవానికి భార్యపోవడంతోనే భరింపరాని బాధకలిగి గుండెలో పోటువచ్చి కదలలేక మరల అప్రక్కగానే పడిపోతాడు.

"అబ్బా!..నాయనా! నొప్పి..."

"ఆ!...ఎక్కడనాయనా!..."

రాఘవరావు నొప్పి అనేసరికి రామశాస్త్రికి లచ్చమ్మకు విపరీతమయిన వేదన కలిగింది. కొడుకు దారి అట్లా అయింది. ఉన్న కూతురూ మట్టిపాలయింది. నాటివరకు పెట్టుకున్న ఆశలు రెండూ నిరాశలయ్యాయి. రాఘవరావును కూడ మేనల్లుడనే ఎడము లేకుండా వానితలిదండ్రులు చనిపోయినప్పటినుంచీ పెంచి పెద్దచేశాడు. ఇంక ఇతడుకూడా ఏదో ప్రమాదావస్థకు గురికాబోతున్నాడనేసరికి ఆదంపతుల హృదయవేదన ఎంతగా వుంటుందో ఊహించుకోవలసినదే. రామశాస్త్రికి పట్టరాని దుఃఖంవచ్చింది. లచ్చమ్మ విచారానికి అంతేలేదు. రాఘవరావు నెమ్మదిగా హృదయం తడుముకుంటూ,

"అ... బ్బా!...గుండె...లో...ఊ..."

లచ్చమ్మ రాఘవరావుదగ్గరకువచ్చి వానిని సముదాయిస్తూ వుంటుంది. ఈలోగా వీధివెంబడిని పోలీసులు, రెడ్‌క్రాస్ వాళ్ళు వెడుతూ ఇచ్చటిసంగతి తెలుసుకుని లోపలివస్తారు. అందులో ఓ పోలీసు రాధనుచూచి ఆప్రాంతమందున్న పరిస్థితుల నవలోకించి

"ఏమండీ.. ఏమిటది...ఈమె చనిపోయిందే..."

"అవును నాయనా...ఇప్పుడే..."

"ఈయనెవరు?... ఏంవచ్చింది...?"

"ఏమోనండీ...గుండెనొప్పి అంటూ...ఇప్పుడే... బాబూ కాస్త సాయంచేద్దురూ...ఏ ఆసుపత్రికయినా..."

"మేమూ అదే కనుక్కుందామని వచ్చాం...మీరు లేవండి... మేమంతా బందోబస్తు చేస్తాం..."

రామశాస్త్రి లచ్చమ్మలు అక్కడనుండి లేస్తారు. రెడ్‌క్రాస్ వాళ్లు ఒక 'స్ట్రెచర్' తెచ్చి అందుపై రాఘవరావును పరుండబెట్టి వీధిలోకి తీసుకెడతారు. పోలీసువాడు శాస్త్రివంక తిరిగి,

"పదండి..."

"అమ్మా! రాధా!...అయ్యో...రాధనువదలి..."

"నడవండమ్మా...నడవండి..."

విధిలేక వీధిలోకివస్తారు. రాఘవరావును ఆసుపత్రికి చేరుస్తారు. పోలీసులు ఇంట్లోశవాన్ని తీసుకుపోయే యేర్పాట్లుచేయించి ఆయింటికి భద్రంగా తాళంవేయించి అది రామశాస్త్రికిస్తారు. రామశాస్త్రి లచ్చమ్మ పాపం రాఘవరావు నొక్కసారిచూచి వైద్యుడు ధైర్యంచెప్పినమీదట అక్కడే రెండురోజులుండి మరలరావచ్చునని గుంటూరు వెడతారు. ఇంటివ్యవహారాలు చక్కబెట్టుకురావడానికి.

పదియవ ప్రకరణము సమాప్తము.

# పదకొండవ ప్రకరణము

ఆస్టేషన్‌లోనే టికెట్‌కలెక్టరుగా పనిచేస్తూ వుండడంచేతను పైగాఆనందరావుద్వారా బాగాపరిచయ మవడంచేతను ప్రకాష్ ప్రభాకరరావులకు స్నేహంనానాటికి హెచ్చుతుంది. తరచుగా ఆనందరావుకూడావచ్చి అక్కడ కాస్సేపు ఏవో కలాపాకబుర్లు చెప్పుకుంటూ వీరితో కాలక్షేపం చెయ్యడం మామూలుగా జరిగేసంగతే. ప్రకాష్ చాలామంచివాడు. ఆనంద్ బాల్యస్నేహితుడు. తనకు విశ్రాంతిదొరకినప్పుడల్లా బుకింగ్‌క్లార్కు ప్రభాకర్ దగ్గర కూర్చుని లోకాభిరామాయణం మాట్లాడడం జరుగుతూండేది. ప్రభాకర్ పనిలోప్రవేశించి పదిరోజులయినా అప్పటికేవారిస్నేహం చాలాబలపడింది.

అదివిజయనగరం రైల్వేస్టేషన్. ఉదయంపదిగంటల సమయం అప్పుడు ఏబండీ వచ్చేవేళ కాకపోవడంవల్ల బుకింగ్‌క్లార్కు కిటికీ

మూసివేసి ఖాళీగాకూర్చొని వున్నాడుతనగదిలో. ఆగదిలోకి ఆనంద రావు ప్రికాష్ అనే ఆస్టేషన్లోని మరియొక టికెట్ కలెక్టరువస్తారు. ఆవచ్చినవారిని బుకింగ్ క్లార్కు ప్రభాకరరావు ఆహ్వానించి కూర్చో మంటాడు.Please refer the attached slip ఇప్పటికి ప్రభాకర రావు ఆ పనిలోప్రవేశించి సుమారొక పదిరోజులు అవుతుంది. ఆనాడు చంద్రశేఖరరావుగారు చేసినకృషి ఫలితంగాఇప్పుడు ప్రభాకరరావందు పనిచేస్తున్నాడు. ఎనభై రూపాయలు జీతంమీద ఆనంద్ ప్రికాష్లిద్దరూ చెరియొక ఆసనంమీద కూర్చుంటారు. ఏదోలోకాభిరామాయణం మాట్లాడుకుంటూవుంటారు.

"ఏమండీ...ఖాళీగాకూర్చున్నారూ..."

"ఏం. ఖాళీలెండి ... ఇప్పుడే ఏంతో Window క్లోజ్ చేశాను. ...ఏమిటి విశేషాలు..."

"ఏలాగుందోయ్ వర్కు...?"

"ఆ!... ఏదోనడుస్తూంది..."

"ఏమయినా కొత్తకనక కొంచంకష్టంగానే వుంటుంది. ...ఏమంటారు...?"

"ఆ!...ఏంకష్టంలెండి...అయితేఏమిటోయ్ ఆనంద్ ఇల్లా వచ్చావు..."

"అబ్బే...ఏంలేదు...కొంచం స్టేషన్మాస్టరుతో పనుండి కలుసుకుందామని వచ్చాను..."

"వెళ్ళావా...?"

"ఆ!...ఇంక ఇంటికే పోతున్నా...అయితే ఇవాళఎన్నిగం టలు దాకావుండాలి..."

"నాలుగున్నర...రోజూలాగంతేగా...ఇవేళకొంచంపెందరాళే వచ్చేద్దా మనుకుంటున్నా వీలుచూసుకుని..."

"ఏమల్లాగ...?"

"ఏంలేదు ... కొంచం వేడిచేసినట్లుంది ... కళ్లుమంటలుగా వున్నాయి అంతేలే..."

"సరే...ఏదయినా పట్లతింటే చలవచేస్తుం దేమోనూడు. . నేను పోతున్నా..."

"సరే వెళ్ళు..."

"రావోయ్...ఆనంద్!... పోదాం ... నేనుకూడాబజారు లోకివెళ్లాలి...వస్తామండీ..."

"మంచిది... వెళ్ళండి..."

"ఆనంద్ప్రకాష్లు అక్కడనుండి వెళ్ళిపోతారు. ప్రభా కర్ ఏదోఆలోచిస్తూవుంటాడు. అల్లాగే

* * * * *

మద్రాస్ పరిస్థితులచూద్దాం. అదిజడ్జీగారిబంగళా. సాయం కాలం నాలుగుగంట లవుతుంది. సమయం వాతావరణం ప్రశాం తంగానేవుంటుంది. మేడమీాదగదిలో పద్మఒంటరిగా సోఫాలో పండుకుని ఏదోగ్రంథం తిరుగ వేస్తూ వుంటుంది. కొంచంసేపటికి లలితవస్తుంది.

"ఏం...?పద్మా! ఏమిటది చాలాదీక్షగా చదివేస్తున్నావు..?

"రా! లలితా, ఏంలేదు...కూర్చో..."

"పద్మలేచికూర్చుంటుంది. లలితవచ్చి ఆమెప్రక్కనేకూర్చుం టుంది.

"ఊ"...అయితే ఏమిటాగ్రంధరాజం...?"

"అబ్బే...మనుచరిత్రలే..."

లలిత ఆపుస్తకాన్ని అందుకుని పుటలుతిరుగవేస్తూ పద్మ వంకతిరిగి.—

"ఏమిటీ వేళ దీన్ని తీశావు..."

"ఏం లేదు...ఏమీ తోచక నాలుగు పద్యాలు చదువుదామని తీశాను..."

"బాగా నేవుందిలే...అయితే ఈ వేళ ఎక్కడకూ బయల్దేర లేదేం..."

"నువ్వు లేదీనా ... ఏమిటో ఏమీ తోచక నీ రాకకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను...నువ్వీ వేళ ఇంత ఆలస్యంచేశావేం?

"ఆలస్యమా...ఇప్పుడేం అయిందిటైము, నాలుగుంపావు...పాపం మనచరిత్రలో కడిమైమూరచనట్లున్నావు...చాల్లే ఇంక లే...అల్లా బీచ్ కిపోదాం..."

"సరేకాని ఇంకా ఎండ తీవ్రంగా నేవుంది...కాస్సేపుపోయాక బయల్దేరుదాం..."

"ఇంకా ఎండేమిటి...నాలుగున్న రవుతూంటేను ... అర్ధ రాత్రా యేమిటి మనమికారు...లేలే...సాయంకాలంఎండ శరీరానికిమంచిదన్నారు పెద్దలు..."

"అయి తేటీత్రాగే బయల్దేరావా యేమిటినువ్వు ..."

"ఆహా!—అన్ని అవశిష్టాలూ తీర్చుకునేవచ్చాను — నువ్వు తొందరగా లెద్దూ...అన్నట్టు మీ అమ్మగారేరీ—"

"క్రిందఉంది...నువ్వుచూడలేదూ..."

"బాగుంది...చూస్తేఅడుగుతానా ... అయితే నేను మీ అమ్మగారిదగ్గరుంటాను...నువ్వు త్వరగా 'టాయిలెట్' అయిరా"

"ఇదుగో ఇప్పుడే రెండునిమిషాల్లో వస్తా..."

లలితక్రిందకు తిన్నగా లక్ష్మీబాయిగారివద్దకు వెడుతుంది. పద్మతన పనిమీద వెడుతుంది. లలితను చూడగానే ఏదోపనిచేసుకుంటూన్న లక్ష్మీబాయమ్మగారు.

"రా! లలితా! కూర్చో...ఏమిటిసంగతులు ... పద్మ మేడ మీా దేవుంది చూడలేదూ,..."

"ఉండండీ ... అక్కడనుండే వస్తున్నా ... బట్టలుమార్చు కొస్తోంది..."

"అయితే ఎక్కడకు ప్రయాణం...?"

"ఏం తోచడంలేదండీ...అల్లాబీచ్ కి పోదామని ... మీారు కూడా రాకూడదూ..."

"నేనా...సరే ... నాసంగతేలడుగు ... నాకాపాటి రాత కూడానా..."

"ఏమండీ మిమ్మల్నిమాత్రం చల్లగాలికి షికారువెళ్ళడాని కెవరువద్దంటారు...ఇవాళరండీ... వెడదాం...?"

"నాకెక్కడమ్మాతీరిక ... మీాబాబయ్యగారు ఆఫీసునుంచి రాలేదు...ఆయనకింకా కాఫీ అదీ...ఇవ్వాలి... మీారువెళ్ళిరండి"

"అప్పుడే అరగంట అవుతోంది...ఇంకా ఈవిడశృంగారం అవలేనట్టుంది..."

"పద్మా...పద్మా!..."

పద్మ పరిశుభ్రమయిన దుస్తులనుధరించి సాక్షాత్తురతీదేవిలా తయారయి మందగమనంతో వస్తూవుంటుంది.

"ఆ! అదుగోనండి భామ వస్తోంది..."

"వెళ్ళండమ్మా...వెళ్ళండి..."

"ఇక్కడికేనమ్మా ... బీచ్ కివెళ్ళి మళ్ళాచీకటిపడకుండా వచ్చేస్తాం..."

"సరే త్వరగామాత్రం రండి..."

పద్మ లలిత లిద్దరూ బయల్దేరి వెళ్ళబోతూ వీధిలో అడుగు పెట్టేసరికల్లా పోష్టుబంట్రోతు ఒకఉత్తరం ఇచ్చివెళ్ళిపోతాడు.

దానిని పద్మ అందుకుని పైచిరునామా చూస్తుంది. వీరరాఘవరావు పంతులుగారికి—జడ్జీగారు అనివుంది. లోనికితీసుకుపోయి బల్లమీాద పెడుతూ పైనున్న విజయనగరంపోష్టు ముద్రిగమనించి, ఏదో సందేహంతో తిరిగివస్తూవుంటే జడ్జీగారికారు వస్తుంది. జడ్జీగారు లలితను పలుకరించి తిన్నగా మేడమీాది వారి గదిలోకి వెడతారు. వానివెనుకనే వుత్తరంతో పద్మ ఆమెవెనుక లలితా వెడతారు. జడ్జీగారు వెనుతిరిగి.

"ఏమమ్మా! మళ్ళాయిల్లావచ్చారు...ఏంకావాలి..."

"ఏంలేదండీ నాన్నగారూ...మీాకుఒక ఉత్తరం వచ్చింది"

"ఏదీ..."

"జడ్జీగారు బట్టలుమార్చుకుంటారు. పద్మఆయనకు ఉత్తరం ఇస్తుంది. ఆవుత్తరాన్నివిప్పుతూ సోఫాలోకూర్చుంటారు. ఆయన ఆ వుత్తరం కొంతచదివి చిరునవ్వుతో పద్మచేతికిస్తూ.

"C. I. D. నాథ్ దగ్గరనుండి వచ్చిందమ్మా ..."

దాంతో పద్మాలలితలముఖకమలములొక్కసారి వికసిస్తాయి. వెంటనేపద్మ ఆలేఖనందుకొని ఆతురితగా చూస్తుంది.

"ఆ!...నాథ్ దగ్గరనుంచే...ఏమనిరాశాడూ..."

"ఏదీపైకి చదువమ్మా!..."

పద్మచదువుతుంది.

మహారాజశ్రీ వీరరాఘవరావు పంతులుగార్కి,

అయ్యా,

నమస్కారములు. అన్నిపరిస్థితులు భగవదనుగ్రహమువలన అనుకూలముగానేవున్నవి. అనేకకష్టములుపడి చివరకు మనవాడి జాడ తెలుసుకున్నాను. అతనిప్పుడు విజయనగరంలో మారుపేరుతో ఒకరింట్లోఉన్నాడు. క్షేమంగానేవున్నాడు. మనిషిచాలా మారి

పోయాడు. ఆనవాలుపట్టడమే చాలాకష్టమయిపోయింది. నేను ఎప్పటికప్పుడు వానిచర్యలను బహుజాగ్రత్తగా పరీక్షిస్తూనేవున్నాను. దేవునిదయవల్ల కొద్దిరోజులలో అన్నీచక్కబడవచ్చు.

చిత్తగించవలెను,

నాథ్

ఇప్పుడు పద్మఆనందమునకు మేరలేదు. పదేపదే లోలోన పలుమార్లు చదువుకున్నది.

"చివరకు దొరికిందమ్మా వానిజాడ ... ఇంకవుంది అసలు విషయం..."

"మారుపేరుకూడా పెట్టుకుని వేషంకూడా మార్చేశాడుట. గుర్తుపట్టటమే కష్టమయిందిట. చూశావా బాబయ్యగారూ ఎంత జాగ్రత్తగా ఉన్నాడో..."

"చదువుకున్నవాడు...ఆమాత్రం తెలియదాఅమ్మా!..."

"అయితే ఇప్పుడింకేమిటిచెయ్యడం...?"

అంటుందిపద్మసంకోచంతో ఆత్రుతవెళ్ళబుచ్చుతూ, వెంటనే లలిత చిరునవ్వునవ్వుతూ హేళనగా,

"అంత తొందరేంపద్మా!...అసలు మనిషిజాడ తెలిసింది... ఇంకఉందిఘట్టం..."

"అయితే బాబయ్యగారూ అతణ్ణిక్కడకు రప్పించడాని కేద యినా ప్రయత్నంచేస్తే..."

"ఎల్లాగమ్మా!...అదే నేనాలోచించే విషయంకూడా... అతనిల్లాటిస్థితిలో ఇక్కడకు వస్తాడా ఎవరికంటయినా పడమూ..."

"మరేమిటిసాధనం...?"

"అదే ఏంచేయడానికీ తోడచంలేదు...ఆపనికూడ నాథ్ వల్లే జరగాలి..."

"అదెట్లు...?"

"ఆమెత్తులన్నీ వానికే తెలుసు. కరత్రివాడయినా సిద్ధహస్తుడు ...పట్టాడంటే సాధించేదాకా విడువడు ... ఎల్లాగయినా అతడే తీసుకురావాలి...లేదా ఉన్ననిజస్థితిఅయినా తెలుసుకొవస్తాడు..."

"అయితే అదిమంచిపనే వానికి వెంటనేవుత్తరంరాయండి"

"కానివాని అడ్రెసు మనకు తెలియదుగా ... అక్కడవాని పరిస్థితి ఎల్లావుందో...మనం తొందరపడకూడదు...అతని కన్నివిష యాలూ తెలుసు...సమయానుకూలంగా అతడేచేస్తాడు..."

"మీరెక్కడకో ప్రయాణమయినట్లున్నారే..."

"ఆ!...కాస్తఅల్లాబీచ్ కిపోయివద్దామనిబయల్దేరాములెండి"

"అయితే వెళ్ళిరండి ... కాస్తకాఫీతాగ్రి నాకూకొంచం పనుంది చూసుకోవాలి..."

"అయితేమేం వెళుతున్నామండీ...అదుగో పిన్నమ్మగారు ఫలహారం పట్టుకువస్తున్నారు ..."

అంటూ లలిత, పద్మయిద్దరూ తిన్నగా వెళ్ళిపోతారుబీచ్ కి. లక్ష్మిబాయమ్మ కాఫీఫలహారములు పట్టుకుని అక్కడకువస్తుంది. వెళ్ళిపోతూన్న పిల్లలవంక చూసి జడ్జీగారితో,

"ఏం...వెళ్ళిపోయారేం...?"

"ఏదో షికారుకువెడతామని వెళ్లారు..."

"ఇందాకానేబయల్దేరారుగా...ఇంకా కొంతసేపూ ఏం చేస్తున్నారిక్కడ...?"

"నాకోఉత్తరంవస్తే ఇద్దామనివచ్చారులే..."

లక్ష్మిబాయిఫలహారం అక్కడపెడుతుంది. జడ్జీగారుతింటూ వుంటారు. ఆమె కాఫీ కలుపుతూవుంటుంది.

"ఏమిటో ఇంతసేపూ గుసగుసలాడుతున్నారేమిటి...?"

"పెళ్ళిమాటలు..."

అన్నారు జడ్జీగారు నవ్వుతూ స్పష్టంగా. ఆయనకు తరచుగా అల్లాటిసమాధానాలివ్వడం, దాంతో ఆవిడకోపంతో రెచ్చిపోవడం మళ్ళా ఎల్లాగో ఆమెను సమాధానపరచడం మామూలువిషయాలే. ఆమెకు వళ్ళుభగ్గుమంది. ఈసడిస్తూ,

"పెళ్ళిమాటలా...! ఎవరికి మీకా...నాకా...ఎంతవేళా కోళంగావుందీ నామాటలంటేనూ..."

"అంతట్లో కేకోపం...అబ్బా! పోసిద్దూ... బాగానేవుంది; అయితే బట్టలువాడు చీరలుతెచ్చాడా...?"

"ఆ!...తెస్తాడు ... మీరుచెప్పితేగా...అంతమాయే... ఇదప్పుడే నాలుగోసారి..."

"అంతకోపమెందుకు చెప్పు...వాడు తేకపోతే ఏంచేస్తాం... నడు బయల్దేరి వెడదాం బజారుకు..."

దాంతో లక్ష్మీబాయమ్మగారిముఖం వికసిస్తుంది ముఖమింత చేసుకుని తొందరగా,

"నిజంగానే..."

"ఆహా! నిజంగానే ... నడువెడదాం...కారు గుమ్మంలోనే వుంది..."

"అన్నట్లుపద్మకో ... పాపం వెర్రిపిల్ల ఎప్పుడూఅడగనే అడగదు...పోనీ అదికూడావస్తుంది...రేపువెడదాం ... ఆదివారం శలవేగా..."

"ఆ! శలవే...అల్లాగేకానీ..."

ఈలోగా వంటమనిషిపిలుస్తుంది. దాంతో తోకత్రొక్కిన త్రాచులావస్తుందికోపం ఆవిడకు.

"అమ్మా !...అమ్మగారూ !!..."

"ఆ !...వస్తున్నా ... ఇదెక్కడో శనిలా దాపురించింది ... మంచి...సమయానికల్లా పిలుస్తుంది..."

"పాపం అల్లా అన్ని దానికేం తెలుసు..."

"చాల్లేద్దురూ...ఎప్పుడూ ఇంతే..."

అంటూ లక్ష్మీబాయమ్మ రుసరుసలాడుతూ వెళ్ళిపోతుంది. జడ్జీగారు ఓ పెద్దనిట్టూర్పు విడచి పేపరు చూచుకుంటూవుంటారు. క్రమంగా చీకటిపడుతుంది.

*   *   *   *   *

గుంటూరులో రామశాస్త్రి ఇల్లు. నాటికి ఆ సుబ్రావు నుంచి వచ్చి ఒకవారంరోజులు పైన అవుతుంది. అసలే అమాయకురా లయినదేమో పాపం లచ్చమ్మ కొడుకూ కూతుళ్ళకోసం బెంగ పెట్టుకుంది. క్రమంగా అప్పుడు వచ్చిన మర్నాడే మంచం పట్టింది. తీరని మనోవ్యాధితో క్రుంగిపోతోంది. ఇంత రామశాస్త్రి ఏపాప మెరుగని అమాయకపు ఛాందస బ్రాహ్మణుడు. అప్పట యింక నాఅన్నవారెవ్వరూ లేరు. మాస్తే భాగ్యస్థితి ఇల్లావుంది. ఏదో అల్లాగే ఆ మనుస ముదాయిస్తూ దేవునిమీద భారం వేసి కాలంగడుపు తున్నాడు. లచ్చమ్మ పక్కమీద ఇటూ అటూ దొర్లుతూ దీర్ఘంగా మూల్గుతూవుంది. రామశాస్త్రి ఆ మంచం ప్రక్కగా కూర్చుని ఆమెనోదారుస్తూవుంటాడు. ఆమెకు తీవ్రమైన జ్వరం వస్తుంది.

"అయ్యో !...అ...బ్బా...యీ...శంక...రం...ఊ !... శం...కరం..."

"చూడూ... (లచ్చమ్మ రామశాస్త్రి కేసి నెమ్మదిగా చూస్తూంది.) అల్లా బెంగ పెట్టుకుంటే ఎల్లాగ చెప్పా...కష్టాలు వచ్చి

నప్పుడల్లాగే ఒకదానిమీద మరిఒకటీవస్తూవుంటాయి...కాస్త స్థిమిత పడాలిగానీ...అల్లా బెంగపెట్టుకుంటే ఏంలాభంచెప్పు..."

"నాయనా !...శంక...రం...అబ్బా !..."

ఆమె రామశాస్త్రికేమీ సమాధానమివ్వదు...బహుశా వానిమాటలు ఆమెకువినిపించడమేలేదేమో. పాపం రామశాస్త్రి దీనవదనంతో,

"వస్తాడే ... ఈపాటికి... కబురుచేశాను ...నువ్వు కాస్త స్థిమితపడు..."

ఈలోగా కృష్ణారావు, షాపుయజమాని, శంకరరావు ప్రాణహితుడువస్తాడు.

"ఏమండీ...శాస్త్రిగారూ...ఎల్లావుంది మామ్మగార్కి..."

"ఏంచెప్పనునాయనా ... అదుగో అల్లాగేవుంది...మూడు రోజులనుంచి...ఏమీ తినదు ఆఖరుకు మంచినీళ్ళయినాత్రాగదు... అస్తమానం అబ్బాయిమీదే ధోరణి..."

"ఎవరినయినా డాక్టర్ని తీసుకువస్తానుండండీ...పాపంచాలా నీరసించారు..."

"ఏమోనాయనా...అబ్బాయి కంటపడితేగాని మాటదక్కేటట్లు లేదు..."

"నేనూ గట్టిప్రయత్నాలు చేస్తూనేవున్నానండీ ... ఆఖరుకు రహస్యంగా ఒకమారయినా రప్పిద్దామని ఎంతయినా ప్రయత్నిస్తున్నాను...కాని ఎక్కడాకూడా ఇంతవరకూ వానిజాడ తెలియరాలేదు..."

"ఏంజాడలే ... ఏమయ్యాడోయేమో ... చివరకు నష్టేటన్నుంచివేచి పోయాడు..."

"అల్లాఅనకండి...అతనెప్పుడూ అల్లాంటిపని చెయ్యడు... ఏదోఇదంతా..."

"మరిదంతాయేమిటి నాయనా...? ప్రాలబ్ధం కాకపోతే..."

"ఏంచేస్తామండీ...అల్లాకష్టాలు వచ్చినప్పుడే కాస్తధైర్యం వహించాలి...మళ్లాగట్టిగా మరోసారి ప్రయత్నించి చూస్తానండీ... ఏమయినా జాడ తెలుస్తుందేమో..."

"మంచిదినాయనా...ఏదోనువ్వు..."

"ఆ! దానికేంలెండి...నేను డాక్టర్నుపంపిస్తాను ... జాగ్రత్తగా కనిపెట్టండి...వస్తాను..."

"ఏదో యీకష్టసమయంలో ఆభగవంతుడే చూపించాడు నిన్నుమాకు..."

"ఎంతమాట...దానికేముందండీ...వస్తానండీ..."

కృష్ణారావు అక్కడనుండి వెళ్ళిపోతాడు. రామశాస్త్రి కూడా లేస్తాడు స్నానంచేసి సంధ్యవార్చుకోడానికి.

ఇదిఇల్లావుండే సమయంలో కొంచం విజయనగరంలో సంగతులు పరికిద్దాం. అక్కడ చంద్రశేఖరరావుగారు ఆనాడు తమ యింటిగదిలో సోఫాలోకూర్చుని పేపరు చూసుకుంటూ వుంటారు. అప్పుడు ఉదయం పదిగంటలసమయం. ఆనందరావు ఎక్కడనుండో వీధిలోనుండి వస్తాడు అప్పుడే. వానినిచూచి చంద్రశేఖరరావుగారు చదువుతూన్న పేపరు అక్కడపెట్టి కుమారుణ్ణి పిలుస్తారు. ఆనందరావువచ్చి ప్రక్కకుర్చీలో కూర్చుంటాడు. ఇద్దరూ తమలోతాము సంభాషించుకుంటూవుంటారు.

"చూడూ...ఆనంద్!"

"ఏమండీ..."

"ఇప్పుడుమళ్ళా ఎక్కడకయినా వెడుతున్నావా...?"

"అవునండీ ... ఓస్నేహితుడింటికి వెళ్లాలి ... ఏమయినా పనుందా..."

"ఏంలేదులేకాని...చూడూ..."

"అయితే ఈ ప్రభాకర్ సంగతి ఏమాలోచించాడు...?"

"ఏం...ఇప్పుడేమొచ్చింది...? ఇంకో నెలపోయాకకదా ... అప్పటిసంగతి ఆలోచిద్దాం..."

"ఒకవారంరోజులనుంచి పరీక్షచేస్తున్నా ... ఏదోచింతమాత్రం ఉద్భవిస్తోంది అతనిలో..."

"కమలవిషయంలోనా...నిజారనేది..."

"అవుననే యోచిస్తున్నా..."

"అబ్బే! అతనుచాలా బుద్ధిమంతుడు...మనకమలను..."

"ఏమనుకోవడానికీ వీలులేదు ... అయితే అతనిఉద్దేశమేమిటో..."

"చూద్దాం...నిలకడమీద అన్నీ తేలతాయి..."

ఈవిషయాలన్నీ ఆచాటున నిలచివింటూన్న బంట్రోతు అప్పన్న క్రిందపోష్టుబంట్రోతు కేకవిని క్రిందకు వెడతాడు. అక్కడ పోష్టుబంట్రోతు ఇచ్చినవుత్తరం అందుకుని దానిమీదవున్న రాజమండ్రి పోష్టుముద్ర గుర్తించి వెంటనే మేడమీదకు పట్టుకునివచ్చి చంద్రశేఖరరావుగారికిస్తాడు.

"బాబూ! ఉత్తరం వచ్చిందండి......"

ఉత్తరమిచ్చి అక్కడనుండి వెళ్ళిపోతాడు. చంద్రశేఖరరావుగారు వుత్తరంవిప్పుకుని చదువుకుని ఆలోచిస్తూ,

"బాగా నేవుందిగొడవ...ఇప్పుడిదో ప్రయాణమూ..."

"ఏమిటండీ...అది..."

"రాజమండ్రీలో మనరైతుదగ్గరనుండి వచ్చింది... అక్కడ మనభూమిప్రక్కన భూమిగలవాళ్లు నీటికాలవనుగురించి తగాదాలు

పెడుతున్నారుట. మనభూమికి నీరువదలడంలేదుట... వెంటనే బయ ల్దేరిరమ్మని రాశాడురైతు. చూడు ఎంతప్రమాదముందో ... ఇంకా బండికిటైముందా..."

ఆనందరావు చేతిగడియారంవంక చూసి.

"పదిన్నరయిందండీ...ఇంకోగంట టయిముంది..."

"అయితే ఆబెడ్డింగుసర్దు ... నేను ఇదుగో ఈట్రంకుసర్దు తాను...ఇవాళబండీలోనే వెడతాను..."

"నన్నుకూడా రమ్మంటూరాయేమిటి...?"

"ఎందుకూ నువ్వింటిదగ్గరుండు ... మళ్లారెండురోజుల్లోనే వచ్చేస్తాను..."

"సరే...అయితే మీభోజనం అయిందా..."

"ఆ! అయింది...త్వరగాకానీ..."

ఆనందరావు బెడ్డింగు సర్దుతాడు. అప్పన్నవెళ్ళి బండితీసుకు వస్తాడు. సామాన్లు బండిలోపెడతారు. చంద్రశేఖరరావుగారు దుస్తులు మార్చుకుని బండిఎక్కుతారు. అప్పన్నకూడ బండితోలే వానిప్రక్క కూర్చుంటాడు. ఆనందరావు బండిదగ్గరనిలబడతాడు.

"చూడునాయనా! కమలతోనుప్రభాకర్‌తోనూ నేనిల్లావెళ్లా వనిచెప్పు...ఇల్లుజాగ్రత్త!"

"అల్లాగే...వెళ్ళిరండి... చూడుఅప్పన్నా! అయ్యగార్ని దిగబెట్టి నువ్వుత్వరగారా..."

"చిత్తం...అల్లాగేబాబూ!..." బండికదలుతుంది. ఆనంద రావు లోనికి పోతాడు.

పదకొండవ ప్రకరణము సమాప్తము.

# పండ్రెండవ ప్రకరణము

ఆమర్నాడు ఉదయం ఎనిమిదిగంటల సమయం. ఆనందరావు మేడమీద సోఫాలోకూర్చుని ఏదోఆలోచిస్తూవుంటాడు. ప్రభాకర రావు కింద కాలకృత్యాలు తీర్చుకోడానికి వెళ్ళాడు. కమల కాఫీ పట్టుకువచ్చి అక్కడ బల్లమీదపెడుతుంది. అక్కడఅగుపించని ప్రభాకర్ కోసం ఇటూ అటూచూస్తూ...

"లే...అన్నయ్యా! కాఫీ ఇదుగో..."

"ఆ! ... సరే" పరధ్యానంగా సమాధానమిస్తాడు. కమల కాఫీ కలుపుతూ

"ఏమిటల్లా ఆలోచిస్తున్నావు...?"

"అబ్బే! ఏం లేదు...ఇవాళ తారీకు చూడుకదూ..."

"అవునుచూడే... ఏం...?"

"నేనుఎల్లుండి బయల్దేరి వెళ్ళిపోవాలి...శలవుఅయిపోయింది.

"అప్పుడే...అయిపోయిందా..."

"ఆ...రెండు నెలలేగా..."

"అయితేనాన్నగారు...వచ్చేదాకాఅయినావుండవూ..."

"నాన్నగారు రేపటికివచ్చేస్తా నన్నారు ... ఏమయినాఅడగ డానికవీలులేదు...మళ్ళాపదిహేను రోజులలోవస్తాను..."

"ఇద్దరూ కాఫీలుతాగుతూవుంటారు. ఇంతలోకే ప్రభాకర్ వస్తాడు. వానిని చూచిఆనంద్.

"ఏమోయ్! ఇప్పుడేలేచావా ఏమిటి...?"

"ఓ అరగంటఅవుతుంది. రాత్రిసరిగానిద్దరపట్టలేదు ... అందు చేత లేవడంఆలస్యంఅయింది..."

"ఆ! కూర్చో...ఇదుగో కాఫీ చల్లారిపోతోంది..."

"మీఅన్నయ్య ఎల్లుండి వెళ్ళిపోతాట్ట..."

"అన్నదికమల ప్రభాకర్ ముఖంలోకి చూస్తూ. వెంటనే ప్రభాకర్ ఆనంద్ వంకతిరిగి,

"అవునోయ్...ఎల్లుండేనీప్రయాణం...?

"అవునోయ్...ఎల్లుండే...శెల వయిపోయింది..."

"మరి మీనాయనగారు వచ్చేదాకా అయినా ఉండవూ...'

"వీల్లేదు...కాకపోయినా ఇప్పుడేంవచ్చింది ... జాగ్రత్తగా ఉండండిమీరు...వంటమనిషి సీతమ్మవుంటుంది...."

"అదిసరేలే...కాని..."

"ఇంకెందుకూ సందేహం ... మళ్ళారెండురోజుల్లో నాన్నగారే వచ్చేస్తారు...తెలిసిందా అయితే నీడ్యూటీకి వేళ అయిందా ఏమిటి...?

"అవుతోంది ... తొమ్మిదిగంటలకల్లా వెళ్ళాలి ... అప్పుడే పావుతక్కువ తొమ్మిదయింది...బండిమీదయినా పోవాలి..."

"సరేకానీ..." ప్రభాకర్ కాఫీతాగడం వెంటనే పూర్తి చేసి త్వరితంగా దుస్తులుమార్చుకుని వెళ్ళిపోతాడు.

"అయితే అన్నయ్యా నీళ్ళుపోసుకుని వీధిలోకి వెళ్ళాలన్నావ్ ...ఎండెక్కువౌతుంది..."

అవును...వెడతాను..."

"ఆనందరావు వెంటనే లేచి క్రిందకు నీళ్ళుపోసుకోడానికి వెడతాడు. కమలఅక్కడే సోఫాలోకూర్చుని ఏదోపుస్తకం తిరగవేస్తూ తనఅన్నగారు వెళ్ళినతర్వాత తండ్రిరావడంఆలస్యమయితే ప్రభాకర్‌తో ఏవిధంగా యింట్లోప్రవర్తించాలో అనియోచిస్తూవుంటుంది కొంచం సేపటికి అరుణ వస్తుందిఅక్కడకు,

"ఏంకమలా ... ఏమిటదీ పొద్దున్నే చదివేస్తున్నావు...?"

ఏం లేదు...రా! కూర్చో ... ఇప్పుడే కాఫీలు తాగడం అయింది. ఏమిటో చాలి ఊపు స్తకం చూస్తున్నా..."

"ఇంట్లోఎవ్వరూ...లేరా ఏమిటి...?"

అరుణకు ఆయింట్లో కావలసిన వ్యక్తిఎవరో బాగుగా తెలుసును. సుగుణవతియగు అరుణ ఆనందరావును మనసార ప్రేమిస్తూన్న సంగతి కమల బాగుగ గుర్తించింది. అందుకు చాలా సంతసించింది. అందుకని చిరునవ్వుతో ఇంచుక హేళనాపూర్వకంగా.

"ఏం...ఎవరు కావాలేమిటినీకు ...? అంతావున్నారింట్లో ...నాన్నగారుమాత్రం చిన్నపనిమీద రాజమండ్రి వెళ్ళారు.

"ఉ...హూం..." అన్నది ఇంచుకసిగ్గుతో నెమ్మదిగా.

"ఏంపొద్దుటేయిల్లా దిగబడ్డావు ..? విశేషాలేమిటి...?

"ఏం చెప్పనుకమలా...అంతా విశేషంగానేవుంది ... నానాటికి శృతిమించుతోంది మాఅన్నయ్యవ్యవహారం..."

"ఆ!... ఏంజరిగిందేమిటి...?"

"ఈమధ్య తాగుడుకూడా అలవాటయింది... ఏఅర్థరాత్రో ఇంటికివస్తూవుంటాడు...తూలుతూ...ప్రేలుతూ..."

"హూం...! అంతకన్నా ఎక్కువెల్లాఅవుతాడులే..."

"ఏం...కమలా! అల్లాఅన్నావు...నీకే తెలుసు...?

"అరుణా...ఏంచెప్పను ... నువ్వింకా పూర్తిగా పెరటి దారినే వున్నావు... నేటివరకునువ్వు అనుకుంటూన్నంత యోగ్యుడు కాడని చెప్పవలసివస్తోంది..."

అరుణఆశ్చర్యపోతుంది. తానానాడు తలచినది అబద్ధంకాదేమోనని భయపడుతుంది. కంగారుగా ప్రశ్నిస్తుంది.

"ఏమిటికమలా! ఏంజరిగింది...?"

"అరుణా...అయితే చెప్తున్నా విను... ఆత్మబంధువులాంటి దానవు...అమాయకురాలవు...నీ బాగుకోరి చెప్తున్నా. ఇంతవరకు ఎవ్వరకూ చెప్పలేదు...సంప్రమాదం వస్తుందోఅని ఆఖరుకు మా అన్నకుకూడా చెప్పలేదు...ఒకనాడు మీఅన్న చేసిన దౌర్జన్యం..."

"నీకా...ద్రోహంచేశాడా కమలా!..."

"ఒకనాడు నేను నాట్యంచూసి వస్తాంటె అర్ధరాత్రి నన్ను పిలచావు గుర్తుకు వచ్చిందా..."

"ఆ! అవును...ఆనాడు కడుపునొప్పికూడావచ్చి చాలాబాధ పడ్డాడు మాఅన్నయ్య..."

"హూం! అది నిజమయిన కడుపునొప్పికాదు...తనకు అడ్డు లేకుండా నిన్ను మోసపుచ్చి డాక్టర్న పిలవమని పంపించి..."

"ఆ!...

"అవును...ఏంచెప్పను...నా [illegible] ఉదాన్ని చేసి...బలవంతపరిచ..."

"ఆ! నిజంగానే..."

"ఆ! నిజమే ... స్నేహం [illegible] ఇంత దౌర్జన్యంచేస్తాడనుకో లేదు ... అప్పుడు దేవుడులా ఆపరిభాస్కర్ అడ్డుపడకపోతే ఏమయ్యేదో...నాపని...

"ఇంతవరకూ చెప్పనయినాలేదేం...కమలా!..."

"చెప్పిఏంచెయ్యాలిఅరుణ! ఎవరితోచెప్పినాపరువు...మనకుటుంబగౌరవాలకే భంగంవస్తుందని మాట్లాడకవూరుకున్నా"

ఎంతపనిజరిగిందీ..."

ఇంతలోకి ఆనంద్ వస్తాడు నీళ్ళుపోసుకుని. వానినిచూసి అరుణ కొంచంసిగ్గుపడి కూర్చున్నదిలేస్తుంది. ఆ వెంటో కమలకూడా లేస్తుంది. ఆనంద్ అరుణనుచూచి చిరునవ్వుతో.

"ఏమిటిది...కమలా ! ఆ గుసగుసలు ?"

"ఏం లేదు అన్నయ్యా! నువ్వొ వెళ్ళగానే అరుణవచ్చింది ఏవో కబుర్లు చెప్పుకుంటున్నాం..."

"ఏం...అరుణా ! మీ అన్నయ్య ఊళ్లో ఉన్నాడా...ఎక్కడా కనిపించడమే లేదు..."

"ఆ ! ఉన్నాడు..." అన్నది ఇంచుక సిగ్గుతో ఓరకంట చూస్తూ అరుణ చేసిన సంజ్ఞ నందుకుని కమల.

"ఆ ! అతనిప్పుడు అగుపించే స్థితిలో వున్నాడా అన్నయ్యా!..."

"ఆ ! అంటే...?"

"అనడానికేముందీ...ఇదివరకు స్థితిలో వుంటేగా..."

"అంటే...ఏమిటది...?...నాకేం అర్థం కాలేదు..."

"ఆయనకిప్పుడు బ్రాందీబుడ్లు కావలసివచ్చాయ్ ... ఇంట్లో బీరువాలలో నివ్వ గ్రంథాలు చెత్తబుట్టలోకి...బీరువాలలోకి బ్రాందీబుడ్లూ బదలీ అయ్యాయి..."

"ఆ !...ఏమిటీ...రామమే...అల్లాంటిపని..."

"అహా ! అప్రియమిత్రుడే ... పాపం ఆవిషయమే అరుణ చెవుతూంటే నువ్వొవచ్చావు..."

"నిజమేనా అరుణా ! అంతగా మారిపోయాడా..."

"రెండురోజులనుంచి మరీఎక్కువయింది...అందులోనూ మరీ మితిమీరిపోయింది నిన్న రాత్రి పేలాపన ... చుట్టుప్రక్కలవాళ్ళంతా వింటున్నారు ... నాకు చాలా సిగ్గేసింది ... ఏం చెయ్యను...? ఏమయినా మీ స్నేహితుడు కాబట్టి...మీరు చెపితే..."

"అవునన్నయ్యా! నువ్వు చెపితే తప్పక వింటాడు..."

"ఏమో! నాకు వింటాడన్న నమ్మకం లేదు... అతనంతటివాడతను-అయితే మీ అమ్మగారికి ఉత్తరం రాయలేకపోయావా అరుణా!"

"కాశీను...బయల్దేరి వస్తున్నానని సమాధానంవచ్చింది... ఆవిడమాటమాత్రం లెక్కచేస్తాడా..."

ఏమో...ఏంచెప్పగలం...అలవాటుపడితే వదలడం కష్టమే"

"అయినా ఒక్కసారి నువ్వుచెప్పిచూడు అన్నయ్యా!..."

"అల్లాగే తప్పకుండా వెడతాను...ఆ! అన్నట్టు అమ్మగారు వచ్చేదాకా ఇక్కడేవుండడం మంచిదేమో..."

"దానికేముంది...ఎక్కడయినాఒకటే..."

"అల్లాగంటే వీల్లేదు ... ఇక్కడే ఉండిపోవాలినువ్వు..." అనిపట్టుపట్టిందికమల. ఏదో ఆమెనుతృప్తి పరచటందుకు కాని ఆనాడే ఆమెతల్లిరావడంవల్ల వాళ్ళయింటికి వెళ్ళిపోయింది అరుణ. ఆనందరావు బట్టలుమార్చుకుని వెళ్ళిపోయాడు.

* * * * *

మద్రాసులో డాక్టరుగారిల్లు. సాయంకాలం నాలుగుగంటల సమయం. డాక్టరుగారు ఆవేళశెలవురోజు కావడంచేత వైద్యాలయానికి పోలేదు. అప్పుడు మేడమీద కుర్చీలోకూర్చుని ఏదోపేపరు చూసుకుంటున్నారు. లలిత బట్టలుమార్చుకుని ఎక్కడకో వీధిలోకి వెళ్ళబోతూవుంటే తండ్రిఆమె నుద్దేశించి,

"ఏమమ్మాలలితా! అంతతొందరగా వెడుతున్నా వీయెండలోను..."

ఆమె చరాలున ఆగి వెనుదిరిగి తండ్రివంక నెమ్మదిగా వస్తూ,

"ఏంలేదండీ నాన్నగారూ...కొంచెంపనుండి మాస్నేహితురాలు పద్మయింటికి వెడుతున్నాను..."

"అంతఅర్జంటుగా, యింతఎండలోనూ వెళ్ళవలసినంత పనేమొచ్చిందీ..."

"ఏంలేదండీ...ఏదోమాట్లాడేపనుంది రమ్మనమని కబురు చేసింది...వెడుతున్నా..."

"సరేవెడుదువుగాని కాని కొంచం సేపిల్లాకూర్చో మాట్లాడాలి..."

ఆమె ప్రక్కకుర్చీలో కూర్చుంటుంది. ఎంతోవినయవిధేయతలతో ప్రశ్నిస్తుంది.

"ఏమిటండదీ..."

"ఏంలేదమ్మా! నాకూ పెద్దవయస్సువస్తోంది...ఏదోనువ్వూ కొంతవరకూ చదువుకున్నావు. వయసొచ్చినపిల్లవు ... ఆశాస్త్రనీ పెళ్ళి అయిందనిపించేశానంటే చచ్చిస్వర్గానవున్న నీతల్లి...తుదికోర్కె తీర్చిన వాణ్ణేఅవుతాను...నాబాధ్యతతీరుతుంది..."

ఆమె కొంచంసిగ్గుపడుతుంది. వివాహవిషయంతలిస్తే సిగ్గుపడడం సహజవిషయమేకదా.

"ఇప్పుడంత తొందరేమొచ్చిందండీ నాన్నగారూ!"

"తొందరకాదాతల్లీ! ... ఈడొచ్చినపిల్లవు ... వివాహమయ్యాకసంసారం దిద్దుకుంటూవున్న శోభఇప్పుడుంటుందా అమ్మా! ...నామాటవిను..."

"ఏమిటోనాన్నగారూ...మీరల్లాగంటే..."

"అల్లాఅనడంకాదు...నువ్వూకూడా యోచించుకోతల్లీ ... ఇంకఇల్లాగేవుంటే బాగుండదు...నిన్ననేవచ్చారు బందరు, డాక్టరు కామశాస్త్రిగారు...ఆయనకొడుక్కు ఇవ్వమంటూ..."

"ఈకుర్రవాడు బుద్ధిమంతుడు...ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ చదివాడు ... ఈసంవత్సరమే తుదిపరీక్షకు వెళ్ళాడు ... మళ్ళారేపు వస్తారు. తండ్రీకొడుకూను..."

"ఊ...హూం!"

"ఏమంటావు...?"

"ఏమంటాను...మీ మాటకెన్నడయినా ఎదురుచెప్పానా.?"

"అల్లాగంటే యెల్లాగమ్మా... అనుభవించవలసినదానవునీవు, బలవంత పరచవలసిన విషయంకాదు ... బాగా యోచించుకో..."

"ఎంత యోచించుకున్నా మీకన్న ఎక్కువ తెలుసుకో గలనా నాన్నగారూ! మీ యిష్టంవచ్చినట్లు కానియ్యండి ... నాకు అంతా సమ్మతమే..."

ఏమయినా నీతల్లిని మరపిస్తున్నావమ్మా ... నీబాగుకాక నాకింకేమి కావాలి... ఆమెబ్రతికుంటే......"

"అనుకునిమాత్రం ఏంలాభం నాన్నగారూ..."

"సరేవెళ్ళిరాఅమ్మా! అన్నట్లు మీ స్నేహితురాలు పద్మకు కొంచం వంట్లో బాగాలేదన్నావు...ఎల్లావుందిఆమెకు...?"

"మరేంలేదండీ...మనస్సులో ఏదోబెంగచేత అల్లాగేనానాటికి నీరసించిపోతోందిపాపం..."

"అయ్యో! ... ఎంచేతనో...?"

"మరేంలేదు...శంకరావు నెరుగుదురా ... వకీలురాఘవరావు బావమరిది..."

"ఆమాటవినగానే డాక్టరుగారు గ్రుడ్లుపెద్దవిచేసి కనుబొమ్మ లెగురవేస్తూ ఆతురతగా

"ఆ! అవును...ఈమధ్య నేదో ఖూనీ కేసులో ఉన్నాడట... ఎక్కడకో పారిపోయాడటకూడాను...వానిసంగతేమొచ్చిందిప్పుడు?

"అదేవచ్చినచిక్కు మొదటినుండీఎవరికీ తెలిసిందికాదు... వాణ్ణిప్రేమించింది...వానినితప్ప ఇంకెవ్వర్నీ పెళ్ళాడనంటుంది ..."

"బాగానేవుంది ...విషయం ... అయితేనువ్వూఈవిషయంలో తిరుగుతూన్నట్లే తోస్తూంది నీహడావడిచూస్తే..."

"అబ్బే... లేదండీ..."

"ప్రమాదముసుమా...అనవసరపు గొడవలకు వెళ్ళకు..."

"అనవసరం ఏంలేదండీ...పాపం ఆమె అవస్థచూస్తుంటే నాకు చాలా విచారం కలుగుతోంది..."

"అల్లాగేపాపం...కాని అతడొక నేరస్థుడని తెలిశాకకూడా బుద్ధిమార్చుకోలేదూ..."

"ఆమెసంగతి అల్లాంటిదికాదండీ...మంచికయినా చెడుగు కయినా ఆమెభయపడదు..."

"కావచ్చుకాని పాపం మరి ఆమెకేం సుఖం ఇది. పైగా వానిజాడా జవాబూకూడా లేదు..."

"ఏమో ఇంతకూ దైవవిధి ఎల్లాుందో ... అతనుమాత్రం చాలామంచివాడే..."

"పాపం రాఘవ ప్రభాకర్ కలరావచ్చిపోయింది...ఆరాఘవరావు గుండెజబ్బుతో బాధపడుతూ ఆస్పత్రిలోనేవున్నాడు..."

"అల్లాగా...పాపం...మాదొడ్డమనిషి...సుమండీ..."

"సరేలే...జాగ్రత్తగావెళ్ళిరా..."

లలిత సత్వరంగా బయల్దేరి అక్కడనుండి వెళ్ళిపోతుంది. డాక్టరు సోమశేఖరరావుగారుకూడా తమపనిమీద వెళ్ళిపోతారు అక్కడనుండి లోనికి. సోమశేఖరరావుగారికి సుమారు ఏబదియైదు వత్సరముల వయసుండును, మిక్కిలి తెలివైన వైద్యుడు, సిద్ధహస్తుడు. ప్రభుత్వవైద్యశాలలో ప్రధానవైద్యుడు. శాంతస్వరూపుడు. ధనికుడు. భార్యపోయినప్పటినుండీ ఇప్పటివరకు సుమారు పదిహేను సంవత్సరాలుపాటు లలితను అతిగారాబంగాపెంచి పెద్ద చేశాడు. తగురీతిని విద్యాబుద్ధులు చెప్పించాడు. తనభార్య సుమారు పదునైదు వత్సరములక్రితము విషజ్వరపీడితురాలయి మరణించినది,

పోవునప్పుడు భర్తను పిలచి తన మూడేండ్లలలితను వానికొప్పగించి ఆమెకెట్టి కష్టములు కలుగచేయక పెంచిపెద్దదానినిచేసి ఒకయింటి దానిని చేయుమనికోరి భర్తచే ప్రమాణం చేయించుకొని స్వేచ్ఛగా ప్రాణవాయువులు వదలినది. అప్పటికి సోమశేఖరరావుగారికి నలుబది వత్సరములప్రాయంబే అగుటచేతను, అప్పుడే క్రొత్తగా గవర్నమెంటు ఆస్పత్రిలో సర్జన్ పదవి లభించుటచేతను, ధనాధిపతియగు వానికెందరో వివాహమునకై పిల్లలనిత్తుమని అడుగవచ్చినను తన ముద్దుల కుమార్తె లలిత కెక్కడ సవతితల్లిపోరు సంభవించునో యను సంకోచముతో, పైగా ఆధ్యాత్మిక చింతగలవాడై వివాహ యత్నముమాని ధర్మబుద్ధితో దైవభక్తికలిగి కాలమువెళ్ళబుచ్చుచూ ఎంతో గారాబముగా పెంచి లలిత నీవన్నెకు దెచ్చినాడు. ఆయన ఆశలన్నియు ఒక్కలలితమీదనే యున్నవి. లలితలేకున్న ఆయనకు ప్రపంచమే లేదన్నట్లున్నది. అందుచే ఏవిషయమునందు గూడ ఆమెకు కఠినమయిన ఉత్తరువు లీయజాలినవాడుకాదు. ఇట్లున్నది వీరిపరిస్థితి.

విజయనగరపు వింతల నింపుకరయుదయము. ఆనాడు అయిదవ తారీకు. ఆనందరావు ప్రయాణపు దినము. సుమారు ఉదయం పది గంటలు సమయం. ఆనందరావు భోజనంచేసి దుస్తులుధరించుకుని మేడమీదగదిలో ప్రభాకర్‌తో యేమో సంభాషిస్తూ వుంటారు. సామాన్లు బండిలో పెట్టడానికివచ్చిన అప్పన్న ఎందుచేతనో గాని ఆప్రక్కగొదిగి వారిసంభాషణ వింటూఉంటాడు. కమలకూడా ఇంతలోకి అక్కడకు వస్తుంది.

“అయితే ప్రభాకర్! నాన్నగారింకా రాలేదు ... నువ్వే కాస్త అన్నివిషయాలూ చూస్తూవుండు...”

“అల్లాగేలే...మరేంబాధలేదు ...”

"బహుశా నాన్నగారు రేపో ఎల్లుండో వస్తారు... కాని నాకు ఆగడానికి వీలులేదు ... అందుచేత కాస్త జాగ్రత్తగా వుండండి. కమలా! ఇంట్లో ప్రభాకర్ ఉంటాడు కాస్త జాగ్రత్తగా ఉంచేసరి. మళ్ళా పది హేనురోజులలో వస్తాను.

"అయితే తప్పకుండా వస్తావా అన్నయ్యా!" ప్రభాకర్ అందుకుని.

"అల్లాగే నోయ్ ఆనంద్!..."

"తప్పకుండా నేవస్తాను... లే కమలా!"

చేతిగడియారం చూసుకుని, తొందరగా.

"అబ్బా పదిన్నరయిందే ... చూడు ... అప్పన్నా ... అప్పన్నా!..."

"నేనుపిలుస్తాను లేఅన్నయ్యా!..."

అంటూ కమలకిందకు వెడుతుంది. కాని అప్పన్న ఆ ప్రక్కనే వున్నాడు. ఆనంద్ ప్రభాకర్‌ల రహస్యసంభాషణ వింటున్నాడు.

"కానీ ... ఆనంద్ ... నువ్వుకూడా వెళ్ళిపోతున్నావు ... ఎంతకాల మీ అజ్ఞాతవాసం"

"మళ్ళీ నేను పది హేనురోజులలో వచ్చి వేస్తానుగా ... కాకపోయినా నీకు అడ్డేమిటీ ఇంట్లో ... రేపో ఇవాళో నాన్నగారుకూడా రానేవస్తారు ... ఇదంతా మనదే ... అల్లాంటిభేదం పెట్టుకోకు ... ఒకర్తే ఉండలేదు కమల ... అందుచే నీకువచ్చిన బాధేంలేదు..."

"అవును ... కానీ..."

"ఇంకేమిటి ... ఇంకా అజ్ఞాతవాసమంటావా ... అది తప్పదు ... సత్యం బయల్పడేవరకూ అంతే ... అంచేత నువ్వేమీ విచారించనక్కర్లేదు..."

"సరే...ఏంచేస్తానూ..."

ఈలోగా కమలమల్లా వస్తూండడంచూచి అప్పన్న ఆప్రక్కకు ఒదిగి ఆమెగదిలో ప్రవేశించిన మరుక్షణంలో తొందరగా అక్కడకువచ్చి ఆసామాన్లు బండీలో పెడతాడు. ఆనంద్ ప్రభాకర్‌లు బండీఎక్కుతారు. వాయువేగంతో వెళ్ళిపోతుందిబండి. స్టేషన్‌కు చేరేటప్పటికే అప్పుడేమెయిలువచ్చివుంది. గబగబా కూలీచేత సామాన్లు ఒకసెకండ్‌క్లాస్‌పెట్టెలో పెట్టిస్తాడుఆనంద్. అక్కడ ప్రకాష్‌అగుపిస్తాడు.

"ఏమోయ్‌ఆనంద్ ! ఇవేళేనా యేమిటిప్రయాణం...?"

"అవునోయ్..."

"మంచిది...సుశీల యెప్పుడు...?"

"ఉందిగామల్లా పదిహేనురోజుల్లో..."

"గుడ్...వెళ్ళిరా..." ప్రకాష్ వెళ్లిపోతాడు.

"చూడూ...నువ్వేమీ కొంపలు మునిగిపోయినట్లు భావించుకోకు...మాఫాదర్ త్వరలో శలవచ్చేస్తారు."

"ఎంతమాట నీసాయం మరువగలనా..."

రైలుకదులుతుంది. ఆనందరావు బండీఎక్కుతాడు.

"మరివస్తానోయ్..."

"మంచిది...శుభం...వెళ్ళిరా..."

రైలువెళ్ళిపోతుంది. పన్నెండుగంటలనుండి తనడ్యూటీకి అక్కడేవుండిపోతాడు ప్రభాకర్.

పంద్రెండవపరిచ్ఛేదము సమాప్తము.

---

# పదమూడవ ప్రకరణము

సాయంకాలం ఏడుగంటలవుతుంది సమయం. పాపం మిక్కిలి బాధపడుతూ తలనొప్పితో ప్రభాకరరావు ఎట్లో అంతవరకు తన డ్యూటీపూర్తిచేసుకుని విపరీతమయిన ఆ తలబాధతో యింటికి వస్తాడు. ఇంటిదగ్గర అప్పన్నమాత్రంఉన్నాడు. ఇంకెవ్వరూఉన్న అలికిడిలేదు. వడలు చెమటపట్టి చాలాఅసహ్యంగావుండడంచేత ఎట్లోనీళ్ళుపోసుకుందామనుకున్నాడు, తలబాధ ఎక్కువగా ఉండడం చేత చేత్తో తలనదిమిపట్టుకుని సోఫాలోకూలబడి.

"అప్పన్నా ! యింట్లోఎవరూ లేరాయేమిటి...?"

"ఎవ్వరూలేరుబాబూ ! కమలమ్మగారు ఎవరోవస్తే ఆరితోటి మొదటాట సినిమాచూడ్డానికెళ్లారు..."

"సినీమాకా !...ఎవరోవచ్చారా...! ఎవరువారు...?"

"ఏమో యెవరో ఇద్దరమ్మాయిలొచ్చారు. మనకమలమ్మ గోరిలాగేవున్నారు. అంతాకలిసెళ్ళేరు ఇందాకానే..."

"ఉ...హూం ! సీతమ్మగారేరి...రాలేదా...?"

"వచ్చారుబాబూ ! ఆవిడగారూ యిప్పుడే పరుగెత్తింది ఇంటికి..."

"ఏం...ఎందుకు?"

"ఆరివోడెవడో చచ్చిపోయాడట ... కబురొచ్చింది...లబో లబోమంటూ యిప్పుడే అల్లాగెళ్లింది...మీరిల్లాగొచ్చారు..."

"అబ్బా !...హూం !...బాగానేవుంది...అన్నీ ఒక్కసారొస్తాయి..."

"ఏంబాబూ ! తలసేత్తోపట్టుకున్నారు...తలబాధగుందా..."

"అవునప్పన్నా ! చంపేస్తోంది...అబ్బబ్బా ! కాసిన్ని వేడినీళ్ళు కాచు పోసుకుంటాను...చాలాచిరాకుగావుంది ..., ఆ..., చూడూ క్లబ్బుకువెళ్ళి ఓకప్పుకాఫీపట్రా..."

"అల్లాగే బాబూ ! ఇప్పుడే తెస్తా..."

"(మళ్ళావిషుఖతగల్ది) వద్దులే...ఇక్కడికి తెచ్చేసరికే చల్లారి పోతుంది...పోయి నువ్వు నీళ్ళు కాచు...తర్వాత సంగతి చూద్దాం..."

అప్పన్న తిన్నగా వెళ్ళి పెరట్లో నీళ్ళు కాచుతూవుంటాడు. ప్రభాకర్ తిన్నగా మేడమీదకు వెడతాడు. అక్కడ దుస్తులుమార్చుకుని క్రిందకువస్తాడు. ఎల్లాగో బాధపడుతూనే 'స్టౌ' వెలిగించి దాని మీద కాఫీకి నీళ్ళు పెడతాడు. అవి కొంతసేపటికి కాగగానే పొడుం వేసి తర్వాత వడియగట్టి పాలూ పంచదారా కలుపుతాడు. తిరుగ బోతకు తీస్తూంటే చెయ్యి కాలుతుంది. ఆగిన్నె వదలివేస్తాడు. కాఫీ పూర్తిగా నేలపాలవుతుంది. పైగా ఆ వేడి కాఫీ చేతిమీదపడి చెయ్యి బాగాకాలి బొబ్బలెక్కుతుంది. అసలే తలబాధగావుందేమో దానికి తోడుయీబాధలుకూడా ఎక్కువవడంతోటి విసువుపుట్టింది. దాంతో కోపంవచ్చి అవన్నీ అక్కడేవదలివేసి 'స్టౌ' ఆర్పేసి ఆబాధతోనే పోయి మేడమీదపడుక్కుంటాడు. ఎల్లాగో ఓఅరగంటకు నిదురపడుతుందిగాఢంగా. ఈలోగా అప్పన్ననీళ్ళుకాచి ప్రభాకర్‌ను పిలవడానికివస్తాడు. ప్రభాకర్ గాఢనిద్రలో ఉండడంచూసి పిలవడానికి సందేహిస్తాడు. అక్కడకూసాహసించిపిలుస్తాడు.

"బాబూ ! బాబూ !! నీళ్ళు కాచేను బాబూ..."

ప్రభాకర్ పలుకడు. అప్పన్నమళ్ళాపిలుస్తాడు.

"బాబూ! నీళ్ళుచల్లారిపోతున్నాయి...లేవండిబాబూ!..."

ప్రభాకర్ లేవడు. అప్పన్నకు విసువుపుడుతుంది. పైగా తలబాధతో పడుక్కున్నవాడిని లేపడం భావ్యంకాదనుకుని తిన్నగాపోయి క్రిందివీధివరండాలో కూర్చుంటాడు. ప్రభాకర్‌కు మెలకువలేదు. పాపం ఆకాలిన చెయ్యిమాత్రం బాగాకమిలిపోయి బొబ్బలెక్కివుంది.

ఆఖరుకు దానికయినా ఏమందూపెట్టలేను. కొంచంజ్వరంకూడా తగిలింది. రాత్రిపదిన్నర గంటలవుతుందనుకొను. అప్రుతగా కమల వస్తుంది. అప్పన్న వీధిసావిడిలోకూర్చుని కునికిపాట్లు పడుతూ వుంటాడు. కమల పిలవగానే త్రుళ్ళిపడిలేస్తాడు. తలుపు తెరుస్తాడు.

"అప్పన్నా!..."

"అమ్మా!..."

"ప్రభాకరంబాబువచ్చారా...?"

"ఆ...చాలాసేపయిందమ్మావచ్చి...తలబాధగావుంది నీళ్లు పోసుకుంటాను... వేడినీళ్ళు కాచమన్నారు ... కాచాను...తీరా వచ్చిచూద్దును బెమ్మాండంగా నిద్దరోతున్నారు..."

"తలనొప్పిగావుందా...అయ్యోపాపం, ... భోజనంచేశారో లేదో...సీతమ్మవెళ్ళిపోయిందా యేమిటి...?"

"భోజనంలేదు ... ఏంలేదమ్మా! ... పాపం వీధిలోంచి వస్తూనే పక్కమీద వాలేరు...ఎంతో బాధపడ్డారు..."

"సీతమ్మగారేదీ...?"

"ఆళ్ళబాళ్ళెవరో పోయారట...సందాళయెవరో కబురెట్టారు...దాంతో లబోలబోమంటూ యెక్కడివక్కడ దిగయిడిసి పరుగెత్తింది..."

"బాగానేవుంది...ఏమయినావండిందో లేదోకూడాను..."

"ఏమోనమ్మా ... మీరూవెళ్ళిన మరొకఘడియకు ఆవిడా వెళ్ళిపోయింది..."

"మళ్ళాయేవారంరోజులదాకానో రాదుకాబోలు..."

అంటూనే లోపికి వెళ్లి మేడయెక్కి గదిలో ప్రవేశిస్తుంది. అక్కడప్రభాకర్ మంచంమీద పడుకొని వళ్ళుతెలియని నిద్దరలో వుంటాడు. ఆమె చప్పుడుకాకుండా మంచందగ్గరకు వెళు

తుంది. అక్కడ ప్రభాకర్ దీర్ఘనిశ్వాసములు వదలుతూ గాఢనిద్ర లోవుంటాడు. అంతటినిద్రలో వున్నవాడిని లేపి నిద్రాభంగం కల్గ చేయడం భావ్యంకాదని క్షణకాలంఆగి మరల వెనుతిరిగి క్రిందకు వచ్చేస్తుంది. అప్పన్నను పిలుస్తుంది. ఆపిలుపుతో అప్పన్న హాజరవు తాడు.

"అప్పన్నా!..."

"ఏమమ్మా...ఎందుకు పిలిచారూ..."

"నీళ్ళు కాచేవా...?"

"ఆ!...ఎంతో సేపయిందమ్మా...మళ్ళా చల్లారేపోయి ఉం టాయి ఈపాటికి..."

ఆసమాధానం వినిపించుకోకుండానే కమల తిన్నగావంట యింట్లోకి వెడుతుంది. అక్కడవస్తువులన్నీ చాలా చిందర వందరగా పడివున్నాయి. అక్కడస్టౌ; వలికిపోయిన కాఫీమొదలయినవి చూస్తుంది. ఆపనిఅంతా ప్రభాకర్ దే అయివుంటుందనుకుంది. పాపం కాఫీ త్రాగు దామని కాబోలు కాచినట్లున్నాడు. అంతావలికిపోయినట్లేవుంది. త్రాగేడో లేదో. అని అనుకుంటూ వంట సామగ్రిచూచింది. అన్నం మాత్రంవండినదిఉంది. ఇంకే పదార్థాలూ లేవుఅక్కడ.

"పోనిలే...ఏదో. ఇంతఅన్నమయినా ఉడకబెట్టిపారేసింది ...నయమే...!"

"అప్పన్నా!...అయ్యగారు కాఫీ కాచారాయేమిటి...?"

"ఏమోనమ్మా! అప్పుడే ఏదో 'స్టౌ' మాత్రంముట్టించారు సుమండీ..."

"పాపం అదికూడా త్రాగినట్లు లేదు...అంతా క్రిందేవలికి పోయినట్లుంది..."

"ఏమోనమ్మా!..."

మరల కమల మేడమీదకు వస్తుంది. అప్పటికి ప్రభాకర్‌కు కొంచెం తెలివి వస్తూవుంటుంది. పాపం బాధ చేత మూల్గుతూవుంటాడు. కమలకు కొంచం ధైర్యం తక్కువౌతుంది. రాత్రిసమయం,... ఒంటరితనం,...ఆత్రుతకొలదీ నెమ్మదిగా వానిమంచం దగ్గరకు వెడుతుంది. అతనిమూల్గు ఏమీతగ్గలేదు. ఎంతో బాధ పడుతున్నాడనుకుంది. ఆమెవానిమూల్గువిని భరించలేకపోయింది. వణుకుతూన్న చేతితో సాహసించి వానినుదురు తాకుతుంది. భయంతో వడలంతా చెమటలు పోసేస్తాయి. అదే ప్రథమపర్యాయము పరపురుషుణ్ణి ముట్టుకోవడం. ఆమెకు తలతిరిగిపోయిన ట్లయింది. చేతులు గజగజ వణకిపోయినాయి. వానినుదురు కాలిపోతూవుంది. అంతటి వేడిగా వుండడంవల్ల జ్వరం తీవ్రంగానే కాసివుందని భావించింది. ఆమెవణుకు తగ్గుతున్న చేతిస్పర్శకు ప్రభాకర్‌కు పూర్తిగా తెలివివస్తుంది. కన్నులు తెరుస్తూన్నాడు...ఎదురుగా కమల ఆత్రుతగా దీనవదనంతో తననే చూస్తూవుంటుంది. ప్రభాకర్ కన్నులు తెరవగానే కమల తటాలున తన చెయ్యి వెనుకకు తీసుకుంటుంది. ప్రభాకర్ ఆమెను హీనస్వరంతో ప్రశ్నిస్తాడు. ఆమెగద్గదకంఠంతో జవాబిస్తుంది.

"ఏం...కమలా!...వచ్చావా...?"

"ఆ!...ఏమండీ...పడుక్కున్నారూ...? వళ్లుకూడా వేడిగా వుంది...జ్వరమొచ్చినట్లుందే..."

"ఏమో ... కాని ... ఇంతసేపూ తలబాధమాత్రం అపరిమితంగా బాధించింది ... ఇప్పుడే...అబ్బా! కొంచంతగ్గింది ... ఎంతసేపయింది నువ్వువచ్చి..."

"ఇంతకిప్పుడే వచ్చాను...అయితేఏమీతినకుండానే పడుక్కున్నారన్నమాట..."

"నాకేమీ ఇప్పుడక్కర్లేదు కమలా !... ఏదో కాస్త కాఫీ ... కాచుదామని మొదలుపెడితే ... అంతా అయ్యాక అది కాస్తా వలికి పోయింది...చేతిమీద పడి చెయ్యి కాలింది...పాపం అప్పన్నను నీళ్ళు కూడా కాచమన్నాను పోసుకుంటానని...అయితే ఇప్పుడు టైమెంత యింది..."

"పదిన్నర అవుతుంది...ఏదీ ఎక్కడ కాలిందీ ... ఏమయినా మందు పెట్టారా..."

అంటూ వచ్చి ప్రభాకర్ చేతిని పరీక్ష చేస్తుంది. ప్రభాకర్ కాలి, బొబ్బలెక్కిన చెయ్యి చూపిస్తాడు. ఆమె పాపం ఎంతో జాలిగా చూసి చర్మం కూడా ఊడిపోయి ఎర్రగా పుండు పడడం చూచి.

"అయ్యొయ్యో !...ఇదేమండీ...ఇంత ఇల్లా కాలిపోతే ఆఖరుకు కొంచం నూనె అయినా రాసుకుండా ఊరుకున్నారూ..."

"ఏమిటో ఒకదానిమీద ఇంకొకటి అన్నీ ఒక్కసారి వచ్చి పడ్డాయి...ఆ బాధలో ఏం చేసిందీ కూడా తెలియలేదు..."

"మంచిపనే చేశారు...ఉండండి కొంచం మందు రాస్తాను..."

అంటూ వెళ్ళి అక్కడే అలమారులో వున్న ఒక సీసా తెచ్చి అందులోని మందును జాగ్రత్తగా కాలిపోయిన వాని చేతికి రాస్తూ,

"బాగా వేడిచేసిపోయినట్లుంది ... కొంచం మజ్జిగ అన్నం తిన కూడదండీ...కాస్త చలువ చేస్తుంది..."

"ఇప్పుడేం వద్దు లేకమలా !...నాకొట్టే ఆకలి లేదు..."

"ఏం...ఎందుకు లేదూ.. మీరేమీ తినందే ... లేవండీ... నా మాట వినండీ..."

"నన్నేం బలవంతం చెయ్యకు కమలా ! నాకిప్పుడేమీ వద్దు— చాలా రాత్రి అయింది...పోయి కాస్త తినిరా...అన్నట్లు సీతమ్మ గారు కూడా లేదు...ఏమయినా వండిందో లేదో..."

"ఏదో అన్నంవండి పడేసిందిలెండి...పోనీ కొంచంకాఫీ అయినా తాగికండి కలిపి పట్టుకువస్తాను.

"ఇప్పుడేం వద్దులే...నువ్వువెళ్ళి భోజనంచేసిరా..."

"నాభోజనానికేమిలెండి...కాస్తకాఫీచేసి పట్టుకువస్తాను... త్రాగుదురుగాని..."

"సరేనీయిష్టం...ముందునువ్వు భోజనంచెయ్యి..."

"అల్లాగేలెండి..."

అంటూ కమల గబగబా క్రిందకు వెడుతుంది. అక్కడపడి వున్న గిన్నెలను మరల సరిగాతీసి సర్ది 'స్టౌ' వెలిగించి మళ్ళానీళ్ళు కాచుతుంది కాఫీకి. ఈలోగా ప్రభాకర్ కాస్తతలబాధ తగ్గడం మూలాన ఏవేవో వింతవింత ధోరణిలో ఆలోచించ మొదలు పెట్టాడు. వానికి అమాయకురాలయిన యీకమలధోరణి ఏమీఅర్థం కావడంలేదు. ఇదంతాఏమిటి...? ఇప్పటికే చాలా శృతిమించు తోంది. ఆమెను తాను వంచిస్తూన్నట్లు భావించాడు. తననిజ వృత్తాంతం అంటే ఖూనీనేరస్థుడని తెలుపకుండా ఎంతకాల మిల్లాగ ఆమెనుమోసపుచ్చడం. ఆమె మనస్సు పూర్తిగా వానిపై లగ్న మయినట్లు తోస్తోంది. అదివానికిష్టంలేదు. తాను నేరస్థునిగా పరిగ ణించబడినప్పుడు తనకు శిక్షతప్పదు. పాపం అమాయకురాలగుకమల కేమితెలుసును. ఇప్పుడు తెలిసుచెప్పిన ఏమిప్రమాదము వచ్చునో. ఈవిధంగా తనలోతాను గొణుగుకుంటూవుంటే ఎందుచేతనోగాని పక్కలుసర్దుటకువచ్చిన అప్పన్న అతిజాగ్రత్తగా వింటున్నాడు వీని మాటలు. మళ్లాప్రభాకర్ తన ధోరణిలో గొణగడంప్రారంభించాడు.

"ఇంతకూ...అక్కడ మా శావా అక్కా ఎట్టిపరిస్థితులలో వున్నారో...నాజాడలు చెప్పమని పోలీసు వారినేమిబాధిస్తున్నారో

...వాళ్ళు ఏమిబాధలు పడుతున్నారో ... ఎంతకాలం నాకీఅజ్ఞాతవాసం...? అబ్బే!...ఇదేంబాగాలేదు ... నేను చాలాతప్పుడుమార్గాన్ననుసరిస్తున్నా...ఆనంద్! ...నిజంగా ఎంతమంచివాడవోయ్!... ఆనాడు నీచేతుల్లో పడ్డప్పుడు...ఏదో ప్రమాదమే వస్తుందని చాలా భయపడ్డాను...కాని, నీవు నాపాలిటి దైవమయ్యావు ... అపరచితుడనయినా...నాస్థితి బాగుగా గుర్తించి అపరాధిని కానని గ్రహించి...ఆదరించి ఆశ్రయమిచ్చావు. సురక్షితంగా నీయింట స్థానమిచ్చావు...నీతో సమానగౌరవ మర్యాదలిచ్చావు...అల్లాటి సందర్భంలో అమాయకురాలయి నీసోదరిని మోసగించనా...ఛీ! ...ఛీ!...ఎంతమాటపాపం...ఆమెకేం తెలుసును ... నన్నునమ్మి ఇల్లుఅంతా నాకు వప్పగించి...కొంచమయినా సంశయించక భారమంతా నాపైనమోపేవు...ఇప్పుడు కమల నన్ను గురించి చాలా తప్పుమార్గాన బోతోంది. ఆమెకెల్లా బోధించను...హూం! ఒరే ...ఎంతకాలమున్నా ఇల్లాఉండవలసిందేకదా...ఈమెధోరణి నన్ను నానాటికి వెర్రివాణ్ణిచేసేస్తోంది...ఈమె నాకొరకు పూర్తిఆశలు పెట్టుకున్నట్లుగా వుందిధోరణి...ఆమెను వంచించి ఆమెజీవితం నాశనం చెయ్యనా...ఛీ! ... చెడ్డవాణ్ణి ఎల్లాగూ చెడ్డాను ... అనవసరంగా అమాయకురాలు, కమలను మోసగించడంగా ... అల్లాఎన్నడూ చెయ్యను. ఆమెకు నానిజస్థితిచెప్పేస్తే!...ఏమో ఏమనుకుంటుందో, ...ఏమనుకుంటుందీ...పోనీ ఆమె ఎట్లుభావించినా మంచిదే... సాధ్యమయినంత త్వరలో ఇక్కడనుండి పోతేమంచిదేమో ... అయితే ఇల్లాటిస్థితిలో ఎక్కడకు పోవడం...? పాపం...ఆనంద్ మాట త్రోసివేయనా...అబ్బా! ఏంచిక్కుపరిస్థితులు ఏర్పడ్డాయ్... ఏంచెయ్యను..."

ఈవిధంగా సందర్భక్రమం లేకుండ ఏవేవో పిచ్చిఆలోచనలు ఆలోచించడం మొదలుపెట్టాడు. ఇంతలోకే కమల కాఫీపట్టుకువస్తూ వుంటుంది. అప్పన్న ఆమెరాకచూచి ఆప్రక్కకు ఆమెచూడలేనిరీతిని దాగుతాడు. ఆమెతిన్నగా గదిలో ప్రవేశిస్తుంది. ఆమెరాకతో ప్రభాకర్ పిచ్చియోచనలకు అంతరాయం కల్గింది.

"ఏమండీ! ...అల్లాకూర్చున్నారు... ఎల్లావుందివంట్లో...?"

"చాలావరకు తగ్గింది కమలా! .... ఇదేమిటీ ... నీభోజన మయిందా...?"

"ఆ! అయింది...ఇదుగో మీ కే కాఫీ తెచ్చాను ... చల్లారి పోకుండా త్రాగండి..."

"ఎందుకు కమలా! నువ్విల్లా శ్రమపడతావు ... ఇప్పుడేమీ వద్దన్నానుగా...నువ్విల్లా కష్టపడడం నాకేమీ బాగాలేదు..."

ఆమెఒక్కసారి ప్రభాకర్ ముఖంలోకిచూసి తల క్రిందకు దింపుకుని మరల చిరునవ్వుతో కొంచం అమాయకత్వంగా,

"ఇందులో కష్టానికేముందండీ...ఆడదానను యింట్లోవుండి ...ఆపాటిచేసిపెట్టకపోతే ఎల్లాచెప్పండీ...ఇందండి ... ముందుదీన్ని పుచ్చుకోండి చల్లారిపోతోంది..."

కమల కాఫీకప్పు ప్రభాకర్‌కు యిస్తుంది. అతడది అందుకుని మెల్లిగా త్రాగుతూవుంటాడు. కమల ఆప్రక్కనే నిలచి సంతృప్తిపడి ప్రభాకర్‌వంక చూస్తూవుంటుంది. ప్రభాకర్ అంతవరకునుపడ్డ మనోవేదన బయల్పడనీయక శాంతంతో మందస్వరంతో,

"అయితే కమలా! ఏసినీమాకు వెళ్ళావుఇవాళ...?"

"కిస్మత్‌కు హిందీ ... చాలాబాగుందండీ...పాటలుకూడా బాగున్నాయి..."

"ఊ...హూం! అయితే ఎవరెవరు వెళ్ళారు...?"

"నేనూ అరుణా ... ఇంకో అమ్మాయీ వెళ్లాం ... మీ రిదివరకు చూశారా...?"

"లేదులే ... అంత బాగుందా...?"

"ఆ! ...చాలా బాగుంది ...మీరుకూడా ఓమారు చూడండీ"

"అల్లాగే లే,..మనమంతా వెడదాం..."

కాఫీత్రాగడం పూర్తిఅవుతుంది. అతడిచ్చినకప్పు ఆమె అందుకుని ఆప్రక్కన పెడుతుంది.

"ఏమండీ...కాస్త నింపాదిగా ఉందా...?

"ఆహా!—నీఅమృత హస్తంతో చేసియిచ్చిన కాఫీత్రాగేక ఇంకా సులువుగా వుండదూ..."

చిరునవ్వుతో ప్రభాకర్ అన్నదానికి కమలకొంచం సిగ్గుతో తలవంచుకుని.

"అబ్బా! ఏంపొగుడుతారండీ..."

"ఇందులో పొగడ్తేముంది కమలా! ఉన్నమాటేఅన్నాను... వంట్లోఉన్నబాధంతా పోయింది ఒక్కసారిగా..."

"దానికేంగాని...ఒక్కవిషయంఅడుగుతాను-చెపుతారా?"

"ఆహా! నేనెరిగున్నంతవరకు నిరభ్యంతరంగా చెపుతాను"

"మాటతప్పరుగదా..."

"ఏమిటి కమలా! ఎప్పుడయినా..."

"అయితే...ఇప్పుడు చెప్పండీ ... ఎన్నిమార్లడిగినా ... తర్వాత, తర్వాత అంటూ వాయిదాలు వేస్తూనేవచ్చారు ...ఇప్పుడు చెప్పక తప్పదు...మీచరిత్ర...!"

"ఆ! చరిత్రా!..."

అంటూ ఒక్కసారి నిర్ఘాంతపోయాడు. వడలు ఝల్లుమన్నట్లయింది. గుండెలోరాయిపడ్డట్టయింది. బుర్రలో అనేకఆలోచనలు

పరుగులెత్తాయి. అప్పట్లో ఆమెకేమిసమాధానమియ్యాలో అర్థం కాలేదు వానికి. తనచరిత్ర అంతాగుప్తపరచి ఆమెకుమభ్యపెట్టి మాయచేయడమూ, పరిస్థితులెట్లామారినా తనసంగతి ఆమెకుచెప్పి వేయదలచాడు. అప్పటిమట్టుకు ఆవిషయంవదలిప్రసంగంమరియొకలా మారుద్దామని యత్నిస్తాడు. కొంచం స్వస్థతచెంది నెమ్మదిగా చిరునవ్వుతో,

"ఓశ్ ...ఇదేనా నువ్వడిగేది...ఇంకాయేమి అడుగుతావో అనుకున్నాను ... దీనికింతగా అడగడమెందుకుచెప్పు; కాకపోయినా ఇప్పుడెందుకాగొడవ తర్వాతఎప్పుడయినా చెపుతానులేపోనిద్దూ.."

"అదుగో మళ్ళాపాతధోరణే...ఇప్పుడేగా చెపుతానన్నారు"

"అవునులే...కానీ ... ఇట్లాంటిప్రశాంతసమయంలో ఏదో గొడవతెచ్చిపెట్టుకోవడ మెందుకని..."

"గొడవేమిటి ... అసలు మనజీవితములే ఒకగొడవ ... ఇందులో గొడవకేముందీ ... చాలాకాలంనుంచి అడగాలని అనుకుంటూ ... చివరకు ..."

"ఏమిటోనీవెర్రికాని ... అందులోనువ్వువిని ఆనందించే అంతవిశేషం ఏంలేదుకమలా! ఎందుకు వృథాశ్రమ ... చివరకు విసుగొస్తుంది..."

"అప్పుడే మానెయ్యవచ్చునులెండి..."

"బాగుంది నీధోరణి...అర్ధరాత్రి ... ఎందుకూరికే మేలుకొనివుండడం ... పోనీ రేపుఉదయాన్నే చెపుతానులే..."

అతడు జరుపులుపెడుతూ జాప్యంచేస్తూన్నకొలదీ ఆమెలో అదేమిటో తెలుసుకోవాలనే పట్టుదల, కుతూహలం హెచ్చుకాసాగాయి. ఆమెవుూర్తినిశ్చయంతో,

"ఎందుకండీ యీవాయిదాలు... నేనేమీ చెప్పనవసరాదూ... అన్నమాట తప్పనివారయితే...ఇప్పుడు నాకు చెప్పకతప్పదు..."

"ఎందుకు కమలా ! నీకింతపట్టుదల... నామాటవిను..."

"అయితే చెప్పరా...ఇంతేనా మీమాటనిలక...?"

"నువ్వలాఅనుకుంటే నేనేం చెప్పను...? నావిషయంవింటే నువ్వసంతోషించవు కమలా !..."

"ఏమంత విచారకరమయిన సంగతా...?"

"అల్లాగేఅనుకో...పోనీ ... హుం! ...నాజీవితమూ...!"

అంటాడు నిస్పృహతో. ముఖమించుక వివర్ణత చెందు తుంది. దీనవదనంతో ఆమాటలన్న ప్రభాకర్ ముఖంవంక తీవ్రంగా ఒక్కసారిచూస్తుందికమల. ఆశ్చర్యపోతుంది. ఏదో అపూర్వమయినది. బహుశా వానిజీవితములో మిక్కిలి విషాదకర మయిన విషయంజ్ఞప్తికివచ్చి వుంటుందేమోననుకుని అదేమో ముఖ్యముగా తానుకూడా తెలుసుకుని, అట్టిదానిని మరపింపజేయ తగుప్రోత్సాహము చేద్దామని ఆ అమాయకురాలు ఏమోకలలు కన్నది ఆక్షణంలో. వెంటనే ఆతురతతో ప్రశ్నిస్తుంది.

"మీమాట నాకేమీ అర్థంకాలేదు...'?

మరేంలేదు...ఆసంగతివింటే నువ్వుచాలామారిపోతావు... ఈసంతోషసమయంలో..."

"మీధోరణి చాలావింతగాఉందే ఇవాళ..."

"అవును నాజీవితమే ఒకవింత...ఏంచెయ్యను ... నువ్వింత పట్టుబట్టి చెప్పినగాని వీలులేదంటే...అయితే చెవుతాను జాగ్రత్తగా విను..."

ఇంక ప్రభాకర్ తానొక ఖూనీనేరస్తుడనని, ఏదో ఆనంద రావు దయమూలకంగా.ఇన్నిరోజులూ వారింట్లోతలదాచుకుంటూ

న్నట్లు చెప్పివేయదలచాడు. కమలమిక్కిలి శ్రద్ధగావింటోంది. అతడు జరిగేదెల్లా జరుగకమానదని స్థిరచిత్తంతో శాంతగంభీర పలుకుల బలుక మొదలిడినాడు.

"విను...కమలా !...నేనొక కారణంమూలకంగా ఖూనీ నేరస్తుణ్ణని అనుమానించబడ్డాను..."

ఒక్కసారిగా కమల త్రుళ్ళిపడింది తాను వింటూన్నది నిజమో లేక స్వప్నమో ఆమెకు అర్థముకాలేదు. క్షణకాలం స్థంభించిపోయింది. ఇప్పుడు ఇంకొకవ్యక్తినిగూడ మనంగుర్తించవలసి ఉంది. అతడొక విచిత్రమయిన స్వభావంగలవాడు. తనకు అవ్వసరమున్నా లేకపోయినా బహుమెలకువతో ఇతరుల ప్రసంగములను వినుట వా[illegible]స్వభావసిద్ధమగు విపరీతలక్షణము. అందే [illegible] కమల తాను భోజనం త్వరగానే ముగించి [illegible] క్రిందనున్న చక్కటి [illegible] ప్రాకారము కాఫీపుచ్చుకుని మేడమీదకి వచ్చింది. అప్పుడందు జాగ్రత్తగా క్రింద పండుకొమ్మని వానికి చెప్పి తాను మేడమీదకు పోయినది. కాని మనవిచిత్రవ్యక్తి అట్లు చేయక ఆమె యెరుంగనీకతని తానుకూడ ఆమె వెనుకనే ఇంతకు తడవాలస్యముగా వెళ్ళి ఆమాటునదిలచి వారిసంభాషణల వింటున్నాడు. వానికదేమిసంతోషమో అదేమనకు తెలియాలి. లోపలి సంభాషణ మిగులశ్రద్ధతో వింటున్న అప్పన్న లోనప్రభాకర రావు ఖూనీసంగతి చేప్పేసరికి ఇంచుక త్రుళ్ళిపడి మరల స్వస్థతచెంది ఈమారు బాగాశ్రద్ధతో వినసాగేను. ఖూనీఅనేసరికి ఎంతటిధైర్యవంతులనయినా ఒక్కసారి భయపెట్టివేయునుగదా ! ఆవిధంగా ప్రభాకర్ చెప్పినమాటలకు తొట్రుపడ్డకమల ధైర్యంతెచ్చుకుని కంగారుగా.

"ఆ !...ఖూనీ నేరమా ...!! ...మీరు చేశారా...?"

"అవును..."

"ఆ !...నిజంగానే...?"

"అవును...కమలా ! నిజమే చెపుతున్నాను..."

"నిజంగానే...ఖూనీ చేశారా ...మీ...రు..."

"ఏమని చెప్పను...కమలా !..."

ఆమాటనిజమని ప్రభాకర్ చెప్పగానే కమలకు పట్టరాని దుఃఖము వెనువెంటనే కోపమువస్తాయి. దాంతో ఆమెకు ముందు వెనుకలు యోచించు పరిజ్ఞానముగాని, గౌరవమర్యాదలుకాని గుర్తించే శక్తినశిస్తుంది. కేవలము మూర్ఖక్రోధము హెచ్చిపోతుంది. తాను మనసారా ప్రేమించిఉండడంచేతను, తన్నాతడంత వరకు మాయచేసి మోసపుచ్చదలంచినట్లుగా విపరీతముగా ఆలోచిస్తుంది. ఖూనీలుచేసినవాళ్లు మంచివాళ్ళవుతారా. కోరివుండి నిండుప్రాణం తీసేహంతకుడు ఉత్తమగుణసంపన్నుడౌతాడా. ఏదో తలదాచుకోడానికి తనఅన్నగారినికూడా మోసపుచ్చి తమపంచకు జేరినద్రోహి ఆప్రభాకరరావు అనుకుంది కమల. మనసారవలచి ఆశించినఫలము విషఫలమని తెలియగానే ఎవరికయినా ఎంతటి దుఃఖమువస్తుందో యోచించండి. అట్టిపరిస్థితులకే లోనయిందికమల. ఖూనీలుచేసే హంతకుడు ఇంతస్వామ్యంగా ఇంతకాలం తమఇంట్లో ఉండగలడా. వారికి యుక్తాయుక్త విచక్షణాజ్ఞానముంటుందా. ఆ విషయంయోచించుటకు తగినస్థిమితముతో లేదు ఆమెబుద్ధి. అదిలోక సహజము. ఎవ్వరయినా సాధారణముగా అట్టిపరిస్థితులలో అట్టి సంకటావస్థనే బొందుదురు. ఆమెకు క్షణక్షణమునకు క్రోధం మితి మీరిపోసాగింది.

"హా! కమల,...ఎంతటిమాయ...ఇంతవారనుకోలేదు."

"నువ్వు అనవుసరంగా కోపం తెచ్చుకోకుకమలా! నేనుచెప్పేది కాస్తవిను..."

"ఇంకేమీ వినక్కర లేదు ... ఏమోఅనుకున్నానుగాని ... ఇంతటివ్యవహార మున్నదనుకోలేను ... పైకిమనసునొప్పని కబుర్లు చెపుతూ... లోపల ఇంతటివిషయం దాచిపెట్టడం ... హాం ! ఎంతసాహసం..."

"కమలా! నేనూఆవిషయం మొదటే నీకుచెప్పదామనుకున్నాను ...కాని సమయం చిక్కలేదు...ఇంతకూ నేనుచెప్పేది కాస్తవిను... తర్వాత సంగతంతా నీకే..."

"చాలు...ఇంకేంచెప్పనక్కర్లేదు...మిమ్ములను....పూర్తిగా నమ్మినందులకు..."

ఆమెకంఠము దుఃఖపూరితమవుతుంది. ఇంక పైని మాటలాడ లేకపోతుంది. చరాలున అక్కడనుండి లేస్తుంది. అతడు శాంతంగా

"చూడుకమలా! నేనుచెప్పేది కాస్తశాంతపడి ......"

"నేనేమివినదల్చుకోలేను ... వినవలసిందేదోవిన్నాను ... చాలామంచిపని జరిగింది..."

అంటూగబగబా అక్కడనుండి వెళ్ళిపోతుంది. ప్రభాకర్ నిర్ఘాంతపోతాడు. క్షణంలోకల్గిన ఆమార్పుకు తెల్లబోతాడు. శరీరంలో జ్వరతీవ్రత హెచ్చుతుంది. అల్లాగేకూలబడతాడు సోఫాలో. కమల తనగదిలోనికిపోయి మంచంమీద పడుక్కుని వెక్కివెక్కి ఏడుస్తూవుంటుంది. తానప్పుడు చేసినపని చాలాతప్పని తెలుసుకుంటాడు ప్రభాకర్. అప్పుడట్టి పరిస్థితులలో ఏమిచెయ్యడమూ అన్నదే వానిని బాధించుచున్నసమస్య. మరలమర్నాడు ఆమెకు తన ముఖమెట్లు చూపించగలడు? ఆయింట్లోఎట్లు నివసించగలడు? చాలవరకు ఏమేమోదీర్ఘంగా యోచించి చివరకు ఒకనిశ్చితాభిప్రాయమునకు వచ్చినట్లు పెద్దగానిట్టూర్చి అచ్చటినుండి తిన్నగా కమలగదివద్దకు

వెడతాడు. ఆమెపరుపుమీద పెడముఖముగా వెక్కి వెక్కి ఏడుస్తోంది. ప్రభాకర్ తన తెలివి తక్కువకు చాలాపశ్చాత్తాప పడ్డాడు. ఆమెగదిగుమ్మమువద్దే నిలచి ధైర్యం తెచ్చుకుని ఆమెనుపిలుస్తాడు.

"కమలా!..."

ఆమెఒక్కసారి తలయెత్తి వానివంక చూస్తుంది. ఏమియు చలనంలేకుండ గుమ్మమువద్ద నిలచియున్న ఆగంభీరమూర్తిని చూచేసరికి ఆమెకు దుఃఖముపొంగి పొరలివస్తుంది. ఆమెనడలు తెలియని ఆవేశంతో చరాలున లేచివచ్చి దఢాలున ఆతలుపులు మూసివేసి పోతుంది. పాపం ప్రభాకర్ ఖిన్నుడై పోతాడు. ఆ అవమానంభరించలేకపోతాడు. నిర్ఘాంతపోయి చేయునదిలేక తిరుగ తనగదిలోకివస్తాడు. అక్కడసోఫాలో కూర్చుని యోచిస్తాడు.

"ఆహా! నేడెంత పొరపాటుపనిచేశాను ... ఎంతతప్పించుకుందామన్నా చివరకు తప్పిందికాదు. ఎంతలో మారిపోయిందీ ... హూం! ఇంతకు ఇందులో ఆమెతప్పేమీలేదు. పరులయింట్లో ఇంతకాలంవుండడం నాదేతప్పు ... దీనిమూలకంగా తీరికకూడా లేనిపోని మనోవ్యధ తెచ్చిపెట్టానుకదా ... అసలు ఇక్కడకు రాకుండగావుంటే ఈపరిస్థితులేపర్పడకపోవును. ఏదో రెండురోజులపాటువున్నా మొదట్లోనే పోవలసింది. ఇంతకూ ఇంకా ఎన్నికష్టాలు పడాలో ... నావల్లఎందరుకష్టపడాలో ... ఛీ! ఒకరిని కష్టముల నుండి తప్పించడంకోసం ఇంతమందికి కష్టంకల్గించనా...ఛీ! పోయి వాళ్ళకు దొరికిపోతేనేమంచిది. వెంటనే తేలిపోతుంది...ఇంకఇక్కడవుండి ఆమెముఖమెట్లుచూడగలను...ఇంకఉండడంమంచిదికాదు... హూం!..."

అని ఒకపెద్ద నిట్టూర్పువిడచి ఇటునటుపరికించి వెంటనే ఒకకాగితము కలము తీసి ఒకవుత్తరంవ్రాస్తాడీవిధంగా. వెనుక

చెప్పిన విచిత్రవ్యక్తి ఆఅప్పన్న ఇవన్నీ మిక్కిలిజాగరూకతతో కని పెడుతూనేవున్నాడు.

కమలా!

నీమనస్సుకు అనవసరంగా కష్టంకలిగించాను. కొన్ని కారణాల చేత మీయింటికివచ్చాను. పూజ్యుడయిన మీఅన్నగారు నన్నెంతో ఆదరించారు. అంతకంటే వేయిరెట్లుగా నీవు మీతండ్రిగారు నాయందు అభిమానంచూపారు. నేను మీయింటికివచ్చియున్న విషయం సవిస్తరంగా మీఅన్నయ్యకు తెలుసును. సాధారణంగా ఎవరికిని చెప్పకూడదనేతలంపుతో నేను కాలయాపన చేశానేగాని మరోవుద్దేశంతో నిన్ను మోసగించుటకుకాదు. ఇప్పటి నీబలవంతము మూలమున తప్పనిసరియై చెప్పాను. దానివలన నీమనస్సు కష్టంతోచునని ఎఱుగుదును. కానిపరిస్థితులు అల్లామారిపోయాయి. నాతొందరపాటుకుమన్నించు. నేను నిర్దోషినని మాత్రం తెలుసుకో. పాపం నీకు విషయమేమో తెలియక అనవసరంగా నీమనస్సుపాడు చేసుకున్నావు. నేటివరకు నీవునాయందుచూపిన ఆదరణాభిమానముల కెంతయు కృతజ్ఞుడను. కారణాంతరములచే నేడే యిల్లువిడచు చున్నాను. నేటినుండి నన్ను పూర్తిగామరచిపోయి ఆనందముతో కాలక్షేపముచేయమని నాతుదిసలహా నిచ్చుచున్నాను.

శలవు!

'ప్రభాకర్'

అనివ్రాసి అచ్చటబల్లమీదపెట్టి మరియొకలేఖను ఆనంద రావునకుగూడ తగురీతివ్రాసి అది తనజేబులో భద్రపరచుకుని అప్పుడే అక్కడనుండి లేచి ఆయెదురుగా గోడకుతగిల్చియున్న ఆనంద రావు ఫొటోవంక తిరిగి ఇంచుకసేపు తీక్ష్ణముగా పరకాయించి ఒక్కసారి నమస్కరించి ఆ అర్ధరాత్రివేళ నెమ్మదిగా క్రిందకుదిగి

వస్తాడు. వీని రాకకనుగ్రహించిన అప్పన్న త్వరితముగబోయి వీధిలో గాఢనిద్రయందున్నవానివలె పండుకుని గురకపెట్టుతూ వుంటాడు. ప్రభాకర్ నెమ్మదిగా తలుపు తెరచి అవలకుబోయి మరల తలుపులు నెమ్మదిగబంధించి ఆ అర్ధరాత్రి ఆకాళరాత్రిలో ఒంటరియై అంతటి జ్వరముతోను ఎక్కడకో వెడలిపోవును. ఆతడుపోయిన మరుక్షణము ననే అప్పన్నకూడ లేచిపోవును. వానిననుసరించియే పోయెనేమో. అతడొక అపరాధపరిశోధకోద్యోగి కాదుగదా ?

పదమూడవ ప్రకరణము సమాప్తము.

---

## పదునాలుగవ ప్రకరణము

మరునాడు ఉదయం ఏడుగంటలకు కమల నిదుర మేల్కొని తనగదినుండి ఈవలకువచ్చును. రాత్రింతయు యోచించుకుంటూ మేల్కొనియున్న కమలకు తెల్లవారుసమయముననే ఇంచుక నిదుర పట్టినది. సుమారు ఏడుగంటలకు లేచినది. ఏదోకొ్రత్తగాను దిగులు గాను వుంటుంది మనస్సు, ఏదో తప్పుపనిచేసినట్లు బాధిస్తూవుంటుంది మనస్సు. తిన్నగావస్తూ ప్రభాకర్ రాత్రిపడుకొన్న గదిలోనికి చూస్తుంది. కాని ప్రభాకర్ అక్కడ అగుపించడు. లోనికి వెడు తుంది. అక్కడవాని దుస్తులు అగుపించలేదు. కంగారుపడి ఇటూ అటూ పరిశీలిస్తుంది. టేబిల్‌మీద వుత్తరం అగుపిస్తుంది. గుండె వేగంగా కొట్టుకుంటుంది. వణుకుతూన్న చేతులతో ఆవుత్తరంతీసి మడతవిప్పి అతురతగా తనలోతాను చదువుకుంటుంది. అదిచదువుట పూర్తిఅయ్యేసరికి ముఖంకళాహీనమయిపోతుంది. నిర్ఘాంతపోతుంది.

"ఆ!... వెళ్ళిపోయాడా...ఎంతపనిజరిగిందీ... (మరల లేఖ వంక పదేపదే చూస్తుంది) తాను...నిర్దోషా...ఆ! ... కాకపోతే

తాను నేరస్థుడనని ఎవరయినా చెప్పుకుంటూవా...అహా! ఎంతపని చేశాను...కోపంలో వళ్ళు తెలియక ఏమిటూలనాడేనో..."

"అప్పన్నా!...అప్పన్నా!..."

అంటూ క్రిందకు దిగి గబగబా వస్తుంది. వీధితలుపు తెరుస్తుంది. అప్పన్న లేడు. ఎన్నో కేకలు పెడుతుంది. ఎక్కడా సమాధానం లేదు. కంగారుపడుతుంది. ఏంచెయ్యడానికీ తోచదు.

"అప్పన్న కూడా ఎక్కడకు పోయాడూ...చిత్రంగావుందే"

వీధిలోకి వస్తుంది. అరుణవస్తుంది. కమలకిప్పుడుకొంతధైర్యం కలుగుతుంది. వెర్రిదానిలా వీధివంక చూస్తాన్న కమలను చూసి అరుణ.

"ఏం కమలా! ఏమిటది...అల్లాచూస్తున్నావు...?"

"బంట్రోతు ఎక్కడకో పోయాడు...నాతోఅయినా చెప్ప లేదు...ఏమయ్యాడో అని..."

"ఆ! ఎక్కడకో బైటకు వెళ్ళివుంటాడు లే...అదేమిటికమలా కళ్ళు రెండూ అల్లా వాచిపోయాయి...",

అంటూ దగ్గరకు వస్తుంది. కమలకొంచం తొట్రుపడి అసలు సంగతిగూఢంగావుంచి చీరచెరగుతో కన్నులు తుడుచుకుంటూ ఇంట్లోకివస్తూ,

"ఏంచెప్పను...అరుణా! రాత్రి తేలుకుట్టింది. రాత్రిచాలా సేపటిదాకా నిద్దరేపట్టలేదు..."

"అయ్యో! పాపం ఎక్కడ కుట్టిందీ ... నింపాదిగావుందా ఇప్పుడు..."

"ఆ! రాత్రి ఆఅప్పన్నా... ప్రభాకరరావూ ఏవో మందులు వేశారు...ఇప్పుడేంలేదు అంతా తగ్గిపోయిందిలే..."

"బాగుంది...అయితే ఇప్పుడే లేచావన్నమాట...?"

"అవ్వను...ఇంకా ముఖమయినా కడుగలేదు ... అప్పన్న కాస్త నిప్పుచేసి నీళ్ళుపెడతాడేమోనని పిలుద్దామని..."

"సరే.. వస్తాను..."

"అయితే ఇల్లా పొద్దుటే బయల్దేరా వెక్కడికి..."

"ఇదుగో కొంచంపనుండి ఇల్లామావాళ్ళింటికి వెడుతున్నా"

"సరేమంచిది వెళ్ళిరా...మళ్ళామస్తావా..."

"ఆ! ఓగంటలోవస్తాను... నువ్వింటిదగ్గరే వుంటావా...?"

"ఆ! యింటిదగ్గరే వుంటాను. వెళ్ళిరా..."

అంటూ కమల పరధ్యాన్నంగా లోనికిపోతుంది. అరుణ తన దారిన వెళ్ళిపోతుంది. కమల కాలకృత్యాలన్నీ తీర్చుకునేసరికి సుమారు ఎనిమిదిన్నర అవుతుంది. నెమ్మదిగా 'స్టౌ' అంటించి కాఫీ పెట్టుకుంటూవుంటుంది. సబినస్పెక్టరు రామంవస్తాడు ఇద్దరుపోలీసులతో. వీధిలోనిలబడతారు. ఒకపోలీసు లోపలనున్నవారినిపిలుస్తాడు.

"ఏమండీ...ఎవరులోపల...?"

కమల వస్తుంది. సబినస్పెక్టర్ను పోలీసులనుచూసి ఆశ్చర్య పోతుంది. రామాన్నిచూసి భయపడి కంగారుపడుతుంది. మరల కొంచం స్థాయిచెంది.

"ఏం...ఎందుకు...?"

"ఇక్కడ పరిభాకరంగా రున్నారా...?"

"ఏం...ఎందుకూ...ఇంటిదగ్గర లేరు..."

"ఎక్కడకు వెళ్ళారు...?"

"ఏమో తెలియదు ...ఏం...?"

"అరెస్టువారంటు వచ్చింది ... ఇంట్లోలేడా..."

"అరెస్టువారంటా...! దేనికీ..."

"అదంతా చాలాగొడవుంది... అతనో హంతకుడు... ఇంట్లో ఉన్నాడా లేడా..."

"లేడని చెప్పానుగా... కావలి స్నేహితుండి... ఇదుగో అతను రాసిన వుత్తరం..."

రామం ఆవుత్తరం అందుకుని చూసి నిర్ఘాంతపోతాడు.

"చూశారా... ఎంతజాగ్రత్తగా వున్నాడో..."

"అయితే ఇప్పుడేం చేద్దాంసార్!"

"ఏంచేస్తాం... అల్లాగనే రిపోర్టు రాయాలి... సరే... వస్తాం"

అంటూ కమలవంక ఒకసారిచూస్తాడు. కమల పెదముఖం పెట్టుకుని కోపంతో.

"మంచిది..."

"ఇదుగో వుత్తరం..."

అని ఆవుత్తరం అక్కడే పడేసి వెళ్ళిపోతాడు పోలీసులు సబిన స్పెక్టరూను. కమలకు అంతా అగమ్యగోచరంగానే అగుపిస్తుంది. దీన్నిబట్టిచూస్తే ప్రభాకర్ ఆరాత్రి యిల్లువిడచుటా, కొంతమేలే జరిగినదనుకున్నది. కాని వానిని వదలి వేయవలసివచ్చినందులకు ఎంతో దుఃఖించింది. అతడెక్కడయినా పోలీసులచే జిక్కుతాడేమో నని భయపడింది. ఏమోకొంతసేపు దీర్ఘాలోచనచేసి వెంటనేఇంటికి తాళంవేసి పోష్టాఫీసుకు వెడుతుంది. అప్పన్న 'C. I. D.' కాదు గదా అన్న అనుమానం ఆమెమనస్సులో ప్రబలంగా నాటుకుంది. సరే ఎట్లో తండ్రికీ... అన్నగారికి రెండు తంతివార్తలనంపుతుంది. ప్రభాకర్ వెళ్ళిపోయినట్లు. వారిని వెంటనే బయల్దేరి రమ్మనీను. టెలిగ్రాఫ్మాష్టరుకు రెండు కాయితాలూఇచ్చి దానికయిన డబ్బు చెల్లించి నెమ్మదిగా ఏదోయోచించుకుంటూ ఇటికి జేరుతుంది. ఆనాడంతా ఆమెమనస్సునకు స్థిమితంలేదు. ఏపనిచేయబోయినా

ప్రభాకరరావే జ్ఞప్తికి వస్తున్నాడు. తన తెలివితక్కువకు మిక్కిలి దుఃఖించి ఎట్లో ఆనాటిపొద్దు గడిపింది.

రాత్రి పన్నెండు గంటలవుతుంది పైగా. చీకటి మిక్కిలి దట్టంగా వుంటుంది. కమల తాను ఒంటరిగా ఆయింట్లోవుండలేక భయంచేత అరుణను సాయంచేసుకుని పడుకుంటుంది. గాఢనిద్రలో వుంటారుఇద్దరూ. పొద్దుట కమలయిచ్చిన తంతి అందగానే బయల్దేరివస్తారు, చంద్రశేఖరరావుగారు. బండిదిగి వీధితలుపు గట్టిగా తట్టుతారు.

"అప్పన్నా! అప్పన్నా...!!"

పాపం పైనవాళ్ళిద్దరూ గాఢనిద్రలోవున్నారేమో ఎవ్వరూ పలుకరు. అప్పన్న కూడా పరారిఅయిపోయినట్లు ఆయనేమెరుగును. ఎన్నోకేకలుపెట్టగా కొంతసేపటికి అరుణకు మెళుకువవస్తుంది. ఆమె కంగారుగా కమలను లేపుతుంది.

"కమలా!...కమలా!! ...క్రిందఎవరో పిలుస్తున్నారు... లే..."

"ఆ!...ఎవరది...పిలుస్తున్నారా...చూదాం పద..."

ఇద్దరూ మేడమీదనుండి క్రిందకుచూస్తారు. వీధిలోని ఎలక్ట్రిక్ దీపం వెలిగిస్తారు. చంద్రశేఖరరావుగారు తలుపుతట్టుతూ వుంటారు. కమల తండ్రిగొంతుక గుర్తిస్తుంది.

"ఆ!...వస్తున్నా...నాన్నగారూ;... పదుఅరుణా...నాన్నగారువచ్చారు—"

ఇద్దరూ గబగబా క్రిందకుదిగివెళ్లి వీధితలుపుతెరుస్తారు. చంద్రశేఖరరావుగారు లోనికివస్తారు. బండివాడు సామాన్లులోపల పెట్టి అద్దెపుచ్చుకొని వెళ్లిపోతాడు. చంద్రశేఖరరావుగారు ఎంతో ఆత్రుతతో,

"ఏమమ్మా! నిమ్మళంగావున్నావా ... అసలు ఎందుచేత వెళ్ళిపోయాడూ..."

ప్రభాకర్ ఏదో పనిమీద వూరికి వెళ్ళాడు రాత్రిబండిలో వస్తాడని మభ్యపరచిందిఅరుణనుకనుల, ఇప్పుడు చెప్పకతప్పిందికాదు.

"ఏమోనండి...ఏమీ తెలియదు...ఇదిగో ఈవుత్తరంరాసి గదిలో పడేశాడు అంతే..."

ఆయన ఆవుత్తరం ఆమూలాగ్రంచదివి,

"బాగానేవుంది ... నువ్వేమయినా అన్నావాఏమిట తణ్ణి..."

"అబ్బే...ఏంలేదండీ..."

"సరే రేపుమాట్లాడుదాంలే...అప్పన్నఏడీ..."

"ఏమో అప్పన్నకూడా రాత్రినుంచీ అగుపించడంలేదు..."

"ఆ!...అప్పన్నకూడా అగుపించలేదూ..."

"లేదండీ... ఇంట్లో ఎవరూ లేక అరుణను సాయంచేసుకు పడుకున్నా..."

"బాగానేవుంది...అన్నయ్యకుకూడా వైరిచ్చావా...?"

"ఆ! యిచ్చాను...."

అంతట చంద్రశేఖరరావుగారు గోడగడియారం వంకచూసి

"అబ్బా! అప్పుడే ఒంటిగంట దాటిందే... సరేపడుకోండి ...రేపుచూడొచ్చు..."

అంటూపోయి పడుక్కుంటారు.

మర్నాడు ఉదయంపదిన్నరకల్లా వస్తాడు ఆదుర్దాగా ఆనంద రావు. వీధిలోకి వెళ్ళిన చంద్రశేఖరరావు ఇంకారాలేదు. ఆనంద్ వస్తూనే చెల్లెలు కమలనుచూసి

"ఏం...కమలా! ఏమిటిది...?"

"ఏమోనన్నయ్యా! ఇదుగో ఈఉత్తరంచూడు..."

అంటూ ఆమె యిచ్చినఉత్తరం ఆనంద్ అందుకుని చదివి,

"ఎంతపనిచేశావు కమలా! నువ్వుఅతన్నేమయినా అన్నావా ఏమిటి...?"

"అబ్బే! నేనేమీ అనలేదు... కాని మొన్నరాత్రిమాత్రం అతనుకులాసాగా ఉన్నసమయంలో, నీచరిత్ర ఏమిటో చెప్పమని పట్టుపట్టేను. అతను ఎల్లాగయినా ధోరణిమారుద్దామని చాలాసేపు తంటాలుపడ్డాడు. కాని నేనుబలవంతపెట్టడం మూలానకొంతసేపటికి తానొక ఖూనీనేరస్తుడనని చెప్పాడు. నాకుచాలా ఆశ్చర్యంభయం కూడాకలిగేయి. నాకుమొదట నమ్మకంచాలక మరలమరల తొందరగా వానిని ప్రశ్నించాను. నేనెన్నిమార్లు ప్రశ్నించినా అతడదే సమాధానం చలనంలేకుండా ఇచ్చాడు. దాంతో నాకు చాలా కోపం వచ్చింది. నువ్విల్లాంటి వాడవనుకోలేదు. అని ఏమేమో ఆకోపంలో అనేశాను. అక్కడనుండి నాగదిలోకి వెళ్ళిపోయాను... మళ్ళాప్రొద్దుటనే లేచిఈవలకువస్తూ చూద్దునుగదా అక్కడప్రభాకర్ లేడు. ధైర్యంతో లోనికివెళ్ళాను. అచ్చటవాని దుస్తు కూడా నాకేమీ అగుపించలేదు...అక్కడబల్లమీద ఈఉత్తరంమాత్రం అగుపించింది. ఎప్పుడువెళ్ళిపోయాడో కూడా తెలియదు. వెంటనే కంగారుపడి నీకు నాన్నగార్కి వైరులిచ్చాను. ఇప్పన్నకూడా అగుపించడంలేదు..."

"ఎంతపొరపాటుచేశావ్... కమలా! ... హూం! ... అతనల్లాగే మనసు పాడుచేసుకుంటున్నాడు ... అతనిసంగతి నీకు తెలియదుకమలా!...అంతటి మంచివాడింకొకడుండడు ... అతను నిజంగానిర్దోషి..."

తనసోదరుని అసమాధానానికి నివ్వెరబోయింది కమల. పరిపరివిధాల బోయింది ఆమెమనసు. ఆశ్చర్యంతో ప్రశ్నిస్తుంది.

"ఆ! ... నిజమేనా...అన్నయ్యా!..."

"ఆ...నిజంగానే...అయితే...అప్పన్న కూడా అగుపించడం లేదూ..."

"అవునన్నయ్యా!...మరిఅల్లా ఎందుకుచెప్పాడన్నయ్యా!...

"అదే...అతనుచేస్తూన్న పొరపాటు..."

"అంటే...?"

"అదంతాచాలా సంగతుందిలే ... నాన్నగారినడిగి తెలుసుకో, ... అయితే అప్పన్న ... C. I. D. ...కాదుగదా ... ఏమో..."

"అని యోచిస్తూ మరల ఏదోజ్ఞప్తికిరాగానే..."

"ఆ!...చూడుకమలా! నేనుమళ్ళావస్తాను... రాగా నేనాన్న గారితో చెప్పు..."

అక్కడనుండి వెంటనే వెళ్ళిపోతాడు. కమల దీర్ఘమయిన ఆలోచనలోపడింది. అన్న చెప్పిన పలుకులుబట్టి చూస్తే తానుచేసిన పనిచాలా తప్పు అనుకుంది, తనయొక్క అనవసరపు కోపమే పాపమూ ప్రిభాకర్‌ను మరిన్ని కష్టముల గురిచేసిందని మిక్కిలి దుఃఖించింది.

మద్రాసులో సుబ్రహ్మణ్యాం ఇల్లు. ఉదయం పదిగంటల సమయం సుబ్రహ్మణ్యాం పోలీసుఇనస్పెక్టరూ కూర్చుని ఏదోదీర్ఘంగా యోచిస్తూవుంటారు.

"ఏమండీ ఇనస్పెక్టరుగారూ ... అప్పుడే రెండునెలలు దాటింది ... ఏజాడా తెలియటలేదింకాను..."

"అయ్యా! మనం అల్లాతొందరపడితే లాభంలేదండీ ... నేరస్తుణ్ణి పట్టుకోవడమంటే అంతసులభ మయినపని కాదుకదండీ ... ఇప్పుడే ఒకసంగతిమాత్రం తెలిసింది..."

"ఏమిటంటారయది...?"

"ఆశంకర్రావు ... విజయనగరంలో మారు వేషంలో ప్రభాకర్ అనుపేరుతో...ఒకరింట్లో ఉన్నట్లు తెలిసింది.

"ఆ!...ఇంకేం...వెంటనే అరెస్టు చేయించలేకపోయారా"

"అయ్యా! ఆవిషయం మీరు మాకు చెప్పాలా! ... వెంటనే అక్కడిపోలీసుస్టేషన్‌కు వైరిచ్చాము...ఈపాటికి వారు పట్టుకునే వుంటారు...ఇంకా ఏవార్తా రాలేదూ..."

"మొత్తంమీద సాధించారండీ..."

"లేకపోతే వదిలేస్తామటండీ...అసలుమాపని ఎల్లాంటిది?"

"అయితే ఇంకచేయవలసినదేమిటి...?"

"ఇంకేముంది...అంతా అయిపోయినట్లే...కోర్టుకు హాజరు పరచడమే..."

"దుర్మార్గుడు...ఎంతపనిచేశాడండీ..."

"అయినదానికి విచారిస్తే...ఏంలాభం చెప్పండీ..."

"సరే...నేనర్జంటుపనిమీద వెళ్ళాలి ... మళ్ళీవచ్చి కలుస్తాను...శలవు..."

"మంచిది...శలవు..."

సబినస్పెక్టరు వెళ్ళిపోతాడు. తనతండ్రిని చంపిన హంతకుడు పట్టుబడినందులకు మిక్కిలి సంతసిస్తూ తనపనిమీద వెళ్ళిపోయాడు సుబ్రహ్మణ్యం. పాపం ప్రభాకర్ తప్పించుకున్నట్లు వీరికి తెలుసు?

విజయనగరంలో చంద్రశేఖరరావుగారియిల్లు. కమల ఒంటరిగా మేడమీదగదిలో కూర్చుని ఏదో చదువుకుంటూవుంటుంది. రాత్రి సుమారు ఎనిమిదిన్నర అవుతుంది టైము. అప్పటికి ప్రభాకర్ యిల్లువిడచి వారంరోజులవుతుంది. ఆనందరావు మరల తన వుద్యోగమునకు బెజవాడ వెళ్ళిపోయాడు. ఆనాటివుదయా న్నేచంద్ర

శేఖరరావుగారు అవసర కార్యములపైని విశాఖపట్నం వెళ్లారు. మరల మర్నాడుకాని రారు. నాటిరాత్రి తనకు సాయంగా ఉండడానికి అరుణను రమ్మని పిలుస్తుంది. అరుణ ఇంకా రాలేదు. ఏదో ధోరణిలో యోచిస్తూవున్న కమల వీధితలుపు గడియపెట్టడం మరచిపోయింది. కొంచంసేపటికి ఒకవ్యక్తి ఆయింట్లో ప్రవేశిస్తాడు. నెమ్మదిగా వీధితలుపు బంధించి మేడమీాదకు వెడతాడు. కమల ఒంటరిగా గదిలోవుంటుంది. ఆవ్యక్తి ఇటూఅటూ పరిశీలించి నెమ్మదిగా ఆగదిలో ప్రవేశించి తలుపులు చప్పుడుకాకుండా బంధిస్తాడు.

"ఇంట్లో ఎవ్వరూ లేరా యేమిటి...కమలా!..."

కమల తుళ్ళిపడి ఆవ్యక్తివంక తెల్లబోయిచూస్తుంది. వడలు గజగజవడుకుతూవుంటే భయంతో వానివంక చూస్తూ...అంతలోనే మరలకొంచం ధైర్యం తెచ్చుకుంటుంది. గదితలుపు గడియవేయబడియుండుట ఆమెగుర్తించలేదు. ఇంచుకధైర్యంగా,

"ఏం...ఎందుకూ...ఎవరు కావాలి...?"

"ఏంలేదులే...మీానాన్నగారేరీ...?"

"కొంచంపనిమీాద వీధిలోకివెళ్ళారు ... ఎందుకొచ్చావిప్పుడు...?"

"చెప్తా...అయితే మీానాన్నగారు వీధిలోకివెళ్ళారా ... అబద్ధమాడుతా వేంకమలా...! విశాఖపట్టణం వెళ్ళలేదూ...?"

కమల తెల్లబోతుంది. మిగులభయపడుతుంది.

"అయితే...ఏమంటావ్...?"

"అనడాని కేముంది...మామూాలురంగ తేగా ...నువ్వెరుగనిదేముంది ...?"

"అంటే...నీధోరణి నాకేమీాఅర్థంకావడంలేదు..."

"తొందరపడతా వేం...అర్థంచేయడానికేవచ్చాను..."

"అంటే,..!"

అంటుందిభయంతో లేచిదూరంగానిలచి.

"ఇంకా తెలియలేదూ ... వెర్రిదానా ... ఇంతమాత్రం తెలుసుకోలేవు...చూడు నామాటవిను..."

"ఆ !...ఏమిటీ...!!..."

"ఏముందికమలా !...ఈమాటు తప్పించుకోడం కష్టమని చెవుతున్నా...చూడు నామాటవిను...ఒక్కసారి..."

"ఛీ ! దుర్మార్గుడా !...దూరంగాపో...లేదామాటదక్కదు బుద్ధిలేక కుక్కలామళ్లావచ్చావూ..."

"నువ్వేమన్నాసరేకాని...నామాటవిని...ఒక్కసారి..."

"హూం ! ఒక్కసారి...కంఠంలో ప్రాణముండగా సాధ్యం కాదు...నీచుడా !...ఇంట్లోఎవరూలేకుండాచూసి దొంగకుక్కలా దూరి...ఒంటరిదాన్ని చేసి నన్నిలాబలవంతపెడతావూ...జాగ్రత్త ! ఆడదితల్చుకుంటే ఎంతపనిఅయినా చేయగలదు..."

"నిజమే...కానిపోలీసు ఇనస్పెక్టరుమాత్రం ఏమీచెయ్య లేదు...కమలా ! నామాటవిను...ఇందు నాతప్పేంలేదు ... నిన్ను మనసారాప్రేమించాను ... నీతండ్రికి నాకోర్కె తెలియజేశాను... కాని ఆయననామాట తిరస్కరించాడు..పైగా నన్నుతూలనాడేడు... హూం ! ఎవడిప్పుడు నిన్నురక్షిస్తాడోచూస్తాను... నా మాటవిను కమలా! తప్పించుకోడానికి యత్నించకు..."

కమల క్షణకాలం యోచిస్తుంది. ఏదో తలంపుకురాగానే దీనవదనంతో.

"ఇల్లాంటిసంగతని నాతోచెప్పి సవ్యంగా వివాహయత్నమే చేయకూడదా?రామం...ఇది మర్యాదలక్షణమేనా..."?

"హూం! మర్యాద...నన్నే మోమోసపుచ్చటానికి ప్రయత్నించకు కమలా! మర్యాదగావర్తిస్తే నాకుమర్యాదదక్కలేదు...ఏమయినాసరే నిన్నువిడువను...నామాటవిను"

"ఛీ! దుర్మార్గుడా ... నీకుమాత్రం మర్యాదఎట్లుదక్కునో చూస్తా...దగ్గరకొచ్చావా నీప్రాణాలు నీకుదక్కవు..."

"అబ్బో! చాలావరకువచ్చిందే వ్యవహారం ... చూస్తా ఏంచెయ్యగలవో..."

అంటూ దగ్గరగావెళ్ళి చెయ్యిపట్టుకుంటాడు. వెంటనే కమల కళ్ళుపచ్చపడేటట్లు ఒక్కటికొడుతుంది దవడమీద రామాన్ని. దాంతో రెట్టించినక్రోధంతో రామంకమలపైబడి ఆమెనుపట్టుకుంటాడు. గదిలోని దీపంఆరిపోతుంది. అంతానిశ్శబ్దం.

సుమారు పదినిముషాలకల్లా ఎవరోఆచీకట్లోంచి తలుపు తెరచుకుని వెళ్ళిపోతారు. మరునిముషంలో లాంతరు వెలుగుతుంది. గదిలో కమల ఒంటరిగా ఉంటుంది. అప్పుడే చెదిరినజుట్టూ, జారినపైటా సర్దుకుంటూ లేస్తుంది ప్రక్కమీదనుండి. ముఖం కళావిహీనమయిపోయివుంటుంది. కన్నులవెంబడి నీరు కారుతూవుంది. ఆమె బుర్రయెత్తిచూచేసరికి తల్లిదండ్రులఫొటోలు, అన్నఫొటో దానిప్రక్కనే తనఫొటో అగుపిస్తాయి. తనయొక్క ఆనీచకార్యాన్ని నిశితంగా పరీక్షించినాయోయన్నట్లు తన్ను అధిక్షేపిస్తున్నట్లుగా ఆఫొటోలలోని బొమ్మలదృష్టి ఆమెవంకేయున్నది. మరి ఆమెచూడలేక బుర్రక్రిందకు దించివేసుకుని సోఫామీదకూర్చుని వెక్కివెక్కియేడ్వడం ప్రారంభించింది. ఆమెమానవతి, జరిగినదో చేయరానినీచకార్యము. ఆమెఆత్మ ఆమె నీచకార్యమును ప్రతిఘటిస్తుంది.

"ఎంతదుర్మార్గమయిన పనిజరిగిందీ...దుర్మార్గురాలా! అంత నీచమయినపనిచేసి...ఇంకా తగుదునని జీవించివున్నావా ... సిగ్గు లేదూ..."

అని తీవ్రంగా తనఆత్మ అధిక్షేపించేసరికి కమలదీనంగా తల్లి ఫోటోవంక చూస్తూ అక్కడకు వెళ్లి కూలబడుతుంది. మరల ఆత్మ బోధిస్తుంది. అల్లాచూస్తావేం...

"అల్లాటి నీచమయినపనిచేసి ... నీపాడుముఖం నీతండ్రికి నీఅన్నకు ఎల్లాచూపిస్తావ్ ... మానాభిమానాలను చంపుకున్నది నీదీఒకబ్రతుకేనా...శీలంచెడ్డాక యింకబ్రతకడానికి..."

కమల తల్లిఫోటోవంక దీనంగాచూస్తూ,

"అమ్మా! ... ఏంచెయ్యను ... వీలుచిక్కలేదు తప్పించు కోవడానికి..."

"హూం! వీలుచిక్కలేదు...అనిష్కళంకమూర్తిని...నీపాడు ముఖంతో చూస్తున్నావా......ఛీ! ఛీ!! ఎం దుకువచ్చినపాడు బ్రతుకు..."

ఆమెఆత్మ పరితిఘటనకు తట్టుకోలేకపోతుంది. ఒక్కసారిగా ఆమెలో అణగియున్న ఆంతరంగికశక్తి, విజృంభించింది. మహా క్రోధంతో లేస్తుంది.

"ఆ !...అవునునిజమే...నాదిపాడుబ్రతుకే అయిపోయింది. ఇంక నాపాడుముఖం ఎవ్వరూచూడకూడదు. (ఆవేశంతో) దుర్మార్గుడా! నువ్వెక్కడకుపోతావ్! నిన్ను విడచిపెట్టేదికాదీ కమల! ఒక అబలశీలం పాడుచేసి నువ్వేమవుతావు ... దేముడు లేడూ...హూం! ఇంకెందుకీపాడుబ్రతుకు...ఛీ!"

అని అక్కడనుండి బయల్దేరి లేచితిన్నగా అలమారువద్దకు వెళ్ళి అచ్చటి విషంసీసా చేత్తోతీస్తుంది. చేతులువణుకుతూంటాయి కాగితం కలంపట్టుకుని ఈవిధంగా ఒకఉత్తరంరాస్తుంది.

నాన్నగారూ,

నన్ను క్షమించండి ! శీలం చెడ్డాక బ్రతకకూడదు..,ఆడదానను అబలను ... నాయందుదోషముంటే భగవంతుడే చూస్తాడు...మీరు యింట లేనిసమయంలో వచ్చి సబిన్స్పెక్టరు రామం చేసిన దారుణ కృత్యానికి... నేను పొందినఫలితానికి ... ఇంక మీ ముఖం చూడలేక శాశ్వతంగా నాముఖంమరుగు చేసుకుంటున్నా ! రామం పాపం సహజంగా మంచివాడే కాని... కామోద్రేకంలో కన్నుమిన్ను గానక వర్తించాడు. భగవంతుడు క్షమించుగాక !

శలవు,

'కమల'

ఆవుత్తరం అక్కడే బల్లమీద పెట్టి ఎదుట గోడను వ్రేలాడు చున్న తనఫోటోను తీసి నేలనుపార వేసి ఆఖరునాడిగా తనతల్లిదండ్రుల పటములకు నమస్కరించి విమంతా గ్రేసి సోఫాలో కూలబడి కొలది సేపటికి ప్రాణాలు విడుస్తుంది.

పదునాలుగవ ప్రకరణము సమాప్తము.

---

# పదియైదవ ప్రకరణము

రాత్రి పదిగంట లయినప్పటికి, వస్తానన్న అరుణ తలబాధతో బాధపడుతూ కమల యింటికి రాలేకపోతుంది. రాత్రి పదకొండు గంటలకల్లా చంద్రశేఖర రావుగారు వస్తారు. వీధితలుపుతీసివున్నది... వీధిసావడిలో లైటులేదు... అనుమానంతో లోపలకు వెడతారు. తలుపులన్నీ వేసేవుంటాయి. అతురతగా మేడమెట్లెక్కి పైకి వెడతారు. అక్కడగదిలో దీపపుకాంతి కానవస్తుంది. కంగారుపడుతూ ఆగదిలో ప్రవేశించి.

"కమలా! ...కమలా!! ..."

కంగారుగా ఆవేశంతో ఒక్కసారి కమల సోఫాదగ్గరకు వెడతారు చంద్రశేఖరరావుగారు.

"కమలా!" ఒక్క వెర్రికేక పెడతారు. కమల సోఫావద్ద కూలబడి ఆమెను చేతితో తాకి చేతియందలి విషంసీసా చూసి ఆవేదనతో విచారిస్తూ.

"ఎంతపని చేశావు కమలా...నీకేం బాధ కలిగిందమ్మా ... మీఅమ్మ పోయినప్పటినుంచీ ...ఎల్లాగో పెంచి...తుదకు మీఅమ్మ తుదికోర్కె తీరుద్దామని ... ఇవాళే విశాఖపట్నంవెళ్ళి పెండ్లిసంబంధంకూడా కుదుర్చుకునివచ్చాను ... అయ్యో! నన్నీముసలికాలంలో ఇల్లాంటి విచారంలోముంచేసి ... వెళ్ళి ... పోయావా నీకెవరేమి అపకారం తలబెట్టేరుతల్లీ ... నీకేంబాధకల్గింది..."

ఆకేకలువిని ప్రక్కింటి ప్లీడరు ప్రసాదరావుగారు వస్తారు. ఆదృశ్యం చూసి కంగారుపడుతూ

"ఏమండీ...బావగారూ!...ఏంజరిగింది...?"

"ఇదుగోనండి ... ఏంచెప్పను...మాకమల... నన్ను—వి...డ...చివెళ్ళి...పోయింది ... ..."

"ఆ!...ఏమిటీ...కమలచనిపోవడమే..."

ప్రసాదరావుగారు కమలదగ్గరగా వెళ్ళి చేత్తో ఆమెనుతాకి ఆమెచేతిలోని సీసాచూసి.

"అయ్యో! విషం తాగేసిందండీ ... ఎంతపనిచేసిందీ...ఏమండీఇల్లాగ ..."

"ఏమని చెప్పనండీ ... నాకుమాత్రం ఏంతెలుసు ..ఇప్పుడే నేనూ విశాఖపట్నంనుంచి వచ్చాను ..."

"ఎంత దారుణం...ఇదిచూస్తే ఆమెకేదో బాధకల్గిత్రాగేసి నట్లుంది..."

అని విచారంగా అంటూ టేబిల్ కేసిచూసి తటాలున ఆ వుత్తరంతీసి ఆతురితగా చదువుతాడుపైకి.

"ఆ!...ఆ!...రామకృష్ణా! పోలీసుఇనస్పెక్టరు ... వాడా... ఇంతపనికీ కారకుడు...ఔరా!...ఎంతపని చేశావ్...హూం! నిన్ను వదలుతానా...చూడు...

అంటూ చంద్రిశేఖరరావుగారు ఉద్రేకంతో లేస్తారు. వాని నోదారుస్తూ ప్రిసాదరావుగారుకూడా బయల్దేరుతాడు.

"నడవండి బావగారూ! నేనుకూడా వస్తాను...సూపర్నెంటుకు రిపోర్టిద్దాం..."

ఇంతలోకీ ప్రిసాదరావుగారి భార్యా...ఇంకో నలుగురు ఆడ వాళ్ళూవస్తారు.

"చూడూ...కమల విషంతాగిగేసింది..."

"ఆ!...విషమే...ఏదీ..."

"అప్పుడే...అంతాఅయిపోయింది...అరుణా..."

అంత ఆమె కంగారుగా కమలదగ్గరకు వెడుతోంది. ఆడవా ళ్ళంతా ఆమెచుట్టూ జేరుతారు.

"అయ్యో తల్లీ...! ఇదేమిటే..."

"చూడు మేమిప్పుడేవస్తాము...ఇక్కడేఉండండి..."

చంద్రిశేఖరరావుగారు, ప్రిసాదరావుగారూ యిద్దరూ బయ ల్దేరి వెంటనే ఒకబండిమీద పోలీసు సూపర్నెంటుయింటికి వెడతారు. వీధిలో బంట్రోతు వుంటాడు.

"ఏంబాబూ? ఇంతరాత్రివేళొచ్చారు...!"

"మీబాబుగారున్నారా!..."

"ఇప్పుడే ఎక్కడనుంచో వచ్చి లోపలకెళ్ళారు ..."

"ఒకమాటు నేను వచ్చానని చెప్పు..."

"చిత్తం!...అల్లాకుర్చీలలో కూర్చోండి బాబూ!"

అని చెప్పి బంట్రోతులోనికిపోయి సూపర్నెంటుతో విషయం చెప్పాను. అంతట సూపర్నెంటుగారు ఆతురతగా వస్తారు ఈవలకు.

"హల్లో! ఏమిటిల్లావచ్చారు...?"

"అర్జంటుగా మీకొకవిషయం రిపోర్టు చెయ్యాలని వచ్చాం సార్ ...!"

అన్నారు ప్రసాదరావుగారు. దాంతో ఆపుర్దగా.

"ఆ! ...ఏమిటండదీ..."

"మాఅమ్మాయికమల! ...విషంతాగేసి ... మరణించిన దండీ..."

"ఆ!...మీఅమ్మాయే...ఎప్పుడు...ఎక్కడ...?"

"మాయింటిదగ్గరే..."

"ఏమండీ అల్లాంటిపనెందుకు చేసిందీ...?"

"అదేమాకూ అర్థంకాలేదు ... అదే మీకూ చెప్పాలని వచ్చాం...,ఇదుగో పోవడానికి ముందుగాఆమె వ్రాసినఉత్తరం..."

చంద్రశేఖరరావుగారు ఉత్తరం ఇస్తారు. దానిని సూపర్నెంటు అందుకుంటూ.

"అయితే ఇది మీకెక్కడ దొరికింది...?"

"మాయింట్లోనే...ఆమె చనిపోయి వున్నగదిలోనే బల్ల మీదవుంది..."

సూపర్నెంటు ఆవుత్తరం చూస్తూ గుడ్లుపెద్దవిచేసి.

"ఆ! ... సబినస్పెక్టరు రాముమే ... ఇంతపనే ... ఎంత దుర్మార్గం...?"

"ఆవిషయం మీతో రిపోర్టు చేద్దామనే..."

"అయ్యో! ఇంకా ఆలోచనేమిటండీ... ఈలెటరూ...మీ స్టేటుమెంట్లూ సహాయంతో వెంటనే అరెస్టుచేసేస్తా...ఇంత దారుణమా...నడవండి వస్తున్నా..."

"చిత్తం!...ఇంతటి దారుణవ్యాపారం జరుగుతుందనుకో లేదండీ..."

సూపర్నెంటు బంట్రోతుతో చెప్పి డ్రైవర్ను కారు తెమ్మన మని కబురుచేస్తాడు. తానులోనికిపోయి దుస్తులువేసుకుని ఈవలకు వచ్చేసరికి డ్రైవరు కారు తెస్తాడు. అంతా కారెక్కుతారు.

"చూడుడ్రైవర్...తిన్నగా మనచంద్రశేఖరరావుగారింటికి పోనీ..."

కారుతిన్నగా చంద్రశేఖరరావుగారింటివద్దకుపోయి ఆగు తుంది. అంతా క్రిందకుదిగుతారు. గబగబాలోనికివెడతారు. పైన మేడమీదగదిలోనికిపోయి అక్కడపరిస్థితంతా పరిశీలిస్తాడు సూప ర్నెంటు. ఏవేవో ప్రశ్నలువేసినపిదప అక్కడనుండి సూపర్నెంటు, ప్రసాదరావు, చంద్రశేఖరరావుగార్లు తిన్నగావెళ్ళికారుయెక్కు తారు. తిన్నగా డ్రైవరు సూపర్నెంటుఆజ్ఞాప్రకారంగా కారును సబిన్స్పెక్టరు రామంయింటికినడుపుతాడు. కొంతసేపటికి కారు రామం యింటిముందు ఆగుతుంది. అంతా క్రిందకుదిగుతారు. సూపర్నెంటు వెళ్ళి యింటితలుపుతట్టుతాడు.

"రామం!..."

"..." సమాధానంలేదు. బిగ్గరగాపిలుస్తాడు.

"మిష్టర్...రామం!..."

"ఎవరది..."

అరుణ సమాధానమిస్తూ వచ్చి తలుపు తెరుస్తుంది నిద్ర కళ్ళతో. అప్పటికి సుమారు రెండుగంటలవుతుంది. సూపర్నెంటును చూసి ఆశ్చర్యపోతుంది. సూపర్నెంటు వెనకాల నిలబడివుంటారు మిగిలినవారు. అరుణకొంచం వెనుకకుతగ్గుతుంది. సూపర్నెంటు కొంచం అధికారస్వరంతో.

"రామంగారింట్లోఉన్నారా...?"

"ఇప్పుడే ఎక్కడనుంచోవచ్చి పడుకున్నాడు...ఒకఅర గంట అవుతుంది..."

"ఒక్కమారు నేనువచ్చానని లేపండి..."

ఆమె సందేహంతో చంద్రశేఖరరావుగార్ని చూసి మెల్లిగా లోపలకు వెళ్ళి అన్ననులేపుతుంది. అతడప్పుడే కొంచం మద్యం తాగి పండుకున్నాడు.

"అన్నయ్యా ! అన్నయ్యా !!...'

"ఊ...!..."

"అన్నయ్యా! సూపర్నెంటువచ్చాడు..."

రామం ఉలికిపడి లేస్తాడు. ఏమయినా సేవకావృత్తియందున్న వారికి అధికారిమాట చెప్పేసరికి హడలేకదా!

"ఆ ! సూపర్నెంటా...ఎందుకూ..."

ఇంతలోకే సూపర్నెంటేవస్తాడు అక్కడకు. వానివెనకాలే వస్తారు మిగిలినవారు.

"మిష్టర్ రామం !..."

"సార్ !..." కొంచం తెలివి తెచ్చుకుని లేచివస్తాడు.

"మిమ్మల్నిప్పుడు...అరెస్టుచేస్తున్నా..."

చేతికి బేడీలుతగిలిస్తాడు. రామం నిర్ఘాంతపోతాడు. ఆశ్చర్యంగా చంద్రశేఖరరావుగార్ని చూచి బహుశా తనకుట్ర బయల్పడి

వుంటుందని ఖిన్నుడయి బుర్రవంచుకుంటాడు. మరలతలయెత్తి కంగారుగా ఏమీఎరుగనట్టు.

"ఎందుకు...అరెస్టు...?"

"ఆ !...అరెస్టా!" అని ఆశ్చర్యపోతుంది అరుణ. చంద్రశేఖరరావుగారు ముందుకువస్తారు. అరుణ ఒక్కసారిగా వారివద్దకు వెళ్ళి,

"మామయ్యా...ఇదేమిటండీ...?"

"ఏమిటా...కమలను ద్రోహంచేసినందులకుశిక్ష ... ఆమె శీలంపాడుచేసినందుకు ...ఆమె విషంత్రాగి చనిపోయింది..."

"ఆ !...కమలచనిపోయిందా...!!"

పొంగిపొరలివస్తుందిదుఃఖం. చంద్రశేఖరరావుగారికాళ్ళదగ్గర కూలబడిపోతుంది. ఆమెకదంతా అయోమయమయిపోయింది. నెత్తిన పిడుగుపడినట్లయింది.

"మామయ్యా !..."

చంద్రశేఖరరావుగారి కంటవెంబడి నీరుకారుతూవుంటుంది. ఆయన అరుణను లేవతీస్తారు. రాము ఆశ్చర్యపోతాడు. తానుచేసిన ద్రోహకార్యం ఒక్కసారిజ్ఞప్తికివస్తుంది.

"ఆ !...కమలచనిపోయిందా...అయితే నన్నెందుకుఅరెస్టు నావల్లనని ఋజువేదీ..."

"తొందరపడితేఎల్లాగ ... అన్నీ తేలుతాయికోర్టులో ... Come on !..."

సూపర్నెంటు రామూన్ని తీసుకునివెడతాడు. అరుణను చంద్రశేఖరరావుగారు తీసుకువెడతారు యింటికితాళంవేసి. అంతకు కొన్నిరోజులక్రితం వచ్చినతల్లి కొడుకుచర్యనచ్చక వెంటనే వెళ్ళిపోయింది.

బెజవాడ స్టేషన్. అప్పుడే వస్తుంది వాల్తేరు పోయే ప్యాసింజరు. ఆ బండిలోంచి దిగుతాడు ఆనందరావు. నాటికి వాని డ్యూటీ అయిపోయింది. స్టేషన్ మాష్టర్ నారాయణబాబుతో ప్లాట్ ఫారం మీద నిలబడి మాట్లాడుతూవుంటాడు.

"ఏమండీ ఆనందరావుగారూ! ఈ మధ్య మీలో ఏదో పెద్ద మార్పు కనిపిస్తోంది..."

"నాలో మార్పా—! అదేమిటండీ అల్లా అంటున్నారు..."

"నిజమేనండీ...ఇదివరకున్న ఉత్సాహం మీలో ఇప్పుడగుపించడం లేదు..."

"అబ్బే...మరేం లేదండీ...ఈ మధ్య కొంచం మనస్సు సరిగా లేదు లెండి..."

"ఏం...ఏమిటి సంగతి...? అంతా కులాసాగా వున్నారా?"

"ఆ!...ఇంతవరకూ భగవంతుని దయవలన..."

వీరిట్లు మాట్లాడుతూవుంటే పోర్టరు వెంకన్న వస్తాడు. ఆనంద్ తో "బాబూ! ఆనందబాబూ!...మిమ్మల్ని టెలిగ్రాఫ్ మాష్టారు పిలవమన్నారు బాబూ!..."

"ఆ!...ఎవర్ని...నన్నా...!"

"అవునండీ...మిమ్మల్నే...అర్జంటుగా రమ్మని చెప్పమన్నారు"

"సరే వస్తున్నానని చెప్పు..."

నారాయణబాబుతో ఏదో మాట్లాడి రెండు నిమిషములలో గబగబా వెడతాడు. టెలిగ్రాఫ్ మాష్టరు దగ్గరకు. అక్కడ టెలిగ్రాం ఒకటి చేత్తో పట్టుకుని కూర్చునివుంటాడు టెలిగ్రాం మాష్టరు. ఆనందరావు ఆతురతగా అక్కడకు వెళ్ళి వానిని ప్రశ్నిస్తాడు.

"ఏమండీ...పిల్చారా...."

టెలిగ్రాంమాస్టరు విషాదవదనంతో జాలిగా ఆనంద్ వంక చూస్తూ టెలిగ్రాంయిస్తాడు.

"అవునండీ... నేనేరమ్మన్నాను... అయ్యో చాలావిచారకర మయిన సంగతి..."

ఆనందరావు కంగారుపడుతూ ఆటెలిగ్రాం అందుకుని విప్పి చూస్తాడు. ఒక్కసారిగా కళ్ళుపచ్చబడినట్లవుతుంది. నిర్ఘాంతపోతా డు. క్షణకాలం స్తంభించిపోయి అట్లేనిలబడిపోతాడు. అదితనతండ్రి దగ్గరనుంచి వచ్చింది. కమల విషంతాగి మరణించినట్లు. ఈలోగా స్టేషన్ మాస్టర్ నారాయణబాబు ఆప్రక్కగాపోతూ ఆగదిలోకి వస్తాడు. ఆనంద్ కు వెర్రియెత్తినట్లవుతుంది.

"ఆ!...కమలవిషంతాగి...పోయిందా...!"

"ఆనంద్! చాలా విచారకరమయిన సంగతే... పాపం ఎందు చేతనో..."

అంటూ పాపం పరామర్శిస్తూ టెలిగ్రాంమాస్టరు. అప్పుడే ప్రవేశించిన నారాయణబాబుకు ఆశ్చర్యం కల్గుతుంది. ఆనంద్ ముఖం వివర్ణత చెందుతుంది.

"ఆనంద్! ఏమిటది...?"

"ఏంచెప్పను...?"

అంటూ ఆనందరావు తనచేతిలోని కాగితం నారాయణబాబు కిస్తాడు. నారాయణబాబది అందుకుని ఆతురతతో చదువుకుంటాడు. వానినోట మాటలేదు.

"అయ్యో! ఇదేమిటండీ ... దారుణం ... ఇంకాచూస్తారే మండీ...పాపమక్కడ మీ నాయనగారేమి అవస్థపడుతున్నారోను

...ఆయనకు పాపమీవృద్ధాప్యంలో...ఎల్లాంటి సంఘటన ... వెంటనే బయల్దేరి వెళ్ళిరండి..."

"కాని...శలవు..."

"ఒకటి రెండు రోజులువరకూ మరేమీబాధలేదు ... వెళ్ళి అదేదో చూసుకుని వెంటనే ఆలశ్యం చేయకమూత్రం వచ్చెయ్యండి ...మీనాన్నగారితో చెప్పండి అడిగానని...పాపం ఆయనకీదశలో ఇంతటికష్టం...హూం!..."

"అల్లాగేవచ్చేస్తానండీ...Thanks!"

"అయ్యో వెళ్ళిరండి..."

ఆనందరావు వెంటనే బయల్దేరి మరియొకగంటకల్లా వచ్చిన బండిలోయెక్కి బయల్దేరిపోతాడు విజయనగరం.

ఇక ప్రభాకర్ సంగతి యోచిద్దాం. అతడల్లా ఆనాటిరాత్రి వెళ్ళిపోయి కొన్నాళ్ళకు ఎక్కో రాజమండ్రి చేరుతాడు. ఇప్పుడాతని నానమూలు పట్టేవారేలేరు. చినిగిన గుడ్డలు మాసినగడ్డం. చీదరగా వున్నజుట్టు అతినీరసంగా తోలుత ఆనద్ కంటపడినప్పటికన్నా చాలా దీనదశలోవున్నాడు. ఆనాడు పన్నెండవతేదీ. ఆతడాయూరు జేరిరెండురోజులవుతుంది. బైరాగులకు, స్త్రీపాండ్రికు నివాసస్థలమగు కంభంవారిసత్రం అరుగుమీదకు జేరుతాడు. తనముందుకర్తవ్యాన్ని గురించి పాపం బెంగపెట్టుకుని పోతాడు. బాగాఆకలివేస్తోంది. చేతిలో ఒక్కపైసకూడాలేదు. ఎవరినైనా అడుగుదామంటే మనసొప్పదు. సాయంకాలం ఆరుగంటలవుతుంది. చల్లగాలికి చాలా మంది గోదావరిగట్టుకు చేరుతారు. మనప్రభాకరరావు ఎల్లోనెమ్మదిగా బయల్దేరి గోదావరిగట్టుకుజేరి అచ్చటనీటివద్దకుబోయి ఆనిర్మలోదకముల కాలుసేతులు ముఖము కడుగుకుని కడుపునిండుగా నీళ్ళు త్రాగి మరల నెమ్మదిగా గట్టుయెక్కుతాడు. అక్కడకొందరు

వ్యక్తులు ఆగట్టున కూర్చుని ఏవేవో కబుర్లు చెప్పుకుంటూవుంటారు. ఇంతలోకి ఇంకోవ్యక్తి 'ఆంధ్రప్రభ' పత్రికను పట్టుకునివచ్చి వారి వద్దకూర్చుంటాడు. అతడు పేజీలు తిరగవేస్తూ అందలివార్తలను స్నేహితులకు చదివివినిపిస్తూవుంటాడు అందులో ఒకడు.

"ఏమిటోయ్ గోపాల్ ! విశేషాలు...?"

"ఏం కావాలో ఏరల్ నీకు ... అంతావిశేషమే..."

"నాకింకేమికావాలి ... 'వాంటెడ్ కాలం' చూడ్డూ ... మనకి పనికివచ్చేది..."

"అదిటోయ్ నీగోడవ ... ఇదుగో చదువుతున్నా..."

గోపాల్ పేజీలుతిప్పుతూ ... ఒకపేజీలో దేనినోచూసి చటాలున ఆగి దానినిచదువుతాడు.

"మళ్ళీ వెంకటేశన్ మర్డర్ సంగతి వేశారోయి..."

"పోనిద్దూ ఎవడెల్లాచస్తేమనకేం...నేచెప్పిందిచూడ్డూ..."

"అంతతొందరెందుకోయ్ ... ఇందబాబు ఆపేజీ నువ్వే చూసుకో..."

అంటూ ఆకాగితం వానికిస్తాడు. మిగిలినవారు హత్యానేరం సంగతేదో చదవమంటారు.

"అదేదో చదవ్వోయ్ ! ... ఏంరాశాడో...".

ఆమాట చెవినిపడగానే ప్రభాకర్ ఉలికిపడి, కాస్తవారి దగ్గరగా వచ్చి ఓప్రక్కగా నిలుస్తాడు. అప్రక్కనేవచ్చి చేరాడో బైరాగి. వానికెందుకో ఆవార్తను! గోపాల్ ఈవిధంగాచదువుతాడు

న్యాయవాది వెంకటేశన్ హత్యవిచారణ.

మద్రాసు 12.

మద్రాసులోని ప్రసిద్ధ న్యాయవాది వెంకటేశన్ హత్య విషయంలో గంగ్రోతుభీమన్న అనేకాపువానిని అరెస్టుచేశారు.

విచారణ ఈనెల ఇరవైయో (20) తేదీన మద్రాసులో జడ్జీ వీర రాఘవరావుగారు జరుపుతారు. ఈ భీమన్న ఇదివరలో వెంకటేశ్వర ఇంట్లో బంట్రోతుపనిచేసి ఏదోపట్టింపులువచ్చి నౌకరీమాని వేశాడు. అతడే ముద్దాయియని బాగాఅనుమానిస్తున్నారు.

ఆవిషయం వినేసరికి ప్రభాకర్‌కు కంగారు ఎక్కువయింది. అదేమీ పైకిఅగుపించనీయక తిన్నగా సత్రం చేరుతాడు. అక్కడ ఒంటరిగా ఒక ఏకాంతస్థలంలో కూర్చుని ఏదోదీర్ఘంగా యోచిస్తూ వుంటాడు. పదుగంటలవుతుంది టైము. నెమ్మదిగా ఎక్కడనుండో వచ్చినవానికించుక దూరంలో పక్కపరుచుకు పడుక్కుంటాడు బైరాగి వెనుకచెప్పినవాడు. ప్రభాకర్ తనలోతాను గొణుగుకుంటూవుంటాడు నెమ్మదిగా.

"అన్యాయంగా ఇంకోవ్యక్తి శిక్ష అనుభవించడమా ... ఇప్పటికే నేనొకడనున్నాను అన్నిటికీ సిద్ధపడి ... పాపం భీమన్న కూడా ఎందుకు తగుల్కోవాలి ఉరులలోను ... ఛీ! ఇంకేంలాభం లేదు ... నాయీఅజ్ఞాతవాసంతో ... అనవసరంగా పైవాళ్ళంతా బాధపడుతున్నారు ... ఏమయినాసరే ఆనాటికోర్టుకు హాజరవుతాను ... దోషిని నేనని చెప్పేస్తాను..."

అస్పష్టమయిన వానిమాటలు వింటూన్న బైరాగి క్రమంగా వాని దగ్గరకుపోయి,

"ఏంభాయీ! ఏమిటి నీలోనువ్వే మాట్లాడుకుంటున్నావు.?"

దాంతో ప్రభాకర్ కొంచం తెలివితెచ్చుకుని నెమ్మదిగా,

"ఏంలేదుభాయీ! ఇవాళ ఎక్కడా ఏమీదొరకలేదు ... ఏంచెయ్యాలాని ఆలోచిస్తున్నా..."

"అయ్యో! నీకీవేళ భోజనమే లేదూ ... పోనీలే నాదగ్గరఒక మామిడి పండువుంది ... ఇస్తానుతిను..."

పద్దులేనాయనా! ... పాపంనీకుమాత్రం ఎక్కడనుండి వస్తుంది ... నీకులేకుండా నాకుఎందుకులే ... ఏదో ఈరాత్రి కిల్లాగడిపేస్తే ... రేపుఏదయినా దొరుకుతుంది...”

“మరేంఫరవాలేదు ... ఉన్నదానితోనే తృప్తిపడాలి. మనలోమనం సాయం పడకపోతే ఇంకెవ్వరుసాయం చేస్తారు ...లే ... ఇంద, ఇదితిను...”

అంటూ ఆబైరాగి ఎంతో ఆదరణతో ఒకమామిడిపండు తనసంచిలోంచి తీస్తాడు. అదిపుచ్చుకుని తిని కాస్తస్థిమిత పడతాడు. ఆనాటిరాత్రే పదిగంటలకల్లా బయల్దేరి వెళ్ళిపోతాడుఎక్కడకో.

పదిహేడవ ప్రకరణము సంపూర్ణము.

---

## పదియాఱవ ప్రకరణము

మద్రాసులో సుబ్రహ్మణ్యాంయిల్లు. మేడమీదగదిలో సుబ్రహ్మణ్యాం, పోలీసుఇనస్పెక్టరుకూర్చుని ఏదోసంభాషించుకుంటూ వుంటారు. అప్పుడు సుమారు పదిగంటలప్రొద్దెక్కుతుంది. ఇన స్పెక్టరు ముఖమించుక వివర్ణత చెందివుంటుంది. నెత్తినచేయిపెట్టుకుని ఏదో యోచిస్తూవుంటాడు.

“అంతా చెడిపోయిందండీ...”

“ఏమీ...ఏంజరిగిందండీ...!”

“ఆశంకరావు ఎల్లాగో మనవాళ్ళసంగతి తెలుసుకుని ఆరాత్రే ఆవూరునుండి పరారిఅయ్యాడుట...”

“ఆ! మరెల్లాగ...?”

“మరొక వాయిదాకోరుకుని ... ఈలోగా గట్టియత్నం చెయ్యాలి...?”

“మరి భీమన్నను పట్టుకున్నారుగా...?”

"అదంతా చాలాపెద్దగొడవ...పీని విచారణమొదలుపెడితే కాని అతడు బైటపడడు..."

"ఇంతకూ దొరుకుతాడన్ననమ్మకం...లేదు నాకు...బాగా తప్పించుకుపోయాడు..."

"ఆ! ఎందుకుదొరకడండీ ... అయినా గట్టిగా ఈసారి యత్నిద్దాం ... అప్పుడే చా లా మం ది 'C. I. D.' లను నియమించాం..."

"సరేచూద్దాం...ఏంజరుగుతుందో..."

"నాకుకొంచంపనుంది...వస్తాను..."

"మంచిదివెళ్ళిరండి..."

"మరేంభయంలేదు ... అన్నీసర్దుకుంటాయి ... దొంక్క ఏమవుతాడు..."

అంటూనే ఇనస్పెక్టరు లేచి తనపనిమీద వెళ్ళిపోతాడు. సుబ్రహ్మణ్యంకూడ తనపనిమీదపోతాడు లోనికి.

రెండురోజులుగడుస్తుంది. ఆ వేళ పందొమ్మిదవతేదీ. ఆనాడు ఉదయం ఎనిమిదిగంటలకు పద్మతనయింట్లో మేడమీద ఒకగదిలో కూర్చుని తనలోతాను కొంచంసంతోషిస్తూవుంటుంది భీమన్నవిచారణసంగతి తెలిసి. ఏమంటే ఇంకశంకరావుమీదే నేరముండదని ఆమెభ్రమ. ఇంతలోకీ లలితవస్తుంది అక్కడకు.

"ఏంపద్మా! ఏమిటి ఒంటరిగాకూర్చున్నావ్...?"

"రా! లలితా, ... ఏంలేదు ఇప్పుడేకాఫీత్రాగేను ... నాన్నగారు క్రిందస్నానం చేస్తున్నారు...ఏమితోచక కూర్చున్నాను. ... కూర్చో ... ఏమిటివిశేషాలు..."

ఆమె ముఖమంచుక విషాదాన్ని సూచిస్తూవుంటుంది. అది చూచి పద్మకొంచం సంకోచిస్తుంది.

"ఏంలలితా! అల్లావున్నావు...?"

"అబ్బే! ఏంలేదుకాని ... నేనోమాటవిన్నాను ..."

"ఏమిటది ... ఎవర్నిగురించి ...?"

"మనశంకర్రావుగంగతే ... "

"ఆ! ... ఏంజరిగింది ...?"

"ఆతణ్ణి చివరకు విజయనగరంలోనే... పట్టుకున్నారుట.."

దాంతో పద్మనెత్తిన పిడుగుపడ్డట్టయింది. నిశ్చాంతపోతుంది. క్షణకాలం నోటివెంబడి మాటలేదు.

"ఆ! ... నిజంగానే ... ఎవరుచెప్పారునీకు ...?"

"ఎవరయితేనేంగాని ... నాకివాళే తెలిసింది ..."

"అయితే ఇంకేదిదారిలలితా ! ... ఏంచెయ్య...?"

"ఏమో, ఏంచేస్తాం..."

"అయితే ఇక్కడకు తీసుకువస్తారా ... నాన్నగారితో చెపితే..."

"చెబుదామనే నేనూవచ్చాను ... కానిలాభమేమిటి ...?"

"మరేంచేద్దాం ... ?"

"సరే ఈవూరు తీసుకువస్తారుగదా ... ఈలోగా ఏదయినా ఆలోచిద్దాం..."

"ఏమోనాకు చాలాభయంగానే వుందిలలితా! భీమన్న విచారణ సంగతివినేసరికి వానిపైనేరం తప్పుతుందికదాఅని ఎంతోమురిసి పోయాను ... మళ్ళా ఇంతలో ..."

"అల్లా అధైర్యపడితే ఎల్లాగపద్మా! ... "

ఈలోగా జడ్జీగారు స్నానంచేసి. లలితను చూచి క్షణకాలం ఆగి.

"ఏంలలితా ! పొద్దుటే యిల్లావచ్చావు ... ?"

"అబ్బే ! ఏంలేదండీ ... "

ఇంతలోకి పద్మమాట కడ్డువచ్చి విచారకరంగా ఆత్రుతతో,

"లలిత కెవరో చెప్పారుటండీ...నాన్నగారూ!..."

"శంకరావును...విజయనగరంలో... పట్టుకున్నారని తెలిసిందండీ...బాబయ్యగారూ"

"ఆ!...ఏమిటీ...పట్టుకున్నారా...?"

"నాన్నగారి కెవరో పోలీసుఇనస్పెక్టరు చెప్పాడుట..."

"నిజమే..."

"ఆ! నిజమేనుట...నాన్నగారే చెప్పారు..."

"హూం!...బాగానేవుంది...అయితే మన రాఘ్ దగ్గరనుంచి ఏమీవుత్తరంలేదే...ఏమీఅర్థం కాకుండావుంది ... సరే కానివ్వండి ...చూద్దాం..."

"భీమన్న విచారణ రేపేకదండీ..."

"ఆ! రేపే...కాని మరిశంకరావుదొరికితే మళ్ళావాయిదా వెయ్యాలి..."

జడ్జీగారు లోనికివెడతారు. ఇంకాకొంచంసేపు ఏదోమాట్లాడి లలితకూడా వెళ్ళిపోతుంది. పద్మ అక్కడనుండిపోయి తనపడక గదిలో పరుపుమీద పడుక్కొని పరిపరివిధాల యోచిస్తూవుంటుంది. "ఇప్పుడేమిటిచెయ్యడం ...? ఈవిషయంలో మానాయనగారు మాత్రం ఏంచేయగలరు...?" అతడా దొరికిపోయాడు...ఏమయినా నేరం ఋజువుకాకమానదు...ఈవిషయంలో ఏమయినా సుబ్రహ్మణ్యం కనికరిస్తే లాభిస్తుందేమో ... అయినా అడుగుతే తప్పేముందీ...పరాయివాడినెల్లా అడగను...హూం! అడక్కపోతేవీల్లేదు...అవుసరం కల్గితే స్త్రీ పురుషత్వం వహించాలి...ఏమయినా వెళ్ళి సుబ్రహ్మణ్యాన్ని సాయంకోరుతా ... అయితే తనతండ్రిని

చంపిన హంతకుడిమీద దయచూపిస్తాడా ... ఏమో! సుబ్రహ్మణ్యం చాలామంచివాడు...సర్వవిధాలా అడుగుతాను... మీద దేముని దే భారం ...''

అని ఈవిధమయిన వెర్రిఆలోచనలలో పడిపోయింది అమా యకురాలుపద్మ. వెంటనే ఒకకాగితంతీసి ఈవిధంగా సుబ్రహ్మణ్యా నికి ఒకఉత్తరం వ్రాస్తుంది.

సుబ్రహ్మణ్యంగారూ!

మీతో కొన్ని అవసరవిషయాలను గురించి అర్జంటుగా మాట్లాడాలి. ఏఅభ్యంతరమూ లేకుండావుంటే నేటిరాత్రి ఎనిమిది గంటలకు మాపాతబంగళాకు తమరొక్కసారి రాగోరెదను. తప్పక వచ్చెదరని నమ్ముచున్నాను ... ఈవిషయ మించుక గూఢముగా నుంచగోరెదను.

'పద్మ'

ఈవిధంగా వ్రాసింది ఉత్తరం. పరపురుషునికి వుత్తరం వ్రాయుట, వానిని ఒంటరిగా రాత్రిసమయంలో కలుసుకొనగోరుట యన్నది తగనివిషయ మయినప్పటికీ శంకరశాస్త్రిపురిమీద తనకున్న ప్రేమచే వానినెట్లయినా కాపాడాలనే ఏకైకలక్ష్యంతో వున్న దామె. వెంటనే బంట్రోతునుపిలచి ఆవుత్తరం వానికిచ్చి వానికొక రూపాయి లంచమిచ్చి ఆలేఖ భద్రంగా సుబ్రహ్మణ్యానికి అంద చేయమనిచెప్పి పంపిస్తుంది.

జడ్జిగారి పాతబంగళా కొంచం బయలుప్రదేశంలో విశా లంగా ఇతర గృహములకు దూరంగావుంది. పైన వరండాలు అపరి శుభ్రంగా వుంటాయి. బంగాళాకు తాళం వేయబడివుంటుంది, లోన మాత్రం చాలాశుభ్రంగానే వుంటుంది. అది సముద్రతీరాన వుండ

డంచేత అప్పుడప్పుడు జడ్జీగారు చల్లగాలికనివచ్చి అక్కడవుంటూ వుండడము మామూలు. లోపల కుర్చీలు, సోఫాలుకూడా ఎన్నో వున్నాయి. రోజూ ఆబంగళా వరండాలలో సాయంకాలమయ్యేసరికి ఎందరో బిచ్చగాండ్రు, బైరాగులు ఇంకా బాటసారులు ఆఅరుగు మీద పడుకొంటూ వుంటారు. నాటిరాత్రి ఎందుచేతనోగాని ఎక్కువమంది ఎవ్వరూ జేరలేదు. ఒకమూలగా ఒకబిచ్చగాడు, మరియొకమూల మరియొక బిచ్చగాడూతప్ప ఇంకెవ్వరూ లేరు.

రాత్రి ఎనిమిది గంటలవుతుంది. పద్మవ్రాసిన ఉత్తరం చూచుకుని ఏదోఅపూర్వవిషయం తెలుసుకోవచ్చుననే కుతూహలం తోనూ...వస్తాడు తొందరగా సుబ్రహ్మణ్యం. తలుపు,తాళం వేసే వుంటుంది. ఇటూ-అటూ [illegible] తన్నెరుగని రీతిగా మెల్లమెల్లగా [illegible] వస్తుంది. తలు పులు తెరుస్తుంది. ఇద్దరూ లోపలకు వెడతారు. [illegible] బహుశ్రద్ధతో చూస్తున్నారు అరుగులమీద ఉన్న ఇద్దరు బిచ్చగాళ్ళు. అంతరాత్రివేళ ఒంటరిగా ఇద్దరు స్త్రీపురుషులు ఆబంగళాలో ప్రవేశించారూ అంటే ఏదో అనుమానమే వచ్చింది వాళ్ళకి. అందు లోను సమీపంలోనేవున్న బిచ్చగాడు వీధిదీపములకాంతిలో ఆ యిద్దరి ముఖాలు చూస్తాడు. ఎందుచేతనోగాని చాలాఆశ్చర్య పోతాడు. లోపల మాటలసవ్వడి వినవస్తుంది. ముసలిబిచ్చగాడు అతి శ్రద్ధతో వింటూంటాడు. వీనిచేష్టలు చూచేసరికి ఆరెండవ బిచ్చ గాడుకూడా శ్రద్ధగా పరీక్షి...వుంటాడు. ఇంకలోపల.

"ఏంపద్మా ! ఎందుకునన్నుపిలిచావు...?"

"మీరసలు వస్తారోరారోఅనుకున్నా...కాని"

"అయ్యో ! రాకుండాఉంటానా...అయితే సంగతేమిటి..?"

"అభ్యంతరేంలేదు ... శంకరాత్రివిషయంలో మిమ్మల్ని ఒకటి కోరుదామని..."

"ఆ ! శంకరాత్రివిషయంలోనా !...ఏమిటది?"

"మీరునాకు చేస్తానని వాగ్దానమిస్తే ..."

క్షణకాలంఆగి ఏదోలోలోన గొణుగుకుంటూ,

"ఊ ! సరే...ఏమిటది...?"

"అతను విజయనగరంపోలీసులకు దొరికిపోయాడుట...అతనికింకెల్లాగూ శిక్షతప్పదు ..."

దాంతో సుబ్రహ్మణ్యం ఆశ్చర్యపోతాడు. ఎవరో ఈమెకీ అసత్యవార్త చెప్పారనుకున్నాడు. తనకీవిధంగా చేజిక్కిన అప్సరస వంటికన్యను చేయిజార్చుకోవడమెందుకని యోచించి గంభీరంగా,

"అయితే..."

"మీరుతల్చుకుంటే...ఈవిషయంలో ఏమయినా..."

"ఓహో ! అదా ... అతను నాతండ్రినిచంపేడు ... శిక్ష అనుభవించవలసిందే..."

"అల్లాఅనకండీ ... కొంచందయచూపి ... ఈకార్యంలో ఏమయినా..."

ఆమెను లొంగతీయడానికిదే తగినసమయమనిఎంచి,

"ఏంలాభంలేదు...కానీ...ఒక్కటేమార్గముంది..."

అంటాడు సందేహంతో. ఆమె ఆశగా వానికేసిచూస్తుంది. ఆత్రుతగా ప్రశ్నిస్తుంది.

"ఆ !...ఏమిటది...?"

"నువ్వునావశముకావాలి...?"

"ఆ !..."

ఆమె నిశ్చేష్టపోతుంది. భయపడుతుంది. వీధిలో వింటూన్న బిచ్చగాళ్ళిద్దరకు ఒక్కసారిగా వడబడికిపోతాయి. వాళ్లెంతబిచ్చ గాళ్ళయినా అల్లాంటి అవినీతి కార్యం చూస్తూవూరుకోగలరా.

"అంతే...అదొక్కటేమార్గం...శంకర్రావుకు శిక్ష లేకుండా ఏర్పాటుచేయిస్తా...రా! నామాటవిను..."

"ఛీ! దుర్మార్గుడా అవతలకుపో!...సిగ్గులేదూ అల్లాంటి పేలాపనప్రేలడానికి..."

"ఏం...నాదిపేలాపనా...హూం!..."

"వదరుబోతా!...ఇంతటిదుర్మార్గుడవానువ్వు..."

"అయితేనీయిష్టం..."

"ఏమయినాసరేఅంతటినీచకార్యాని కొడబడతాననుకోకు.."

"అయితే...ఆలోచించుకో శిక్షతప్పదు..."

"అంతేనా...నీకేంకావాలన్నాయిస్తాను ... కొంచం దయ చూపించు..."

"నాకేంకావాలి...నువ్వే..."

"ఛీ! త్రాగుబోతా ... జాగ్రత్తగామాట్లాడు ... లేక పోతే..."

"హూం!... లేకపోతే ... ఏమవుతుంది ... నామాటవిను పద్మా!...ఎందుకు అనవసరంగా కష్టపడడం...ఒక్కసారి..."

"దుర్మార్గుడా ... ఏమనుకున్నావో చూడు ... నీమర్యాద దక్కదు..."

"ఆ!...ఏమవుతుందేమిటి..."

అంటూవెళ్ళి అతడామెను బలాత్కారంగా పట్టుకుంటాడు. ఆమెవానిచెయ్యిగట్టిగా కరచివేయును. ఆబాధసహించలేక అతడు కెవ్వుమని ఆమెనుతోసి వేయును. ఆమెక్రిందపడిపోయినది. తలకు

బలముగు గాయంతగిలినది. స్పృహ తప్పినది. ఆమె క్రిందపడగానే ఇవతలనున్న ముష్టివాడు తటాలున సాహసించి లోనికి వెడతాడు. వీనిరాకడ కనిపెట్టి లోనున్న సుబ్రహ్మణ్యాం చరాలున ఆవలకు తప్పుకుంటాడు. లోనికిబోయినవ్యక్తి పడిపోయివున్న పద్మతలనుండి కారేరక్తాన్ని తుడుస్తూవుంటాడు. అదేసమయమని సుబ్రహ్మణ్యాం వెనుకనుండిబోయి గబగబా సమీపముననేయున్న లోకల్ టెలిఫోన్ ద్వారా పోలీసువారినిపిలుస్తాడు.

"హల్లో ! పోలీసుస్టేషన్ ! హల్లో !!..."

"హల్లో ! ఎవరిది...?"

"హత్యజరిగింది ... జడ్జీగారి పాతబంగళాలో ... వెంటనే రావాలి..."

"ఆ!...హత్య! ... ఇప్పుడేవస్తున్నాం..."

"అర్జంటు ... హంతకుడింకా అక్కడేవున్నాడు..."

మరియొక పావుగంటకల్లా పోలీసులు పాతబంగళా వద్దకు వస్తారు. అక్కడ సుబ్రహ్మణ్యాం వాళ్ళను కలుసుకుంటాడు. అంతా కలిసి లోపలకు వెడతారు. ఈచిత్రమంతాచూస్తూవుంటాడు అరుగు మీదనున్న రెండవముష్టివాడు. లోపలనున్న వ్యక్తి పద్మతలకు తన దుస్తులను గుడ్డతో కట్టుకడుతూవుంటాడు. వెంటనే పోలీసులు వారిని అరెస్టు చేస్తారు. బాగాపరీక్షగాచూస్తాడు సుబ్రహ్మణ్యాం ఆవ్యక్తిని. కెవ్వున కేక వేస్తాడు.

"ఆ! ... ఎవరు ... శంకర్రావే..."

దాంతో పోలీసులుకూడా ఆశ్చర్య పోతారు. తామెన్ని విధాల కష్టపడినా దొరకని శంకర్రావు నేడు సులభంగా ఏశ్రమా లేకుండావారికెక్కిదొరికాడంటే వారికాశ్చర్యంకలగడంలోవిశేషంలేదు.

"ఆ! శంకర్రావే...పాత నేరస్థుడే... అబ్బా! ఇన్నాళ్ళకు దొరికాడు......"

"ఏంబాబూ! ఇదిఇంకొకటా..."

శంకర్రావేమీ సమాధానమివ్వడు. పోలీసులు పద్మనుపరీక్ష చేస్తారు. ఆమెచనిపోలేదు. వెంటనే కారులో పరుండబెట్టి శంకర్రావును తీసుకువెళ్ళిపోతారు. అంతవరకు జరుగుతూన్న యావత్తు విషయం మిగుల శ్రద్ధతోకనిపెట్ట అబిచ్చగాడు తనదారిని పోబోతూంటే ఆహడావడిలో పద్మ, సుబ్రహ్మణ్యానికి వ్రాసినవుత్తరం సుబ్రహ్మణ్యం పారేసుకున్నది వానికిదొరుకుతుంది. వానిముఖం వికసిస్తుంది ఆవుత్తరంచూడగానే. దానిని జాగ్రత్త పరచుకుని తిన్నగా తనదారిని పోతాడు, అబిచ్చగాడెవరో...?

మర్నాడు ప్రొద్దుటే పొక్కిపోయింది పట్నమంతా ఖూనీ నేరస్థుడు శంకర్రావుదొరికినట్లు. పేపరులో ప్రచురించారు. ఉదయం ఎనిమిది గంటలకల్లా C. I. D. నాథ్ జడ్జీగారి మేడవద్దకువస్తాడు. మేడగదిలో జడ్జీగారు ఏదోపుస్తకం చూసుకుంటూ వుంటారు. నాథ్‌ను చూడగానే కొంచెం ధైర్యంతో,

"రావోయ్ ... ఎప్పుడువచ్చావ్ ... పరిస్థితివిషమించింది ... పనిజరుగలేదుకదా..."

"ఏమండీ...అల్లాఅంటున్నారూ..."

అన్నాడు ఆశ్చర్యంగా. దానికి జడ్జీగారుకొంచం కంగారుగా.

"ఇంకా అనడమేమిటి...శంకర్రావు పట్టుపడ్డాడు..."

"అయితే...ఏమయిందండీ ... కానిపాపం నిన్నరాత్రి మీ అమ్మాయి..."

"ఆ!...ఏం జరిగింది...?"

"మీపాతబంగళాలో నిన్నరాత్రి..."

అంటూ జరిగిన యావత్తువిషయం పూసగుచ్చినట్లు తెలియ చెబుతాడు. ఇప్పుడు మనకు రాత్రివృత్తరం సంగ్రహించిన బిచ్చగాడే C. I. D. నాథ్ అని పూర్తిగా తెలిసింది. అదంతావిని జడ్జిగారు తెల్లబోతారు. ఏదో కోర్టువిషయంలో చికాకుపడి రాత్రి పద్మవిషయమే గమనించలేమఆయన. కంగారుగా బయల్దేరుతారు కారులో ఆస్పత్రికి. తోవలో.

"నాబుద్ధినిబట్టి యోచిస్తే ఆశంకరావు దగ్గరఏమీ దోషగుణమున్నట్లు లేదండీ..."

"మరయితే దోషిఎవరు...?"

"అదిమాత్రం తెలియలేదుసార్! ... ఇదిగోనండి డైరీ... [illegible] ప్రతీదీ వరసగా వ్రాశాను....విజయనగరంలో ఆ [illegible] ఇంటిదగ్గర అంటే రిటైర్డు సబ్ జడ్జీ చంద్రశేఖరం గారింటిదగ్గర [illegible] పేరుతో వున్నా. తర్వాత బైరాగివేషతోనూ, బిచ్చగాడి వేషంలోను వానినను సరించాను. విశేషాలన్నీ డైరీలో వున్నాయి..."

"సరేలే అదలాఅక్కడేవుంచు ... ఆనకవచ్చి పట్టుకెళ్ళు ఈ లోగా నోసారి చూస్తాను..."

ఈలోగా కారుఆస్పత్రిదగ్గర ఆగుతుంది. నాథ్ జడ్జీగారివద్ద శలవుపుచ్చుకుని వెళ్ళిపోతాడు. జడ్జీగారు పద్మనుచూసి ఆమెస్థితికి మిక్కిలి విచారించి డాక్టరు సలహాతో ఆమెను తనయింటికి తీసుకు వెడతారు అక్కడ వైద్యసహాయం ఇప్పించడానికి. ఇంటికివచ్చాక లక్ష్మీబాయమ్మగారు పాపం చాలావిచారిస్తుంది. కాని డాక్టర్లు ప్రాణభయం లేదని ధైర్యం చెప్పారు.

పదియూఱవ ప్రకరణము సమాప్తము.

---

# పదునేడవ ప్రకరణము

గుంటూరు రామశాస్త్రియిల్లు. లచ్చమ్మకిప్పుడు కొంచం నింపాదిగానేవుంది. ఉదయం పదిగంటల సమయం. లచ్చమ్మ ఏదో లోపల వంటపనిచుక్తున్నంలోవుంది. రామశాస్త్రి వీధిసావడిలో కూర్చుని గీతాపారాయణ చేస్తున్నాడు. కృష్ణారావు ఆదుర్దాగా వస్తాడు.

"ఏమండోయ్ శాస్త్రిగారూ...మీవాడు చివరకుదొరికాడు"

"ఆ! దొరికాడా...ఎక్కడున్నాడు నాయనా..."

"ఏంచెప్పనండీ...పోలీసులు పట్టుకున్నారు...మదాసులోనే ఖైదులో వుంచారుట..."

"ఆ! పోలీసులే...జైల్లోనే...ఏమేవ్ ... అబ్బాయిని ఆఖరుకు పట్టుకున్నారుట పోలీసులు..."

ఆమె ఆమాటలువిని గబగబా ఈవలకు వస్తుంది.

"ఏం...నాయనా! ఒక్కమాటయినా చూడనివ్వరూ... మానాయన్ని..."

"ఎందుకు చూడనివ్వరండీ మామ్మగారూ! ... నేనూ వెడుతున్నాను...బయల్దేరండి మదాసు వెడదాం..."

"నువ్వు వెడుతున్నావా బాబూ!..."

"అవునండీ..."

"మేమూ వస్తాంనాయనా!...తీసుకెళ్ళు...మాబాబునొక్కసారి చూస్తాం... అక్కడకాపిల్ల అల్లాఅయిపోయింది...కదా..."

వెక్కి వెక్కి ఏడుస్తువుంటుంది. ఆమెను ఓదారుస్తూ, "విచారించకండీ...ఆనక రెండుగంటల బండీలో వెడదాంసిద్ధంగావుండండి"

అంత ఆనాటి మధ్యాహ్నం బయల్దేరి మదాసుచేరుతారు.

ఇంక విజయనగరంలో ఆనందరావు ఆనాడు చాలా విచారంగా తనగదిలో కూర్చునివుంటాడు. ఆవేళ 24 వ తేదీ. అదివరకు

భీమన్న విచారణ శంకర్రావువారకగానే ముప్పదియవ తేదీకి మారుస్తారు. కొంతసేపటికి పేపరువాడు పేపరు తెచ్చియిస్తాడు. అందులో చూస్తాడు శంకర్రావు దొరికినట్లు, 30 వ తేదివిచారణఅని ఒక్కసారిగా వడలుజలదరిస్తుంది.

"ఆ!... దొరికిపోయాడా...! అయితే నేనుపడ్డశ్రమఅంతా వృథాయేనా... ఎంతపనిజరిగింది ... పాపంఎంతచెప్పినా విన్నాడు కాదుకదా— ఆహా!..."

అక్కడనుండి నెమ్మదిగాలేచి వెళ్ళిలోపలసావడిలో సోఫాలో కూలబడతాడు. కొంచం సేపటికి చంద్రశేఖరరావుగారు వస్తారు. ముఖంవంచుకుని కూర్చున్న ఆనంద్ నుచూచి,

"ఏం? నాయనాఆనంద్ ! అల్లాకూర్చున్నావు ... వంట్లో బాగాలేదాయేమిటి...?"

"ఆ ! ఏంలేదు నాన్నగారూ !... ఏంచెప్పను ... చివరకుమన శ్రమంఅంతా వృథాఅయిపోయింది..."

"ఏం ... ఏమిటది ... ఏంజరిగిందీ...?"

"మనశంకర్రావును..."

"ఆ !...ఏంచేశారు...ఏమయినా తెలిసిందాయేమిటి వాని సంగతి...?"

"చెప్పినమాట విన్నాడుకాదు...చివరకు అరెస్టుచేశారు..."

"ఆ!... అరెస్టుచేశారా! ... ఎప్పుడు ... ఎక్కడ...?"

"మెడ్రాసులోనే— ముప్పైయవ తారీకున విచారణ ... ఇదుగో పేపర్లో వేశారు."

ఆనందరావు చేతిలోని పేపరు అందుకుని, చంద్రశేఖరరావు గారు ఆతురతగా చూస్తారు. పాపం ఆయనకు చాలావిచారమే కల్గుతుంది.

"ఎంతపనిజరిగిందీ ... వెర్రివాడు గాకపోతే...మళ్ళీఅక్కడ కెందుకు వెళ్ళాడు..."

"ఏంచెప్పగలం వానిఉద్దేశం...?పిచ్చివాడిలా అయిపోయాడు చివరకు... మొదటనుండీ వెళ్ళిపోతాననేవాడు..."

"ఏమిటోలే ... నాకేమీ అర్థంకావడంలేదు ... పాపం చివర కేమవుతుందో ..."

"అదిభగవంతుడిదయ... అసలు తనే వప్పుకుంటాడుకదా, వచ్చినచిక్కే-అది..."

"మనమేం చేయగలంచెప్పు ... సాధ్యమయినంతవరకు సాయంచేశాం ... ఏదోమనకు తోచిందిచెప్పాం ... విన్నాడు కాదు మనమేంచేయగలం...?"

"అతని వుద్దేశం వేరు నాన్నగారూ ..."

"ఏమిటంటావ్...?"

"అతనసలే చాలమెత్తని మనసుగలవాడు ... తానువచ్చి ఇక్కడుండిపోతే...అవతల తనబావకుకాని ఏదయినాచిక్కు తటస్థించిందేమోనని అనేకపర్యాయములతడు వెళ్ళిపోతాననేవాడు— కాని నేనే వానిని సముదాయించేవాడిని ... అంతేగాని మరొక కారణంఏమీ లేదు..."

"ఏం...చేస్తాం...దైవాధీనం ...ఎల్లావుంటే అల్లాజరక్క మానదు..."

"నేనురేపు బయల్దేరి మద్రాసు వెడదా మనుకుంటు న్నానండీ..."

"నువ్వా...! దేనికీ..."

"ఆఖరుసారయినా ఓమాటువానిని కలుసుకుందామని..."

"అయ్యో! అల్లాఅయితే వెళ్ళిరాకతప్పకుండా ... తన యీపరిస్థితికి నేనుకూడా చాలావిచారిస్తున్నానని చెప్పు..."

"అల్లాగే... లేవండి భోజనంచేసేద్దాం..."

"సీతమ్మగారువుందా..."

"ఆ! వంటయిందని చెప్పింది... లేవండి ఎందుకు అనవసరంగా ఆలస్యంచేసుకోవడం..."

"లే...అయితే నేనూవస్తున్నాను...వడ్డించమని చెప్పు..."

ఆనందరావు వంటయింట్లోకి,జడ్జీగారు మేడమీదకు వెడతారు. ఆమర్నాడే బయల్దేరి ఆనందరావు మద్రాసు వెడతాడు.

మద్రాసులో జైల్లోవుంటాడు శంకరావు. సాయంకాలం నాలుగుగంటలవుతుంది. జైలుఅధికారుల అనుమతితో రామశాస్త్రి లచ్చమ్మ కృష్ణారావులువస్తారు శంకరావున్నగదివద్దకు. శంకర్రావు చిక్కి శల్యావశిష్టుడైవుంటాడు. వానిని చూడగానే లచ్చమ్మ బావురుమని యేడ్వ మొదలు పెడుతుంది.

"నాయనా! శంకరం..."

"ఆ!...అమ్మా!.. మీరా..."

"ఏమిటినాయనాయిది...ఇల్లాంటిపనిచేశావు...?"

"చివరకెంతపనిజరిగిందోయ్ ... శంకరం ... " అన్నాడు కృష్ణారావు.

"ఏంచెయ్యనునాన్నగారూ అల్లాంటిపరిస్థితివచ్చింది..."

"ఇంతకూ దైవవిధిఎల్లాఉంటే ... అల్లాజరుగకతప్పదు కదా..."

"చివరకు నంటరిగాడవయిపోయిన నువ్వుకూడా..."

"ఆ! ... అదేమిటమ్మా ...అల్లాఅంటావు!..."

"అయ్యో ! రాధా !..." వెక్కి వెక్కి యేడ్వడం మొదలు పెడుతుంది.

"రాధ కేమయిందమ్మా !..."

"ఇంకా అవడమేమిటినాయనా ... రాధమనల్నివదిలేసింది"

"ఆ !...చనిపోయిందా ... అయ్యో ! ... దేవుడా ... చివరకెల్లాచేశావూ..."

నెత్తినచెయ్యిపెట్టుకుని బుర్రకిందికు దించుకుని దుఃఖిస్తూ వుంటాడు.

"అవును నాయనా! ఏం చేస్తాం... రెండు నెలల్రితం కలరా వచ్చి ... చనిపోయింది..."

"టైమయిపోయింది రండయ్యా! ఇంక ఉండడానికివీలు లేదు నడవండి..."

"ఆ!...అప్పుడే..."

"అవునమ్మా! నడవండి..."

ఇంక తప్పదనుకుంటారు. దుఃఖం అపుకోలేక వెక్కి వెక్కి యేడుస్తూ అంతా నెమ్మదిగా వెళ్ళిపోతారు. శంకర్రావు దీనంగా వారివంకచూచి వారు వెళ్ళిపోగానే లోనకూర్చుని నెత్తిన చేయి పెట్టుకుని యోచిస్తూ వుంటాడు. ఇంతలోకీ ఆనందరావు ప్రత్యేక అనుమతితో వస్తాడు.

"ప్రభాకర్!..."

"ఆ!...ఎవరది...?"

అని బుర్రయెత్తి ఆనందరావునుచూస్తాడు. దుఃఖంయిదుర్వారకూ పొంగి పొరలి వస్తూవుంటుంది. ఆనంద్ దుఃఖాన్ని దిగమ్రింగి.

"నేను...ఆనందరావునోయ్...ఎంతపని చేశావోయ్ శంకరం...కొంచమయినా యోచించావుకావు..."

"ఏంచెయ్యను...ఆనంద్...నువ్వొరుగని దేముంది...!"

"చివరికిల్లా చిక్కిపోయావా...హాం!..."

"చింతించి ఏంలాభంలేదు ఆనంద్! విధినెవరడ్డగలరు...? అంతా ఖులాసాగా వున్నారా..."

"ఏంఖలాసాలే..."

శంకరావు ఆనంద్ దీనముఖమును గుర్తించి ఆత్రుతగా అడుగుతాడు.

"ఏం...అల్లా అంటున్నావ్...?"

"అనడాని కేముంది...కమల...ఆత్మహత్య..."

"ఆ! ఆత్మహత్యే!...కమలా!...అంతటిబాధేంకలిగింది..."

"ఏమనిచెప్పను...నివురుగప్పిన నిప్పులావుండి...ఆరామం.."

"ఆ!...ఏం చేశాడు..."

"బలవంతపరిస్తే...ఇంక జీవించి లాభంలేదని అభిమానపడి విషం తాగేసింది..."

"శివ! శివ!! ఎంతమాట విన్నామా...పాపం ఎంతపని జరిగిందీ..."

"ఏంచేస్తాం...దైవవిధి అల్లావుంది...కాని నీ పరిస్థితే నాకు చాలా ఆందోళనగా వుంది..."

"నన్నుగురించి నువ్వింకేం చింతించకు ఆనంద్! ఇప్పటికే నాగురించి చాలా కష్టాలు పడ్డావు..."

"స్నేహితునికోరకు పాటుపడడమంటే అంతకష్టమా శంకర్!

"నిజంగా నీ సాయమే లేకపోతే...నాపని..."

"సాయపడినామాత్రం ఏం లాభించింది చెప్పు...? అంతా బూడిదలోపోసిన పన్నీరయింది కదా..."

"అది దైవవిధి...దానికి నీవుమాత్రమేం చేయగలవు... ఆనంద్!"

"ఇంతకూ సత్యం జయించకుండా వుంటుందా..."

ఇంతలోకి పోలీసు వస్తాడు...

"అయ్యో! టైమయిపోయింది ... ఇంక ఉండడానికి వీలు లేదు..."

"శంకర్? వస్తానోయ్...ఇంక దేముడే సాయపడాలి..."

"మంచిది వెడతావా...హూం!...సరే..."

అంటూ ఓ పెద్దనిట్టూర్పు విడుస్తాడు. ఆనందరావు నిష్క్రమిస్తాడు. శంకర్రావు తిరుగ ఆలోచనలో పడతాడు. కొంతసేపటికి వెర్రివానిలాచూస్తూ ఏమో ఆలోచిస్తూ ఉంటాడు నెమ్మదిగాతనలో.

"హూం! రాధ...రాధ చనిపోయిందా...కమల ఆత్మహత్య చేసుకుందా...ఆ!...నిజమే...మా రాధ యింక కనబడదూ...ఇంక నే బ్రతికి ఏంలాభం...లేదు...రాధ లేదు ...అహ్హా...హ్హా...హ్హా... రాధలేదు...కమల కనబడదు..."

ఉన్మత్తునివలె పదినిముషములపాటు అల్లేఅరచి ఆప్రక్కగా పడిపోవును. వాని అరపులువిన్న జైలువార్డర్లు పర్వెత్తుకువచ్చి పడియున్నవానిని చూచి త్వరితముగా జైలు అధికారికి తెలియజేతురు. జైలుడాక్టరును తీసుకు వత్తురు. డాక్టరు శంకర్రావును పరిశీలించి.

"కొంచం తీవ్రమయిన మనోవేదనకల్గి వుండవచ్చు...కొంచం జ్వరంకూడా తగిలింది...వెంటనే వైద్యశాలకు పంపించడంమంచిది"

"అల్లాగే"

అని జైలుఅధికారి అక్కడనుండి వెళ్ళిపోతాడు. అంతా వెళ్ళిపోతారు. ఏంబులెన్సు కారు తెచ్చి అందులో శంకర్రావును తీసుకు

పోయి గవర్నమెంటు ఆస్పత్రిలో ప్రత్యేకంగా ఒకగదిలో పక్క మీద పడుండబెడతారు. ఆగదికి నలుగురు పోలీసులు కాపుంటారు.

అది సివిల్ సర్జనుగారిల్లు. డాక్టరుగారు మేడమీదకూర్చుని వుంటారు. ఉదయం ఎనిమిదిగంటలసమయం. ఆరోజు ఆదివారం కుమార్తె లలితవస్తుంది.

"ఏమమ్మాలలితా ! ఇల్లాగవచ్చావు...!"

"ఏంలేదండీనాన్నగారూ ... ఇవాళ 28 వ తేదీకదూ..."

"ఆ !...అవును...అయితేయేం...?"

"ఇప్పుడేపద్మ యింటిదగ్గరనుండివస్తున్నా..."

"ఎల్లావుంది పద్మవంట్లో..."

"కొంచంసుళువుగానేవుంది ... కాని ... శంకర్రావునుగురించి పూర్తిగాబెంగపెట్టుకుంది..."

"పాపంవెర్రిపిల్ల! శుద్ధఅమాయకురాలు... ఆశంకర్రావును నిన్ననే ఆస్పత్రిలోజాయిన్ చేయించాం..."

"ఆ ! ఆస్పత్రిలోనా ... దేనికి...?"

"కొంచం మానసికంగాస్వస్థతతప్పి పిచ్చిస్థాయికి దిగేడు...కొంచం జ్వరంకూడావస్తోంది"

"అయితే... ఏమయినాప్రమాదం..."

"ఉహ్వే ! మరేంభయంలేదు...కాని ఈకేసుసంగతే నాకు చాలావిచారకరంగావుంది..."

ఇంతలోకి తనకోసమెవరోవస్తే డాక్టరుగారులేచివెళ్ళి పోతారు. లలిత అక్కడేకూర్చుని ఏదోదీర్ఘాలోచన చేస్తూ వుంటుంది.

ఆనాటిరాత్రి ఎనిమిదిన్నరగంటలవుతుందిటైము. శంకర్రావు కలతనిద్దురలో కలవరిస్తాడు. ఆ కలవరింతమాటలు అక్కడకాపలా

వున్న పోలీసులుకలుగురూ; రాత్రి డ్యూటీలోవున్న అసిస్టెంటుడాక్టరు వింటారు. పోలీసులు ఆమాటలు తమపుస్తకంలో వ్రాసుకుంటారు.

"రాధా !...ఏమిటిదంతాను ... ఎంతపనిచేశాడుబావ ... వీడు చచ్చిపోయాడే ... హూం ! సరేలేనువ్వు ఈయిల్లుశుభ్రపరచు...నేనీశవాన్ని పరస్థలంచేసివస్తా ... ఊం !...మీరెంతదయగలవారండీ ... ఏంచెయ్యను ... మారాధకోసం ... ఆనేరం నానెత్తినపెట్టుకు ...హూం !..."

అటునుండి యిటుకదులుతాడు. దాంతో డాక్టరు వానిని చేతితోతట్టిలేపుతాడు.

"మిష్టర్ !..."

అతడు కొంచంతెప్పిరిల్లి తెలివితెచ్చుకుని కళ్ళుతెరుస్తాడు.

"రాధా !...రాధా !!

అంటూ ఎదురుగావున్న డాక్టర్నుచూసి తెల్లబోతాడు. మరల కళ్లుమూసుకుంటాడు.

"ఎల్లావుందినీకంట్లో..."

"ఊ ! అల్లాగేవుంది..."

"ఇంద ... ఇదితాగిపడుకో ... " అని మందలిస్తాడు డాక్టరు. అదితాగిపడుక్కుంటాడు శంకరావు.

ఆవేళ ఇరవైతొమ్మిదవ తేదీ. రాత్రితొమ్మిదిగంటలవుతుంది టైము. ఆసుపత్రిలో ఒకమంచంమీదపడుకునిఉంటాడు రాఘవరావు ఏదోయోచిస్తూవుంటాడు. మర్నాడు శంకరావువిచారణ. వాని ఆత్మ వానిమందబుద్ధికి తీవ్రంగా ప్రతిఘటిస్తుంది.

"దుర్మార్గుడా ! ... అన్యాయంగా నీగురించి ఇద్దరుకష్టం పొందుతూంటే ... మాటలాడక ఏమీఎరుగనట్లూరకున్నావా... నీవుచేసిన అన్యాయమునకు ఫలితంగా ... నీభార్యచనిపోయింది...

నీవు మృత్యుముఖమునన్నావు ... నీబావమరది శంకర్రావుశిక్షకు. సిద్ధంగావున్నాడు...ఇంక నువ్వేమిసుఖమనుభవిస్తావు ... నీసుఖము నకై యితరులజీవితములు బలిగోరుతున్నావా ... ఇంతటిరాక్షస కృత్యమా ... ఛీ ! దుర్మార్గుడా !!...నీఆస్తి యంతా నశించాక ఇంకనీ వేమిసుఖమనుభవిస్తావు...? ఇక నీ వికెల సంబంధముల్పరచవు! సుగుణసంపన్నుడగు శంకర్రావ్ నీకేమిఅపకారంచేశాడు...అన్యాయంగా వానినపవాదుపాలుగావించావే ... ఇన్నిపాపములుచేసి నువ్వేంసుఖిస్తావు ... నీజీవనజ్యోతి ఆనాడేనశించింది ... లే !... ఇంకా యేమిటియోచిస్తున్నావు ... రేపే వాని భావిజీవితమునకు తుదినిర్ణయదినం ... నిజంబలుకుము ... అంత్యదశయందున్న నీకింకను సుఖాసక్తిచావలేదా...త్యాగమూర్తియగు శంకర్రావును కాపాడు ... లే ... వానిని మన్నింపవేడుకో ... పశ్చాత్తాపము వలన పాపమునశించును ... లే ... త్వరపడు..."

ఈలోగా నర్సు మందుయిచ్చుటకు వస్తుంది. ఆమెరాకతో అతడులికిపడి ఆమెవంక చూస్తాడు.

"ఏమండీ ... ఎల్లావుంది...?"

"ఏమిఉండడంలే ... జీవితంమీద రోతపుడుతుంది..."

"ఏమండీ అల్లాఅంటారేం..."

"ఏం లేదు లేకాని ... అదేమిటి ...?"

"మందు ... తీసుకుని పడుకోండి ... తొమ్మిదిదాటింది."

"మంచిది..."

అనిమందుపుచ్చుకుని ఏదోయోచిస్తూపడుకుంటాడు.

ఆనాడు ముప్పదియవ తేది ... ఉదయం పదకొండుగంటల సమయం ... జడ్జీకోర్టు జనంతో కిటకిటలాడుతూ వుంటుంది. ముద్దాయిని నిలబెట్టేచోట ఒకకుర్చీ వేసి అందుపైని శంకర్రావును

కూర్చొని పెడతారు, ప్రక్కన భీమన్న నిలబడివుంటాడు. ఆనందరావు C. I. D స్టాఫ్; గతించినరాత్రి శంకర్రావుకు కాపలావున్న పోలీసులు, అసిస్టెంటుసర్జను; పద్మ, లలిత, సోమశేఖరరావుగారూ రామ రాస్త్రి, భార్యా అంతాహాజరవుతారు కోర్టుకి. జడ్జీవీరరాఘవ రావుగారు వస్తారు. రాఘవరావు సుబ్రహ్మణ్యములుకూడావుంటారు. జడ్జీ ఒక్కపరి అందరివంకచూసి శంకర్రావుతో.

“నీవు న్యాయవాది వెంకటేశన్‌ను గతనవంబరు 10వ తేదీని మీ బావగారయిన లాయర్ రాఘవరావుగారింట్లో హత్యచేసినట్లు నీపైన నేరమారోపించబడినది ... కాబట్టి ఆవిషయంలో నీవేమి సమాధానమిస్తావు ...?”

“నేనేమీ చెప్పదల్చుకోలేదు...”

“అయితే నీవు నేరంచేసినట్లు ఒప్పుకున్నట్లేనా...?”

“అవును ...”

వెంటనేముద్దాయి తరపు న్యాయవాదిలేచి

“Your honour! ఇతడు ప్రస్తుతము మనస్థిమితములేక కొంచం మతిభ్రమణం కల్గివున్నాడు ... కావాలంటే కోర్టువారు ఆవిషయమై డాక్టరుపరీక్ష చేయించవచ్చు ... అసిస్టెంటుసర్జన్‌ను పరీక్షిస్తే ఆవిషయం కొంత తెలుస్తుంది...”

గవర్నమెంటు ప్లీడరు అందుకుని

“మొన్నటిరోజున ఏదోజ్వరం తగిలిందని వైద్యశాలకుచేర్చి నట్లున్నదికాని ...”

“చిత్తం! ... నిన్నటిరాత్రి జరిగినవిషయాన్ని ఇదుగో యీ డాక్టరుగారిని ... ఈనలుగురు కాపలా పోలీసులను విచారిస్తే తెలుస్తుంది......”

జడ్జీఅనుమతిపైని డాక్టరు నలుగురు పోలీసులు సాక్ష్యమిస్తారు. పోలీసులు వ్రాసిన డైరీచూపిస్తారు.

"ముఖ్యంగాదీన్నిబట్టి ముద్దాయినిర్దోషిఅనీ దోషిన్యాయ వాది రాఘవరావని తెలుస్తోంది. ... భీమన్నకిందులో ఎట్టిసంబంధమూ వున్నట్లు ఎట్టిఆధారములులేవు ... అందుచే సోదరియొక్క సంసారం నిలపడానికని తనఆత్మత్యాగం చేయదలంచిన త్యాగమూర్తి యీశంకర్రావు. ఈవిషయం ఋజువుఅవడానికి ఆనంద్ మొదలయిన ముద్దాయితరఫు సాక్షులను విచారిస్తే తెలుస్తుంది..."

దాగిపైని ఆనందరావు, —తనకూ ఆనందరావునకు సంబంధమున్నంతవరకు ఉన్నదున్నట్లు చెప్పివేశాడు. C. I. D'. నాథ్ తన డైరీచూస్తాడు ...పద్మకూడా 19 వ తేదీన తనకుసుబ్రహ్మణ్యం చేసిన అవమానం చెపుతూ శంకర్రావు నిర్దోషి అని వాదిస్తుంది, ఇంతకూ ముఖ్యంగా రాఘవరావులేచి జరిగినవిషయం యావత్తు ఉన్నదున్నట్లు చెప్పేసి తానేదోషినని, హంతకుడనని వప్పుకుంటాడు ... దాంతో రహస్యం బయల్పడుతుంది. తీవ్రంగా యోచించి జడ్జీగారు తీర్పుచెప్పెదరు. సుబ్రహ్మణ్యాన్ని అరెస్టు చేస్తారు. నిర్దోషులని శంకర్రావు భీమన్నలను వదలివేస్తారు. రాఘవరావుకు పదేళ్ళ కఠినశిక్ష విధిస్తారు.

నాటికికోర్టు మూసేస్తారు. ఎవరిమట్టుకువారు వెళ్ళిపోతారు.

మరివారం రోజులకల్లా జడ్జీగారింట్లో వివాహం, మహావైభవంగా జరిగింది పద్మా శంకర్రావులవివాహం. శంకర్రావుతనకింత మహోపకారంచేసిన ఆనందరావు నెంతయో కొనియాడుతాడు. ఇంతశ్రమపడినందులకు పద్మకు తానుకోరిన ఫలంలభిస్తుంది. శంకర్రావుతో సుఖంగా ఆనందంగా కాలంవెల్లబుచ్చుతుంది.

పాపంపదిరోజులకు రోగపీడితుడగు రాఘవరావు శిక్షఅనుభవించకుండగనే శాశ్వతంగా కన్నుమూస్తాడు.

సమాప్తం

మా గ్రంథమండలి పుస్తకములు యీ దిగువ స్థలములలో దొరకును.



1. హిగిన్ బాదమ్స్‌వారి అన్ని రైల్వే బుక్ స్టాల్సు
2. వేంకట్రామా అండ్ కో; వారి అన్ని బ్రాంచీలు
3. సరస్వతీ బుక్కుడిపో, బెజవాడ
4. కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్, రాజమండ్రి
5. సిరికి అప్పలస్వామి అండ్ సన్సు, రాజమండ్రి
6. ఈశ్వర బుక్ డిపో రాజమండ్రి.

# కాలచక్రము

కీ॥ శే॥ కవిశేఖర భోగరాజు నారాయణమూర్తిగారు.

వెల **2-8-0**

ఇందు కాలప్రభావమువల్ల ఓడలు బండ్లగుచున్నవి. బండ్లు ఓడ లగుచున్నవి. నేడు దరిద్రులుగా నున్నవారు దైవవశమున అతి సంపన్నులగుట; లక్షాధికారులు, జమీందారులు కన్నుమిన్ను గానక దుర్వ్యయము, అతిపోకడలుకు పోవుటవల్ల భిక్షాధికారులగుట-సంఘీయములో అనేక పరివర్తనలు శాఖాంతర వివాహములు, వితంతూద్వాహములును తేటతెల్లముగ వర్ణింపబడినవి.

అభిప్రాయములు :

'గ్రంథకర్త ఖద్దరు అభిమానము, దేశభక్తి సర్వత్ర గోచరించుచున్నది - ఖద్దరునే వీరు భార్యాభర్తలకు సంధానసాధనము గాభావించియున్నారు. మానవుల చిత్తవృత్తులను మార్చుమహిమ ఖద్దరులో నుండనోపు. వీరి యభిప్రాయము నాతితీవ్రమగుటచే అందరికి సమ్మతముగానే యుండవచ్చును-గ్రంథకర్త కథను గ్రాంధిక భాషలోను సంభాషణలను విశాఖపట్నం 'యాస' లో నడపియున్నారు. పాత్రలన్నియు సజీవమైనవిగాను, వ్యక్తిత్వముకలవిగాను ఉన్నవి. అత్యంతపాఠ్యయోగ్యముగా నున్నది— భారతి.

'ఇందులో కామదూషితులైన విద్యార్థుల దుశ్చర్యలు, ధనమదాంధులఅధికారవ్యామోహం, వారిదుష్టచర్యలు, తార్పుడుగాండ్ర నయవంచకాలు, దరిద్రుల ఇక్కట్లు, కాసుకు గతిలేని వారసులదురాశ వగైరా వర్తమానాంధ్రసమాజంలో ఎల్లెడల కానవచ్చు అనేక సంగతులు వర్ణింపబడ్డాయి. శైలి గ్రాంధికమయినా సరళంగా వున్నది—'

ఆంధ్రపత్రిక.

మూడు, నాలుగు :-

# శు భ వా ర్త

(1, 2 భాగాలు)

సహదేవ సూర్యప్రకాశరావుగారు.

ఒక్కొక్క భాగము వెల రు 1-8-0.

# వాణీగ్రంథ మండలి, రాజమహేంద్రవరము.

## ఉద్దేశ్యములు.

ఈ గ్రంథ మండలిలో నవరసభరితములైన నవలలు, కథలు, రాజకీయములు, శాస్త్రములు మొదలగు పుస్తకములు వెలువడును.

1. ఈగ్రంథ మండలిలో రెండు నెలలకొకపుస్తకముచొప్పున వెలువడును.

2. ఈగ్రంథ మండలిలో చందాదారులగువారు ప్రవేశ రుసుము రు 0—8—0 లు చెల్లించవలెను.

3. గ్రంథములను చందాదారులకు అందజేయుటకగు ఖర్చులను వారే భరించవలెను.

4. ఈ గ్రంథ మండలిలో వెలువడు ప్రతిగ్రంథమును చందాదారులు పుచ్చుకొనుచుండవలెను. కాని వెనుకటి పుస్తకములు పుచ్చుకొనవలెననెడి నిబంధనలేదు. వలయువారికవి చందాదారుల కిచ్చు వెలకే యీయబడును.

ఈగ్రంథ మండలిలో ఆంధ్ర భాషాభిమానులెల్లరు చందాదారులుగచేరి, మాగ్రంథమండలిని ప్రోత్సాహపఱచగలందులకు గోరుచున్నారము.